

# శ్రీ న్యాయపతి రాఘవరావు

(హైదరాబాదు)

అన్నయ్యగా అబాలగోపాలానికి పరిచితులై మద్రాసు, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రాలలో బాలల కార్యక్రమాల నిర్వాహకులుగా, వాటికొక విశిష్టతను సమకూర్చినారు.

1945 లో ప్రథమ బాలల పత్రిక "బాల" ను స్థాపించి, దానికి సంపాదకులుగా తెలుగు పిల్లలకు ఒక పత్రికను అందజేశారు.

కొన్ని పిల్లల పాటలను రికార్డులుగా వెలువరించారు; కొన్ని పిల్లల చలనచిత్రాల నిర్మాణానికి తోడ్పడి బాలకళా రంగానికి కొత్త వన్నెలు చేకూర్చారు.

ఆంధ్ర బాలానంద సంఘాన్ని స్థాపించి, రాష్ట్రస్థాయిలో పిల్లల మహాసభలను జరిపి, బాలోద్యమాన్ని పటుతరం చేశారు. "బాలల అకాడమి" కి గౌరవ కార్యదర్శిగా వుండి, బాలల సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలలో కొత్తతీరుతెన్నులను కల్పించడానికి కృషిచేశారు.

---

## ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ప్రచురణల సంఘం

**అధ్యక్షులు**

కళాప్రపూర్ణ డా॥ బోయి భీమన్న

**సభ్యులు**

డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు
శ్రీ మండా సూర్యనారాయణ (మసూనా)
శ్రీ రావూరి భరద్వాజ
శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు
శ్రీ ఘులామ్ యాశీన్
శ్రీ ఏడిద కామేశ్వరరావు (సంపాదకులు)
శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ (సమావేశకర్త)

# పసిడితెర
(నాటికలు)



సంకలన కర్త :

న్యాయపతి రాఘవరావు

సమీక్షకులు :

నండూరి రామకృష్ణమాచార్యులు

ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ

R T, బర్కత్‌పురా క్వార్టర్సు, హైదరాబాదు - 500 027.

సంకలనాల శ్రేణి : 3

ప్రథమ ముద్రణ : (C) 1979



ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ
ప్రచురణ : నవంబరు, 14, 1979.

**వెల : రు. 5-00**

ముద్రణ :

కృష్ణా ప్రింటర్స్, అండ్ ప్యాకేజర్స్
బర్కత్‌పురా, హైదరాబాదు-500027

ప్రకాశకులు :

ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ
34/4RT, బర్కత్‌పురా క్వార్టర్సు,
హైదరాబాదు - 500 027

# వి న తి

బాలలు మన హృదయాలు పూచిన పసిడిమొగ్గలు. ఆ మొగ్గలు నిగ్గుదేరి, వివిధ వర్ణాలతో విప్పారిన, పరిమళ శోభితమైన ఆమని వికసిస్తుంది. ఆ ఆమని అమృత మయం కావడానికి పాటుపడే కృషీవలులం మనం. ఆ కృషి ఎంత పవిత్రమైనది! ఎంత ఆనందకరమైనది! అదే బాలానందం!.........అదే బ్రహ్మానందం!..........''

పూజ్య బాపూజీ వంటి పవిత్ర భావుకుల భావన లివి. ఆ భావనలే, మన బాలల అభ్యుదయ కార్యక్రమాలకు కరదీపికలు అవుతున్నవి.

ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ అవతరించినదాదిగా, ఈ ఆశయ సాధనకే అహరహమూ కృషి చేస్తున్నది. విద్యా, సాంస్కృతిక, కళా, వైజ్ఞానిక రంగాలలో బాలల మనోవికాసానికి తోడ్పడుతూ వారిలో అజ్ఞాతంగా వుండే కళాభినివేశాలకు ప్రేరణ కల్పించే చర్యలను చేపట్టి, బాలల సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయడమే ధ్యేయంగా బాలల అకాడమీ పని చేస్తున్నది.

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా, బాలల అకాడమీ చేకొన్న వివిధ కార్యక్రమాలలో "బాల వాఙ్మయ సంకలనాల" ప్రచురణ ఒకటి.

బాల వాఙ్మయంలో ప్రముఖులగువారు సంతరించిన ఈ సంకలనాలు— నాటికలు, నృత్య నాటికలు, కథలు, గేయాలు, పొడుపుకథలు, జీవిత చరిత్రలు వివిధ శాఖలకు చెందిన సంకలనాలు సంపుటాలుగా ప్రచురితములైనవి. ఇది ఎంతో సంతో షింపదగిన విషయం.

"చిన్నారి బాలలకు చిన్నిపుస్తకాలు" అనే ఆశయంతో వెలువడుతూ వున్న ఈ పుస్తకాలు బాలల నలరించగలవని ఆశిస్తూ ఈ కార్యక్రమం ఫలప్రదం కావడానికి సహాకరించిన వారందరికీ నా అభివాదాలను తెలుపుతూ వున్నాను.

ఇట్లు,

టి. హయగ్రీవాచారి,
అధ్యక్షులు,
ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి.

హైదరాబాదు.
14 నవంబరు, 1979.

# ప రి చ య ం

ఈ సంకలనంలో కొన్ని నాటికలు ప్రచురింపబడినవి. నాటికల ఎంపికలో ముఖ్యంగా నేను చూచినది— 1. కథా వస్తువు. 2. రంగస్థల ప్రదర్శనకు యోగ్యత, అనుకూలత.

పౌరాణిక నాటికలు, చరిత్రాత్మక నాటికలూ, జానపద గాథలు, అటులనే చిన్నారి బాల్వాడీ ప్రాథమిక బడి బాలలకొరకు వ్రాయబడిన నాటికలూ, ప్రహసనాలూ యీ సంకలనంలో చేర్చలేదు. కేవలం బాలల దైనందిన జీవితంలోని సాంఘిక సమస్యలను కథా వస్తువుగా రచించిన నాటికలనే ఎంపిక చేశాము. హాస్య రసానికీ, కరుణ రసానికీ ప్రాధాన్యత యిచ్చాము. నాటికారచనలో నూతన పోకడలకూ, నూతన ప్రక్రియలకూ కూడా ప్రోత్సాహం యివ్వబడినది.

ఈ సంకలనములోని రెండు నాటికలు తప్పించి మిగిలిన నాటికలన్నిటినీ రంగస్థలంపై ప్రదర్శించగా చూచాను. వాటిలో ఆకాశవాణి, దూరదర్శన్ లలో ప్రసారితమైనవి ఉన్నాయి. బాలల నాటికల పోటీలలో బహుమతులు అందుకున్నవి కూడా వున్నాయి.

ఈ సంకలనంలోని నాటికలేకాక, ఇంకా ప్రచురణార్హమైన నాటికలు లేకపోలేదు. ముమ్ముందు అకాడమీ తలపెట్టిన సంకలనాలలో వాటికి తావు గలుగ వచ్చని ఆశిద్దాం.

న్యాయపతి రాఘవరావు (అన్నయ్య).

సంకలన కర్త.

# మనలో మాట

"నాటకాంతం హి సాహిత్యం"— అన్నారు సంస్కృతంలో తలనెరసిన పెద్దలు. సాహిత్య ప్రక్రియలలో నాటకము తలమానికం అని అన్ని భాషలవారు అంగీకరిస్తారు.

ఎవరైనా పుస్తకాలను చదవటం మాత్రమే చాలదు. మనుష్యుల్ని గూడా చదవాలి. మనలో మన మాట. ఏ నాటకమైనా ఈ సువిశాల జగన్నాటకంలో ఒక అంతర్నాటకమే గదా. అందుచేతనే— "లోకవృత్తాంతదర్శకం నాటకం" అన్నారు విజ్ఞులు.

అన్ని కళలకు ఆద్యప్రకృతి ప్రాథమిక మానవుని హృదయం. మొట్టమొదట ఆట వికుడిగా ఉన్న మానవుని సుకుమార హృదయం ఉప్పొంగినపుడు అతడు గంతులు వేస్తూ గొంతెత్తి ఆడాడు. పాడాడు. అప్పుడు ఆ ఆటనుండి నృత్యకళ, పాటనుండి గానకళ, మాటనుండి- కవితాకళ ఉద్భవించాయి. ఈ మూడు లలిత కళలు- పెరిగి- పెద్దవై వయసు వచ్చిన పిమ్మట మళ్ళీ ఒకచోట నాటక కళలో తిరిగి కలిసాయి. అంతేగాక నాటక కళలో ఎన్నో కళలు- చిత్రలేఖనం- ఆహార్యం- శిల్పం- జంత్రమేళనం, మున్నగునవి చేరాయి. అందుచేత నాటక కళ— కన్నుల పండుగ— వీనుల విందు.

చిన్నపిల్లలు పది పుస్తకాలు చదువుతే రాని విజ్ఞానం— ఒక మంచినాటకం చూస్తే వస్తుంది. బాలల అకాడమీవారు ప్రచురించిన ఈ నాటికల సంపుటి ఈ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచంలోని బాలబాలికలకు వెలుగు బాటలు చూపిస్తుందని విశ్వసిస్తున్నాము, ఏ నాటికలో అయినా కనిపించేది మానవ మానసక్షీరసాగర మథనం. అందులో కామ ధేనువులు ఉద్భవిస్తాయి. కల్పవృక్షాలు ఆవిర్భవిస్తాయి. హాలాహలం అంతకు ముందే పొగలు సెగలు గ్రమ్మవచ్చు. దానిని రచయితలు- జాగ్రత్తగా కక్కలేక మ్రింగలేక గొంతు లోనే దాచుకుంటారు. జగన్నాటకంలోని సన్నివేశాలు అనంతాలు. ఈ నాటికల సంపుటిలో ఏవో కొన్ని కొన్ని సన్నివేశాలు మాత్రమే ఉన్నాయి. ఏ సంకలనమూ అన్నిటినీ చూపలేదు. అందుచేత ఈ సంకలనం అసమగ్రం అని అంగీకరించక తప్పదు. అయితే ఇందులో ఉన్న నాటికలు — బాలబాలికల అభిమానాన్ని చూరగొనగలవని నమ్ముచున్నాము. అన్నీ ప్రయో గార్హములే. కొన్ని వినోదదాయకములు. కొన్ని విజ్ఞాన ప్రబోధకములు. అన్నీ — మెదడులో మెరపు తీగలను ఝళిపించి మిరుమిట్లు కొలిపేవే. కొన్నిటిలో పాటలు గూడా ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు ఈ ప్రపంచమే పెద్ద ప్రహసనం అనిపిస్తుంది. అందరు ధరించే భూమికలు పగటి వేషాలే అనిపిస్తుంది. ఈ నాటికలు అన్నీ చిన్న పిల్లలు వేయదగినవే.

ఈ సంకలనంలోని భూమికల ఆహార్యాల గూర్చిన బొమ్మలు—పాటలకు టేపు రికార్డు చేసిన సంగీతం...కాలక్రమమున బాలల అకాడమీ సమకూర్చ గలదని ఆశించుదాం.

ప్రకృతి సహజంగా ఈ సంకలనం అసమగ్రమైనదే. అందుచేత మరికొన్ని సంకలన సంపుటాలను కాలక్రమమున బాలల అకాడమీ ప్రచురించగలదని నమ్ముచున్నాము.

నండూరి రామకృష్ణమాచార్య

# మనవి

నాటకం సర్వ కళాశోభితం. అందుకే అది సర్వజనాదరణను పొందుచున్నది.

అనంతము, అతి విశాలము అయిన ఈ లోక వృత్తాన్ని అతి సూక్ష్మ రూపంలో నాటకం, రంగస్థలంమీద ప్రదర్శించి చూపుతుంది.లోకాన్ని, సంఘ మన స్తత్వాన్ని అవగాహన చేసికొన గలుగునంత శక్తిలేని బాలలకు — అట్టి పరిశీలనను, అవగాహనను సులభతరం చేసి చూపుతున్న నాటకం ఎడల ఎంతో ఆసక్తి, అభిమానము ఏర్పడటం సహజం.

అయితే, పిల్లలకు పనికి వచ్చే నాటికలు తగినంతగా వెలువడలేదనేది నిర్వివాద మైన విషయం. దీనికి తోడు పిల్లల నాటకాలను రచించే భాష, విధానంపై కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతూంటాయి. సిద్ధాంతపరమైన భిన్నాభిప్రాయాలు ఎన్ని వున్నా, అసలు ప్రక్రియపట్ల ఏకాభిప్రాయం వుండడం హర్షింపదగినదైవుంది.

"సరళమైన భాషలో, బరువులేని భావాలతో, పిల్లలు తెలుసుకోదగిన కొత్త విషయాలను పరిచయం చేసే ప్రయత్నంతో — చక్కని కథా సంవిధానంతో వినో దాత్మకంగా చెప్పాలి...." బాలసాహిత్యానికి, ముఖ్యంగా నాటికల రచనకు వుండ వలసిన లక్షణాలు ఇవీ—అని పెద్దలు నిర్ధారణ చేసివున్నారు.

ఈ దృష్ట్యా చూచినట్లయితే నేటి బాల సాహిత్యవేత్తలు బాలనాటికా రచనలో ఇతోధికమైన కృషి చేస్తూ వుండడం కనపడుతుంది—ఇది సంతోషింప దగిన విషయం.

ఉన్నంతలో అట్టి నాటికలను కొన్నిటిని ప్రచురించాలనే ఆంధ్రప్రదేశ్ బాలలఅకా డమీ సంకల్పానికి దోహదమిచ్చే కొన్ని నాటికలను సేకరించి సంకలనం చేసి ఇచ్చిన శ్రీ న్యాయపతి రాఘవరావు గారికి, ఈ సంకలనాన్ని సమీక్షించిన శ్రీ నండూరి రామ కృష్ణమాచార్య గారికి, శీర్షికల చిత్రాలను రచించిన శ్రీ యమ్. కనకసూరిబాబు గారికి, ముద్రణాది కార్యకలాపాలలో సహకరించిన శ్రీ డి.రామలింగంగారికి తదితర పెద్దలకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ తన అభివాదాల నందిస్తున్నది పిల్లలకు చిన్న చిన్న పుస్తకాలను అందియాలనే అభిప్రాయంతో — ఈ సంపుటిలో కొన్ని నాటికలను మాత్రమే ప్రచురించగలిగాము. మరికొన్ని నాటికలను చేర్చి, మరొక సంపుటిగా, యథావకాశాన్నిబట్టి ప్రచురించగలమని మనవి.

ఏడిద కామేశ్వరరావు

(సంపాదకుడు)

## ఇందులో...




ఈ నాటకం ఒక బొమ్మల దుకాణంలో జరుగుతుంది. చిన్నారి బాలలు, బాలికలు రక రకాల బొమ్మల వేషాలు వేసికొని కదలక మెదలక బొమ్మల్లాగ నిలుచుని ఉండాలి.

షాపు యజమాని ఇద్దరు నౌకరులను పెట్టి దుకాణాన్ని నడిపిస్తాడు. ఆ నౌకరుల చేతిలో దుమ్మును దులిపే గుడ్డకర్రలు ఉంటాయి. కదలక మెదలక ఉన్న బొమ్మల వెనుకవైపు (వీపున) "కీ" ఇస్తే ఆ బొమ్మలు ఆయా పాత్రలను అభినయిస్తాయి.

ఉదాహరణకు : నాట్యంచేసే బొమ్మ వీపున "కీ" ఇస్తే ఆ బొమ్మ నాట్యం చేస్తుంది. ఈ షాపులో ఉన్న బొమ్మలకు అది ఒక ప్రత్యేకత.

## పాత్రలు

సేట్ జీ — దుకాణాధికారి

మస్తాన్ — ముస్లిం నౌకరు

యాదగిరి — తెలుగు నౌకరు

మొదటి బేరము — స్త్రీ, ఆమె కూతురు

రెండవ బేరము — ఆధునిక స్త్రీ

మూడవ బేరము —ఆంగ్లో ఇండియన్ స్త్రీ

## బొమ్మలు

నమస్తే బొమ్మ

డాన్సు బొమ్మ (భరతనాట్యము)

హనుమంతుడు బొమ్మ

"ట్విస్ట్" నృత్యంచేసే బొమ్మ

పోలీసు బొమ్మ

బాక్సింగ్ బొమ్మలు (2)

తబలా వాద్యగాడు - బొమ్మ

హార్మోనియం వాయిస్తున్నట్లు-బొమ్మ

రెక్కల దేవత బొమ్మ

**గమనిక :**

పిల్లలకు ఆయా బొమ్మల దుస్తులు మేకప్ వేయవలయును.

**కావలసిన పరికరములు :**

సేట్‌జీకి గల్లాపెట్టె, కుర్చీ, టేబిలు, దుమ్మును దులిపే గుడ్డకర్రలు, కప్పు, సాసరు. బొమ్మలకు 'కీ' ఇచ్చుటకు కావలసిన గడియారం 'కీ'. నేపథ్యంలో పాట పాడే పిల్లలు. ఆయా ధ్వనులను వినిపించే వ్యక్తులు, నేపథ్య, వాద్య విశేషములు ఉంటే నాటిక చాలా రక్తి కడుతుంది.

* * *

# కీ - మరబొమ్మలు

## రంగము : ఒక బొమ్మల దుకాణం

(నేపథ్యంలో కోరస్)

బొమ్మలు బొమ్మలు
బొమ్మలు కీ మరబొమ్మలు
ఆటలు ఆడే బొమ్మలు
నాట్యంచేసే బొమ్మలు
గిరగిర తిరిగే బొమ్మలు
చరచర నడిచే బొమ్మలు
తకనీం తకనీం బొమ్మలు
తైతకలాడే బొమ్మలు !!

(ఈ పాట నేపథ్యంలో పాడుతూ వుండగా నౌకర్లు బొమ్మలను దులుపుతూ వుంటారు.)

(తొమ్మిది గంటలు టంగ్ టంగ్ మని మ్రోగుతాయి.)

మస్తాన్ : ఒరేయ్ భాయి యాదగిరీ, 9 గంటలు వేశారు. ఈవేళ ఒక్క బేరంకూడా తగలలేదు !

యాద : సేట్‌జీ ఇంకా రాలేదు, వస్తే ఏమంటాడో !

మస్తాన్ : ఊ ! బేరం రాకపోతే మనం ఏం చేస్తాం ?

యాద : అదుగో సేట్‌జీ వస్తున్నాడు.

(ఇద్దరూ బొమ్మలన్నీ దులుపుతూ వుంటారు)

(సేట్‌జీ ప్రవేశము)

మస్తాన్ : సలాం, సలాం. సేట్‌జీ.

యాద : దండాలు దొర ! దండాలు !

సేట్ : ఆఁ బేరాలేమైనా వచ్చాయా ?

మస్తాన్ : నహీ సాబ్ !

యాద : పొద్దుట్నుంచి బొమ్మల్ని ఒకటే దులుపుతున్నాం. ఎంత దులిపినా ఏం లాభం ? ఒక్క బేరంకూడా తగల్లేదు దొరా !

సేట్ : ఒరేయ్ మస్తాన్! నువ్వు హొటలుకు పోయి ఒక కప్ చాయ్ తీసుకురా. అదేమిటిరా యాదగిరి! అలాచూస్తూ నిలుచున్నావు? బొమ్మలకు 'కీ' గట్రా సరిగా ఉన్నాయో లేదో చూచుకున్నావా ?

యాద : ఓల్‌రైట్ దొరా (డ్రాయరులోంచి రెండు కీలు తీస్తాడు. మస్తాన్ టీ తెస్తాడు. సేట్‌జీ సాసర్‌లో పోసుకుని తాగబోతూ వుండగా)

(ప్రవేశం : స్త్రీ, ఆమె కూతురు)

సేట్ : రండమ్మగోరూ రండి ! రండి !

తల్లి : ఏమండీ ! మీ షాపులో కొత్తరకం మర బొమ్మలు వచ్చాయట, ఏవీ చూపరూ !

సేట్ : ఒరేయ్ మస్తాన్ చూపరా ! ఆ ఢిల్లీ బొమ్మ –

(మస్తాన్ ఆ బొమ్మ దింపుతాడు)

తల్లి : ఈ బొమ్మ ప్రత్యేకత ఏమిటండీ !

సేట్ : ఇది గుడ్ మార్నింగ్ బొమ్మ.

మస్తాన్: దీనినే భాయి భాయి బొమ్మంటారండీ!

యాద : అదేనండీ– నమస్తే చెబుతుంది !

తల్లి : ఏదీ ఏదీ చూపించు,

సేట్ : 'కీ' ఇవ్వరా దానికి

(యాదగిరి 'కీ' ఇస్తాడు. బొమ్మ యాక్ట్ చేస్తుంది)

(నేపథ్యంలో పాట)

సగపా – సగపా

గుడ్ మార్నింగ్–గుడ్ మార్నింగ్

ఆదా బరజ్–ఆదా బరజ్

నమస్తే – నమస్తే

కూతురు: అమ్మా! అమ్మా ! ఆ బొమ్మ కావాలే!

తల్లి : స్. నువ్వూరుకో ! దీని ఖరీదెంతండీ!

సేట్ : ఇది లేటెస్ట్ బొమ్మండీ — దీని ఖరీదు 199 రూ॥ 50 పైసలేనండీ !

తల్లి : చాలా ఖరీదు చెబుతున్నారే !

కూతురు: అమ్మా ! ఆ బొమ్మ నాకు కావాలే ! ఊ... ఊ......

తల్లి : ఇస్ ! ఊరుకో ! ... ఇంకో బొమ్మ కాస్త తక్కువ ఖరీదుది చూపండి... దీని ఖరీదు ఎంతండీ ?

(భరతనాట్యం బొమ్మను చూపుతూ)

యాద : ముందు దీని నాట్యం చూడండి అమ్మగారు !

సేట్ : దీనిని తంజావూరునుంచి తెచ్చామండీ. మీనాక్షిసుందరంపిళ్ళై దగ్గర డాన్స్ నేర్చుకుంది. చూపరా యాదగిరీ!

(యాదగిరి 'కీ' ఇస్తాడు)

(నేపథ్యంలో)

ధీం తననా తననా

తనననా, ధీం తననా !!

(బొమ్మ ఆడుతూ వుంటే మస్తాన్ కూడా ఆడుతాడు)

('కీ' తగ్గిపోతుంది)

సేట్ : ఒరేయ్ ఫూల్... 'కీ' ఇవ్వరా బొమ్మ ఆగిపోతోంది !

('కీ' ఇస్తాడు. తిరిగి డాన్స్)

తల్లి : ఈ బొమ్మ బాగుందండీ ! దీని ఖరీదెంతండీ ?

సేట్ : ఓన్లీ రూ. 250.

తల్లి : సరిసరి నిమిష నిమిషానికి ఖరీదులు పెంచేస్తున్నారే ! పదమ్మా ! ఇంకో షాప్‌కి వెడదాం......

కూతురు: అబ్బ ! నాకా బొమ్మ కావాలే !

తల్లి : పదా ! నీకు మంచి కొండపల్లి బొమ్మ కొని పెడతానులే !

(లాక్కుపోతుంది)

సేట్ : కూర్చోండమ్మా కూర్చోండి... మీకు ఇంకో బొమ్మ చూపిస్తా–చూపరా అది.

యాద : ఇదిగో ఈ బొమ్మ చూడండమ్మ గారు ! దీనిని భద్రాచలం నుంచి తెచ్చాం..... గొప్ప రామ భక్తుడు. ఒరేయ్ మస్తాన్ 'కీ' ఇవ్వరా...

('కీ' ఇస్తాడు)

(నేపథ్యంలో పాట)

రామనామం రామనామం !

రామనామం రామనామం !

రామదాసులైనవారికి

రమ్యమైనది రామనామం !!

(హనుమంతుడు భజన చేస్తున్నట్టు నటిస్తాడు)

కూతురు: అమ్మా నాకా కోతి కావాలే !

యాద : కోతి అనకూడదమ్మా. భద్రాచల రామభక్తుడు, హనుమంతుల వారు అనాలి.

తల్లి : దీని ఖరీదెంతండీ.

సేట్ : 99 రూ. 99 పైసలు !

తల్లి : నీ మొహం ! నూరు రూపాయలనలేక పోయావూ ? పదవే ! ఇంకో షాపుకి పోదాం.

కూతురు: ఊహు, ఊహూ. ఊహు (ఏడుపు)

(వీపుమీద తల్లి ఒకటి వేసి తీసుకుపోతుంది)

(సేట్‌జీ తెల్లబోయి చూస్తూవుంటాడు)

మస్తాన్ : సాబ్ ! చాయ్ చల్లారి పోతోంది తాగండీ

(సేట్‌జీ కప్పును తీసి తాగబోతుండగా)

(ప్రవేశం ఒక లేడీ అండ్ సన్)

లేడీ : గుడ్ మార్నింగ్!

సేట్ : (తాగుతున్నకప్పు తిరిగి టేబిల్ మీద పెట్టి) గుడ్ మార్నింగ్. కమిన్ ప్లీజ్ !

లేడీ : ఓహ్ ! దే ఆర్ నైస్ !

సన్ : మమ్మీ ! మమ్మీ ! ప్లీజ్ బై మి దట్ డాల్

లేడీ : వెయిట్ మై బోయ్ (దొరల యాక్షన్‌తో) ఏదండీ ! ఆ బొమ్మలు ఎలా ఆడతాయో చూపరూ.

సేట్ : చూపించరా !

(యాదగిరి తీసుకుని తబలాబొమ్మ వెనక్కి వెళ్తాడు)

లేడీ- : ఇవన్నీ మెకానికల్ టాయ్స్‌లాగా వున్నాయే !

సేట్ : అంతేకాదండీ, కొన్ని కొన్ని మాట్లాడుతాయి కూడానూ! ఇదిగో ఈపోలీసుని చూడారా ! వీడిచేత మాట్లాడిస్తాను. ఒరేయ్ మస్తాన్ దీనికి 'కీ' ఇవ్వరా

('కీ' ఇస్తాడు)

మస్తాన్ : ఏయ్ పోలీస్! నీ నెంబరు ఎంత ?

పోలీస్ : 420

సన్ : మమ్మీ, ఐ వాన్ట్ దట్ పోలీస్ మమ్మీ

లేడీ : వెయిట్ మై సన్, ఇంకేవేనా చూపించండి.

యాద : ఇదిగో ఇది చూడండి, ఈ తబలా బొమ్మని లక్నోనుంచి తెప్పించాం.
('కీ' ఇస్తాడు తబలా దరువులు)

లేడీ : దీని ఖరీదు ?

సేట్ : 500 రూపీస్ మేడమ్ !

లేడీ : ఓ మైగాడ్ ! చాలా విపరీతపు ధరలు చెబుతున్నారే !

సన్ : మమ్మీ ఐ వాన్ట్ దిస్ పోలీస్ మమ్మీ

లేడీ : ఆ పోలీసు ఖరీదు ఎంతండీ ?

యాద : వాడి నంబరు ఎంతో ఖరీదు కూడా అంతేనండి, 420 రూ.

లేడీ : టూ మచ్!... ఆ వెనక్కున్న రెండు బొమ్మలూ... అవి ఏమిటి ?

సేట్ : అవి ఒలింపిక్ బొమ్మలు. బాక్సింగ్ చేస్తాయి,

లేడీ : ఏదీ చూపండి

(మస్తాన్, యాదగిరి వెళ్ళి రెండింటికి 'కీ' ఇస్తారు. అవి మల్లయుద్ధం చేస్తాయి)

లేడీ : వెరీ గుడ్, అవి మాకువద్దుగానీ– ఇదేమిటి ఈ బొమ్మ ?

సేట్ : అదా ! అది బఫూన్ బొమ్మండి. అమెరికన్ సర్కస్‌నుంచి తెప్పించారు.

మస్తాన్: (కుర్రవానివైపు తిరిగి) ఈ ఛోటా సాబ్‌కి ఇది పసంద్.

(ట్విస్ట్ బొమ్మకు 'కీ' ఇస్తాడు. బొమ్మ ట్విస్ట్ చేస్తూవుంటే కుర్రాడు దానితో కూడా ట్విస్ట్ చేస్తాడు)

సన్ : మమ్మీ ఐ వాన్ట్ దట్ డాల్ మమ్మీ! ఐ లవ్ ఇట్.

యాద : దీని ఖరీదు సరిగా వెయ్యి రూపాయలు, తీసుకోండి.

లేడీ : నొా, నొా, నొా, నొా, అబ్‌నార్మల్. ఫన్టాసిక్ ప్రయిసెస్.

సన్ : మమ్మీ, మమ్మీ ఐ వాన్ట్ ఇట్ మమ్మీ.

లేడీ : నొా, నొా, నొా, (కుర్రవాడు ఏడుస్తూ వుండగా లాక్కుపోతుంది)

(సేట్‌జీ తెల్లబోయి చూస్తాడు)

(మస్తాన్ చల్లారి పోయిన టీ కప్పు తెచ్చి అందిస్తాడు)

యాద : దొర! నేనొకటి అడుగుతా క్షమించాలి

సేట్ : (కోపంగా) ఏమిటీ ?

యాద : మ మ మ మరీ ! మ మ ......

మస్తాన్: మె మె మె బోత్రే క్యారే ! బోలో !

యాద : మమ మరీ, ఈ బొమ్మలకి ఇంతింత ఖరీదులు పెడితే ఎవరు కొంటారు దొరా ?

సేట్ : పోరా ! కొన్నవాళ్లే కొంటారు, మన లాభాలు మానుకుంటామా ?

(ఠంగ్: గంట)

సేట్ : అరె ఒంటిగంట వేశారే ! నేను ఇంటికి పోయివస్తా, మీరు యీలోగా మీ ఖానా అవి చేసుకోండి.

యాద : అలాగే దొరా !

(సేట్ వెళ్ళాడు, మస్తాన్, యాదగిరి 'కీ' టేబిల్ డ్రాయర్‌లో పెట్టి తమ టిఫిన్ బాక్సెస్ తీసుకొని వెళ్ళిపోతారు)

(లైట్స్ డిమ్)

(దేవతబొమ్మ దిగివచ్చి, మిగిలిన బొమ్మల చెవుల్లో రహస్యం చెబుతుంది. తిరిగి తన సానానికి వెళ్లి నిలుచుంటుంది.)

హను : (మెల్లగాదిగి ముందుకు గెంతుతూవచ్చి చప్పట్లు కొట్టి మల్లుల్ని పిలుస్తాడు, మల్లులు దిగివస్తారు)

హను : అరెభాయీ. ఈ సేట్‌జీ మనల్ని కీలు బొమ్మల్లాగా ఆడిస్తున్నాడురా.

మల్లు : ఇన్‌సల్ట్.

హను : పాపం! ఆ పిల్లలు మనని కొందా మనుకుంటే యీ సేట్‌జీ బేరం పడ కుండా చేశాడు.

ట్విస్ట్ : మన ఖరీదులు పెంచేశాడు.

పోలీసు: వాడికి బుద్ధి చెప్పాలి.

అందరు: అవును, బుద్ధి చెప్పాలి.

హను : ష్! గోల చేయకండి. అయితే ఏం చేద్దాం?

అంద : స్ట్రయిక్ చేద్దాం స్ట్రయిక్.

కొండ : యుద్ధం చేసేద్దాం.

హను : అది కాదు నేను చెప్పినట్లు చేద్దాం (బొమ్మల చెవిలో ఏదో రహస్యం చెబుతాడు. బొమ్మలు ఓ.కె.గా తలలు ఊపుతాయి. పోలీసు ఎన్ట్రెన్స్ గేటు వైపు నిలుచుంటాడు. మల్లువీరులు— మధ్యబల్లమీద నిలుచుంటారు. హను మంతు వెళ్ళి టేబిల్ డ్రాయరు తీసి 'కీ' లు రెండూ తీసి దాచేస్తాడు)

హను ; ష్! గప్‌చుప్! మస్తాన్, యాదగిరి వస్తున్నారు.

(అందరూ కదలక మెదలక బొమ్మల్లా నిలు చుంటారు. మస్తాన్, యాదగిరి ప్రవేశం)

మస్తాన్ : అరె అల్లా. ఇదేమిటి. ఈ బొమ్మలు ఎవరు తీశారు ?

యాద : ఈ పోలీసుగాడు అక్కడుండాలి. ఇటు ఎలా వచ్చాడు ?

మస్తాన్ : డొంగల్ గింగల్ రాలేదు కదా!

యాద : ( టేబిల్ డ్రాయర్ తీసి ) అరె! ఇందులో 'కీ' లు వుండాలి ఏవీ ?

(ఇద్దరూ 'కీస్' కోసం వెతుకుతూ వుండగా సేట్ ఒక వారసాని కస్టమర్‌తో ప్రవేశం)

సేట్ : ఇదిగోనండీ! ఇదే మాకొత్తషోరూమ్— అన్నీ మరబొమ్మలే. కొన్ని మాట్లాడు తాయి కూడాను.

లేడీ : ఓహ్! ఐ సీ.

సేట్ : ఒరేయ్! ఏమిటి వెతుకుతున్నారురా? బొమ్మలకు 'కీ' ఇచ్చి చూపండి—

యాద : అదే వెతుకుతున్నాము దొరా!

మస్తాన్ : ఆ చాబీలు పోయాయి దొరా! అంతా గల్లంతుగా వుంది.

సేట్ : అరే! ఈ కోతిబొమ్మ ఇటు ఎలా వచ్చింది ?

మస్తాన్ : అరే అల్లా! ఈ కోతి కదుల్తోంది.

యాద : బాబోయ్! మనమీదకే వస్తోంది!

సేట్ : ఇదేమిటి! నామీదకే ఉరుకుతోంది!

2వ లేడీ: (భయపడి ఇటుఅటు పరుగెత్తి పారి పోతుంది.)

(సేట్‌జీ గబగబ తన గొడుగును చంకలో పెట్టుకొని వెళ్ళబోతూవుంటే)

పోలీసు : స్టాప్.

(వెనకవైపు పారిపోబోతూవుంటే— మల్లులు)

మల్లు : ఖబడ్దార్!

(కుడివైపు పోదామంటే కోతి)

(సేట్‌జీ ఎటువైపు పారిపోదామన్నా వీలు లేకుండా పోలీసు. మల్లులూ, హనుమంతూ ఆపివేస్తారు.)

హను : ఏయ్! ఆగు! మేము పిల్లల ఆట వస్తువులం, పిల్లలు ఆడుకోవడానికి మమ్ములను తయారుచేశారు, కానీ నీ లాభాల కోసం ధరలు పెంచావు. మాకు, పిల్లలకు మధ్యన నువ్వుఅడ్డు వున్నావు.

పోలీసు : ఊ......లెంపలు వాయించుకో.

హను : గుంజీలు తియ్యి! ఇలా అను...... నేను..... ఇకముందు......బొమ్మల ధరలు పెంచను. సరసమైన ధరలకే- అమ్ముతాను— లెంపలు వేసుకో—

సేట్ : వేసుకుంటా—వేసుకుంటా (లెంపలు వేసుకుంటా) ధరలు పెంచననీ లెంపలు వేసుకుంటా.

(లెంపలు వేసుకుంటూ వుండగా)

(తెర)



# కమల విమల

సోమంచి రామం

పాత్రలు : కమల, విమల, శాంత, సుభద్ర.

ప్రథమ దృశ్యాలంకరణ :— అది ఒక పడకగది. ఒక మంచము మీద ప్రక్కపరచి ఉంటుంది. ప్రక్కమీద విమల పడుకుని నిద్రపోతున్నట్టువుంటుంది. ప్రక్కనె కొంచెం దూరంలో నేలమీద లాంతరుముందు కూర్చొని కమల చదువుకుంటూ ఉంటుంది. ఇంకొక ప్రక్క ఎత్తయిన బల్లమీద పుస్తకాలు, గడియారం ఉంటాయి. గడియారం 8 గంటలు చూపుతూ ఉంటుంది. తెర లేచేసరికి కమల పాఠం చదుతూ ఉంటుంది.

# మొదటి రంగము

కమల : ప్రత్యక్ష దైవములనగా కంటికగుపడు దేవతలని అర్థము. మొదటి ప్రత్యక్ష దైవము తల్లి. రెండవ ప్రత్యక్ష దైవము తండ్రి, మూడవ ప్రత్యక్ష..

విమల : (ప్రక్కమీదనుంచే) అబ్బబ్బ! ఏమిటే పాడుగోల! కాసేపు పడుకోనియ్యక.

కమల : రేపటిపాఠం చదువుకుంటూంటే పాడు గోల అంటావేమిటి విమలా! పాఠం రాకపోతే మేష్టారు కేకలేయరా?

విమల : రేపు స్కూలుకు సెలవు. మరిచి పోయావా? రేపు మేష్టారు ఎలా కేకలేస్తారు?

కమల : రేపు కాకపోతే ఎల్లుండి అడుగుతారు! అప్పుడైనా తప్పదుగా చెప్పటం.

విమల : అందుకని అర్ధరాత్రి అయ్యేదాకా చదువుతానంటావు. అంతేనా? అయినా చూస్తున్నానులే! ఫస్టుమార్కు వచ్చిందని ఈ మధ్య నీకు మహా గర్వంగా ఉందిలే.

కమల : అవేం మాటలు విమలా? ఎవరేనా వింటే బాగుండదు. నాకేం గర్వ మొచ్చిందీ?

విమల : అయితే నాకేనా గర్వ మొచ్చింది! ఎంత మాటలు అంటున్నావో?..... నాకేమీ చదువురాదని, నేనొట్టి చవటననీకదూ నీకింత చులకన! మా అమ్మరానీ...

కమల : నేను ఇప్పు డేమన్నానని విమలా, అలా విరుచుకు పడతావు?

విమల : నువ్వనే మాటలు బాగున్నాయేం?... పైగా నే విరుచుకు పడ్డానంటావా? మా యింట్లో తింటూ నన్ను నీ యిష్టము వచ్చినట్లు నానా మాటలు అంటావా? సరేలే......

కమల : అదేమిటే విమలా! ..నిన్ను యిప్పుడే మన్నా అంటే క్షమించు. నీకు కష్టం కలిగించే మాటలేమన్నా అంటే నన్ను నాలుగుదెబ్బలు కొట్టు కావాలంటే...

విమల : మాటలకు దెబ్బలకు సాటా? సరా? నువ్వనరాని మాటలన్నీ అనేసి పైగా కొట్టమంటావా? ఒక్కొక్కమాటంటే ప్రాణాలు తీసేటట్టుంది. అభిమానంగల మనుష్యులు దెబ్బలకన్నా మాటలంటే పడిచస్తారు.

కమల : పోన్లే! విమలా! తెలిసో తెలియకో అన్నాను! ఇక ఊరుకో అమ్మా!. కాస్సేపు చదువుకొని పడుకుంటాను...

విమల : (ప్రక్క మీదనుంచి లేచి) అయ్యో! అయ్యో! నేను అమ్మతల్లినా? శక్తినా? ఎంతకసిగా ఉందీ నేనంటే-అనమ్మా! అను! నీ యిష్టం వచ్చినట్టు అను!

కమల : విమలా! ఊరుకోవూ! పిన్ని వింటే కేకలేస్తుంది.

విమల : వింటే ఏం?...... నన్నే కేకలేస్తుంది! నీకేం? నేనెలాపోతే నీకేం?

కమల : అవేం మాటలు విమలా? నిన్ను మాత్రం యెందుకు కేకలేయటం? నీవుమాత్రం యెందుకు తిట్లుతినడం?

విమల : ఎందుకేమిటి? నా ఖర్మ! ...అంతా నన్నేవాళ్లే!...అనండమ్మా! అనండి! నా ఖర్మ... అమ్మ అన్నా నన్నే! ... అన్నయ్యాన్నా నన్నే ... నువ్వన్నా నన్నే! నేనేగా అందరికీ లోకువ.

కమల : (ఇక వినిపించుకోకుండా పాఠం చదువుతూ ఉంటుంది) ఎల్లప్పుడును సత్ప్రవర్తన కల్గియుండవలెను. దుష్టులకు దూరంగా యుండవలెను...,

విమల : (పడుకున్నదల్లా లేచి) అయ్యో! అయ్యో! ... నేను దుష్టురాలనా! ... ఎన్నెన్ని మాటలు నేర్చావు?

కమల : నేను నిన్నేం అనటంలేదు విమలా! ఇది మన పాఠంలో ఉన్నది. కావాలంటే చూడు! (అని పుస్తకం ఇస్తుంది).

విమల : అక్కరలేదు! ఫో!... (అని పుస్తకం విసిరేసి పక్కమీద పడుకొని ముసుగు పెడుతుంది)

కమల : (వెళ్లి పుస్తకము తెచ్చుకొని చదువుకుంటూ ఉంటుంది) అపకారము చేసిన వారికైనా ఉపకారము చేయవలెను....

శాంత : (ఇంట్లోంచి ప్రవేశిస్తూ) ఏమే! విమలా! అప్పుడే పడుకున్నావు? ఎనిమిదేనా అయిందో లేదో అప్పుడే నిద్రటే! కమలా! ఎంతసేపయిందమ్మా విమల పడుకొని?

కమల : ఇప్పుడే పిన్నీ! పడుకుంది!

విమల : (ప్రక్క మీదనుంచి లేస్తూ) నాగురించి నువ్వేమీ చెప్పక్కర్లేదు. నీగొడవేదో నువ్వు చూసుకో.

శాంత : అదేమిటి విమలా! అలా విసిరి కొడతావు? ఇప్పుడేమందని?

విమల : ఏమంటేనేం? ఏమన్నా అంటుంది! నా ఖర్మగాబట్టి ఎవరేమన్నా పడాల్సిందేగా మరి!

కమల : ఇప్పుడు నిన్ను ఏమన్నానునీ ?

విమల : అనాల్సినవన్నీ అనేసి పిన్నివచ్చేసరికి నంగనాచిలా కూర్చున్నావు. పైగా ఏమీ అనలేదంటున్నావు?

శాంత : పోనీలే కాని, నువ్వులేచి చదువుకుంటావా లేదా?

విమల : రేపు శెలవే! రేపు చదువుకుంటాలే!

శాంత : అలాగంటే ఎలాగా! పరీక్షలు దగ్గర కొస్తున్నాయి! ఇలాగ పడుకుంటే ఎలాగ! రేపు ఫేలయితే?

విమల : పోనీలే! ఫేలయితే ఫేలవుతాను! నే ఫేలయితే మీ కందరికీ సంతోష మేగా?

శాంత : నువ్వు ఫేలయితే మాకు సంతోష మేవిటే? ఇలాంటి మాటలు మాట్లాడ్డం మంచిది కాదు విమలా! ఎవరేనా వింటే బాగుండదు. నలుగురూ నవ్వి పోతారు.

విమల : పోన్లే! నవ్వితే నవ్వుతారు!... నన్ను చూసేగా నవ్వేది! మీకేం? మీకేమీ పర్వాలేదులెండి!

కమల : (పుస్తకాలు సర్దుకొని లేస్తుంది)

శాంత : అదేమిటి కమలా! నువ్వు పుస్తకాలు సర్దేస్తున్నావు? నీకూ నిద్రవస్తోందా?

కమల : లేదు పిన్నీ! అర్ధరాత్రి కిరసనాయిలు ఖర్చెందుకు? రేప్పొద్దున్నే చదువుకుందామని.

శాంత : ఫరవాలేదమ్మా! గాలికి గడ్డపారలు కొట్టుకుపోతుంటే పుల్లాకులు నాగతేం కావాలన్నట్టు... ఈ సంసారం ఖర్చులో యీ కాస్త ఖర్చుకు మరేం ఫర్వాలేదు ... చదువు వచ్చే వాళ్ళైనా చదువుకోకపోతే యెలాగ? చదువుకోమ్మా, నిద్రవచ్చేదాకా చదువుకో.

విమల : అవుసమ్మా! అవును! దానికే చదువు వచ్చేది. అదే చదువుకొని ఐ.ఏ.యస్. ఆఫీసరమ్మగారయ్యేది. నా మొహానికే ముంది? ఓ చదువా? చట్టుబండలా? నాకో మెప్పా? మెహర్బానీయా?

శాంత : చదువుకుంటే నీకు మాత్రం ఎందుకు రాదు? నువ్విలా మొండికేసి పడుకొంటే రేపు పరీక్షల్లో కూడ యిలాగే పడుకోవాల్సివస్తుంది .. "చదువుకోవమ్మా" అని చిలక్కి చెప్పినట్లుచెప్తే చెవికెక్కదాయె! చదువుకోకపోతే యెవరేంచేస్తారు?

విమల : పోన్లెండి చదువురాకపోతే మరేం పర్వాలేదు. మీరంతా చదువుకొని పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయండి. మిమ్మల్నందరూ మెచ్చుకుంటారు.

శాంత : నీ వితండవాదం వింటూ కూర్చుంటే నాకు పనికాస్తా పాడు! నువ్వు పడుకున్న దానివి పడుకో! నీకెవ్వరూ చెప్పలేకుండా ఉన్నారు!... (యింట్లోకి నిష్క్రమణ)

కమల : (పాఠం చదువుతుంది) పెద్దలను గౌరవింపవలయును-తల్లిదండ్రుల మాట జవదాటరాదు....

విమల : ఇక్కడ చదవక్కర్లేదు. వెళ్లి... యింకో గదిలోకిపోయి చదువుకో. నేను పడుకోవాలి.

కమల : (తెల్లపోయి చూస్తూంటుంది)

విమల : అలా చూస్తావేం? లే. వెళ్ళు...

కమల : (పుస్తకాలు సర్దుకొని లేచి వెళ్ళబోతుంది)

విమల : ఆ దీపం కొరివిదెయ్యంలా ఉండాల్సిందేనా? కాస్త తగ్గించి వెళ్ళు.

కమల : (వెనక్కువచ్చి దీపం తగ్గించి వెడుతుంది. యింట్లోకి నిష్క్రమణ)

విమల : (ముసుగు పెట్టుకొని పడుకుంటుంది)

తెర

# రెండవ రంగము

(రెండవ దృశ్యం - అదే స్థలం - కేలండరులో తారీకు మే నెల 27. విమల పక్క మీద పడుకుని ఉంటుంది. కమల క్రింద చాపమీద పడుకుని ఉంటుంది. గడియారం 6 గంIIలు చూపుతూ ఉంటుంది. తెర లేచేసరికి అంతా నిశ్శబ్దంగా ఉంటుంది. గడియారం అలారం కొడుతుంది)

కమల : (ప్రక్క మీద నుంచి లేచి గడియారాన్ని ఆపుచేసి ప్రక్క చుట్టుకొని ఎదురుగా ఉన్న దేవుని పటానికి నమస్కరించి ప్రక్కతోసహా యింట్లోకి నిష్క్రమణ. ఒక్క క్షణం తర్వాత ప్రవేశిస్తుంది) విమలా. లేవావా? ఆరయింది.

విమల : అబ్బబ్బ ! అప్పుడే ఏం కొంప మునిగిపోయిందని అలా అరుస్తున్నావు? ఆరయితే అవనీ! లేసాలేం.———

కమల : పిన్ని లేపమన్నది విమలా!——— యివాళ మన పరీక్ష రిజల్ట్సు చెప్పే రోజు — అందుకని—–

విమల : అందుకని ఆరేనా అవకుండా స్కూలు కెళ్ళి పడిగాపులుపడి కూర్చోవాలా?

కమల : పెంద్రాళే లేచి కాలకృత్యాలు తీర్చుకొని ఎనిమిదింటికే బడికి వెళ్ళమన్నది పిన్ని.

విమల : పాపం. ప్రొద్దున్నే పిన్ని సలహ చెప్పిందిగా నీకు–అయితే యింకేం?

నువ్వు తయారవు పోస్తా!—నా సంగ తెందుకు నీకు?



కమల : ఇదేమిటి విమలా! అలా అంటావు? యిద్దరం ఒకేయింట్లో ఉంటూ ఒకే క్లాసు చదువు కుంటున్నప్పుడు యిద్దరం కలిసి వెళ్ళొద్దా మరి? అందు కని పిన్ని నిన్ను లేపమన్నది.



విమల : ఏం? ఆవిడే లేపలేకపోయిందా, అంత ఆపేక్ష ఉంటే! నిన్ను లేపి వెళ్లగలి గింది. నన్ను లేపలేకపోయింది.

కమల : నన్ను పిన్ని లేపలేదు విమలా! యివాళ పెంద్రాడే లేవాలని నేనే ఆరింటికి అలారం పెట్టాను. అలారం విని లేవాను. నిన్నూ లేపాను.



విమల : అయితే! సరే! లేస్తానులే! —వెళ్ళు— నీ పనులు చూచుకో!

కమల : (యింట్లోకి నిష్క్రమణ)

విమల : (బద్ధకంగా ఒళ్ళువిరుచుకొని మళ్ళీ ముసుగు పెడుతుంది.)

శాంత : (యింట్లోంచి ప్రవేశిస్తూ) అమ్మా విమలా! యింకా లేవలేదూ? లే!

విమల : (బద్ధకంగా) లేస్తాలే అమ్మా!

శాంత : 'లేస్తాలేఅమ్మా' అని యింకా పడు కుంటావేమే – కమలలేచి యెంతసేప యింది? అది యెంతలేపినా నువ్వు లేవలేదట. ఏం?

కమల : ప్రొద్దున్నే ఆవిడగారేం నన్ను లేపక్క రలేదు...

శాంత : అదేమిటే! అదంటే అలా ఇదయి పోతావు! తల్లిలేని పిల్లగదా అని చేర దీస్తే అలా ఈసడిస్తావు! పొద్దున్నే యీ మొఖంతో నేను లేపడమెందు కని దాన్ని లేప మన్నాను.

విమల : ఆవిడగారిది మంచి మొఖమా?

శాంత : ఊరుకోవే! ఎవరేనా వింటే నవ్వి పోతారు. లే! పెంద్రాళే మొహం కడుక్కొని తల దువ్వుకొని స్కూలు కెళ్ళండి. పరీక్షలు చెప్తారటగా యివ్వాళ?

విమల : చెప్తే చెప్పనీ--నాకేం భయం? నేనేం ప్యాసవనా?

శాంత : అయితే మాత్రం చూచుకొ స్తే పోతుందిగా అనుమానం!

విమల : ప్యాసవుతానో ప్యాసవనో అని అను మానంతో భయపడే ఆవిడగార్నే వెళ్ళి చూచుకోమను. నాకేం అనుమానంలేదు. ఢంకామీద దెబ్బ కొట్టి ప్యాసవుతాను.

శాంత : ప్యాసయితే మంచిదేగా! లే, లేచి ముందు మొహం కడుక్కో!

విమల : (విసుగుతో లేస్తూ) అబ్బబ్బ! సెలవల్లో కూడా స్వేచ్ఛగా నిద్ర పోనియ్యరు. (అంటూ దుప్పటి మంచం మీదకొట్టి యింట్లోకి నిష్క్రమణ)

కమల : (తల శుభ్రంగా దువ్వుకొని వస్తుంది. గోడనున్న ఫోటోకేసి చూచి నమస్క రిస్తుంది) అమ్మా! యివాళే మా పరీక్షలు చెప్పేరోజు. ప్యాసయేటట్లు దీవించు. (అని అక్కడ చీపురుతో గది శుభ్రం చేస్తుంది.)

శాంత : (ప్రవేశిస్తూ) అమ్మాయి! కమలా! జడేస్తానురా! అరే! అదేమిటే నువ్వే వేసుకున్నావు!

కమల : నీకు పని తెమలదని వేసుకున్నాను పిన్నీ! నాకు చేతనవునుగా. ఎవరిపని వాళ్ళు చేసుకొంటే మంచిదని మా మేష్టారు చెప్పారు.

శాంత : అవునమ్మా,...అదే మంచి పద్ధతి. ఎంతో బుద్ధిమంతురాలివి. నిన్ను

కళ్ళారాచూచి ఆనందించే భాగ్యం మా అక్కయ్యకు లేకపోయింది గదా'. అంతా దాని దురదృష్టం!

కమల : (ఏడుస్తుంది) అయితే పిన్నీ! మా నాన్నేరమ్మా!

శాంత : మీ నాన్న మీ అమ్మ బ్రతికిఉన్నప్పుడే పోయారమ్మా! ఆ బెంగతోనే మీ అమ్మ నువ్వుపుట్టగానే పోయింది. అప్పటినుంచీ నేనే పెంచుతున్నాను.

విమల : (గబగబా ప్రవేశిస్తూ) అమ్మా! నాకు ముందు జెడ వెయ్యవే, టైము అయి పోయింది. (అని తల్లి ముందు కూర్చుంటుంది).

శాంత : అదేమిటే నూనెసీసా తెచ్చుకోకుండా జెడ వెయ్యమంటావు?

కమల : నేను తెస్తానుండు పిన్నీ.... (అని లోపలికి వెళ్తుంది).

శాంత : చూడవే! -- దానికున్నబుద్ధిలో నీకు సగమైనాలేదు. ఎందుకు? ఎదుగుతున్నావు !

విమల : పోన్లే! లేకపోతే లేకపోయింది! మా అందరికీ ఉంటే చాలు.

శాంత : అదేమిటే? చిన్నా పెద్దా లేకుండా నోటికొచ్చినట్లు వాగుతావు? మంచిది కాదుసుమా! రేపు పెద్దయ్యాక కూడ యిలాగే వాగితే నలుగురూ నన్ను తిడతారు.

కమల : (నూనెసీసా దువ్వెనలతో ప్రవేశిస్తుంది) ఇదిగో పిన్నీ! సీసా! దువ్వెన!

శాంత : (అవి తీసుకొని విమలకు జెడవేస్తుంది) చూడు నీకన్నా ముందులేచి కమల జెడ వేసుకుంది. మనకు లేవడమే అపురూపమయి పోయిందాయె !— (జెడ ముగిస్తూ) జాగ్రత్తగా వెళ్ళిరండి!

(కమల, విమల వీధిలోకి నిష్క్రమణ)

శాంత : (నిట్టూర్చి) ఉన్నదొక్క పిల్లయినా ముద్దుమురిపెం లేకుండా మొద్దులా తయారవుతోంది! ఎలా బాగుపడుతుందో ఏమో. (అని నిష్క్రమణ) (క్షణంసేపు స్టేజి నిశ్శబ్దం)

సుభద్ర : (బట్టల సంచితో ఎడమప్రక్కనుంచి ప్రవేశిస్తూ) ఎవరండీ! ఇంట్లో !-- రామయ్యగారి ఇల్లు యిదేనా?

శాంత : (లోపల్నుంచి) వచ్చే! వచ్చే (ప్రవేశిస్తూ) రండి!

సుభద్ర : రామయ్యగారి ఇల్లు యిదేనాండీ?

శాంత : మరే — రండి.

సుభద్ర : మీరు ———

శాంత : ఈ యింటి యజమానురాల్ని-వారు మావారు. రండి !- లోపలికి వెడదాము! (క్షణం సేపు స్టేజి నిశ్శబ్దం)

విమల : (విసుగ్గా ఎడమప్రక్క నుంచి ప్రవేశిస్తూ) ఛీ! ఛీ! పాడు స్కూలు, పాడు పరీక్షలు. అంతా పక్షపాతమే.

కమల : (వెనకాలే ప్రవేశిస్తూ) తప్పు! విమలా! తప్పు! స్కూలునలా తిట్టకూడదు.

విమల : నా యిష్టం. నేను తిడతాను! స్కూలునేకాదు. మేష్టర్లనే తిడతాను అవసరమైతే!

కమల : తప్పు విమలా! మేష్టర్లేం చేశారు నిన్ను!—

విమల : ఏం చెయ్యడమేమిటి? వాళ్ళే నా పరీక్ష తప్పించారు. అంతా పక్షపాత బుద్ధి.

కమల : తప్పు! విమలా! మేష్టర్లెప్పుడూ అలా చేయరు! వాళ్ళు చాలమంచివారు.

విమల : నీకు మహా తెలుసా మేష్టర్లను గురించి. నా మీద పగబట్టి ఆ సైన్సు మేష్టర్లు నాకు మార్కులు తక్కువవేసి పరీక్ష తప్పించి ఉంటారు.

కమల : మరయితే నాకు ఎందుకు తక్కువ వేయలేదు.

విమల : నువ్వంటే అందరికీ యిష్టం. సరా! ఛీ!ఛీ! ఢంకామీద దెబ్బకొట్టి ప్యాసవు తానని అమ్మతో గొప్పచెప్పాను. ఇప్పుడు అమ్మమొహం చూడడం ఎలా? (ఇంట్లోకి నిష్క్రమణ),

కమల : (ఇంట్లోకి నిష్క్రమణ).

(క్షణంసేపు నిశ్శబ్దం)

శాంత : (ఇంట్లోంచి ప్రవేశిస్తూ) ఏమిటో మనకు తెలియకుండానే మనకూ మనకూ బాంధవ్యాలు...

సుభద్ర : (వెనకాలే ప్రవేశిస్తుంది) మరే! మరే!

శాంత : (చాపపరిచి కూర్చుంటారు) ఆ!—— ఇంతకీ అబ్బాయి ఏం చేస్తున్నాడన్నారు?

సుభద్ర : మొన్ననే బి.ఏ. పరీక్ష ప్యాసయ్యాడు. కుదిరితే ఈ నెలలో పెళ్ళిచెయ్యాలని వాళ్ళనాన్నగారి పట్టుదల.

శాంత : మంచిదే—- అబ్బాయికెన్నేళ్ళు ఉంటాయి?

సుభద్ర : మొన్నే 18 వెళ్ళాయి—ఆఁ— అమ్మాయిల్ని పిలిపిస్తారా?

శాంత : అయ్యో! దానికేం? అమ్మాయ్! విమలా! కమలా! యిలారండమ్మా అత్తగారు చూస్తారట—

కమల : (ప్రవేశిస్తూ) పిలిచావా! పిన్నీ——

శాంత : మరేనమ్మా!—విమలేదే? దాన్నికూడ రమ్మను. అత్తగారు చూస్తారట.

కమల : లోపలుంది. పిలుచుకువస్తా! (నిష్క్రమణ)

సుభద్ర : ఈ అమ్మాయేనా!

శాంత : ఆ! ఇదే! మా అక్కయ్యకూతురు. పోతూ పోతూ నా చేతిలో పెట్టి పోయింది. అప్పట్నించి నేనే పెంచు కుంటూ వస్తున్నాను—- దిక్కులేనిది పాపం!

సుభద్ర : తల్లీ తోడూ అన్నతర్వాత ఆమాత్రం చూడకపోతే ఎలాగలెండి—

విమల : (విసుగుగా ప్రవేశిస్తూ) ఏమిటి చూ పే ది? నే నేం దే వ తనా? దెయ్యాన్నా!

శాంత : తప్పమ్మా. పెద్దవాళ్ళువచ్చి చూస్తా నంటే అలా అనకూడదు.

సుభద్ర : చిన్నతనంకదూ! ఇంకా గారాబం పోలేదు.

శాంత : ఏం చిన్నతనమో! ఏం లోకమో!—

కమల : (ప్రవేశిస్తుంది).

విమల : అయిందా చూడ్డం. అవతల నాకింకా పనుంది.

సుభద్ర : పిచ్చిపిల్ల— ఏదీ, ఎవరన్నా ఒక పాట పాడండమ్మా.

శాంత : విమలా! ఓ పాటపాడమ్మా. ఆవిడ ముచ్చటపడి అడుగుతున్నారు.

విమల : ఏమిటి పాడేది? —అసలే పరీక్ష పోయి నేనేడుస్తుంటే పాడతావా, పాడవా అని పీడించుకు తింటున్నారు?

శాంత : అయితే దీని పరీక్ష పోయిందిటే! చెప్పవేమే కమలా!

కమల : మరే పిన్నీ ——

శాంత : అవునుమరి———పోదూ! ఏడాదల్లా చదవకుండా పడుకుని నిద్రపోతే పరీక్ష పోదూ! నేనప్పుడే అనుకున్నాను.

సుభద్ర : పోన్లెండి— చిన్నతనం—వచ్చేయేడు ప్యాసవుతుంది. నీవు ప్యాసయ్యావామ్మా ?

కమల : ప్యాసయ్యానండి.

విమల : నీలాంటి వాళ్ళంతా యిలా ముందే అపశకునాలు పెట్టబట్టే నా పరీక్ష పోయింది. (నిష్క్రమణ)

శాంత : నీ ఖర్మ!

సుభద్ర : హో అమ్మా! పోయి అడుకో.

కమల . (నిష్క్రమణ)

శాంత : చూశారా! వదినగారూ! ఇదీ వరస! వాళ్ళ నాన్నగారు గారాబంచేసి యిలా చెడగొట్టేశారు.

సుభద్ర : ఏమైనా యిప్పటినుంచీ అదుపులో పెట్టండి. మొక్కై వంగాలంటారు. ఇకవస్తానండీ అమ్మాయి కమల మాకు అన్నివిధాలా నచ్చింది.

శాంత . (కట్కు వత్తుకుంటూ) సంతోషం. తల్లిలేని పిల్ల! ఇంతవరకూ ఎలాగో పెంచాను. యిక—

సుభద్ర : ఇకపై బాధ్యత మాది—నేను వెళ్ళి త్వరలో నే అన్ని యేర్పాట్లూచేయిస్తాను. సరా—మీకా బెంగ అక్కరలేదు. మరియిక శలవా!

శాంత : మంచిది. నా కూతురుకి ముందు సంబంధం కుదిరి దీనికి కుదరకపోతే నాకు చాలా బాధగా ఉండేది. ఆ దేవుని దయవల్ల ముందే దీనికి కుదిరింది. అదృష్టవంతురాలు. (లోపలికి చూస్తూ) అమ్మాయి కమలా! అత్తయ్యగారి సంచి, బొట్టుపెట్టె పట్రా.

కమల : (తెచ్చియిస్తుంది)

శాంత : కమలా! అత్తయ్యగారికి బొట్టుపెట్టమ్మా!

కమల : అలాగేపిన్నీ! (అంటూ పెడ్తుంది).

సుభద్ర : వెళ్ళొస్తా వదినగారూ!— వెళ్ళొస్తా కమలా!— (నిష్క్రమణ)

కమల : పిన్నీ! ఆవిడెవరు?

శాంత : ఆవిడేనే నీకు కాబోయే అత్తగారు!

కమల : అంటే!

శాంత : అంటే...వాళ్ళబ్బాయినినీకిచ్చి పెళ్ళి...

కమల : పో! పిన్నీ! (అంటూ సిగ్గుపడ్తుంది).

శాంత : పిచ్చిపిల్ల!

తెర.



# ప్రోగ్రెస్ కార్డు

అన్నపర్తి

పాత్రలు :

కిష్టి, గోపి. రఘు, విశ్వం, కుర్రాడు, తండ్రి, తల్లి.

కావలసిన పరికరములు :

ఆఫీసు ఫైల్సు, పెన్సిలు, రూళ్ళకర్ర, పెద్దకర్ర, రెండు ప్రోగ్రెస్ కార్డులు, క్రొత్తచొక్కా, బిస్కెట్ ప్యాకెట్, ఒక టేబిల్, రెండు మూడు కుర్చీలు, కిష్టిపుస్తకాలు, నాటకం పుస్తకం.

# రంగము

తండ్రి : (టేబిల్ ముందు ఆఫీసు కాగితాలు చూచుకుంటాడు.)

తల్లి : (లోపల్నుంచి) ఏమండీ!

తండ్రి : (పలుకడు)

తల్లి : (ప్రవేశించి) మిమ్మల్నేనండీ పిలవటం!

తండ్రి : నన్నేనా పిలవటం!

తల్లి : ఆఁ... మిమ్మల్నే!

తండ్రి : ఎందుకు?

తల్లి : ఏం లేదు–

తండ్రి : ఏం లేకపోతే పిలవట మెందుకు?

తల్లి : అదికాదండీ! అబ్బాయి చదువు సంగతి–

తండ్రి : అదా! దానికిప్పుడేం తొందరలే. తర్వాత చూచుకోవచ్చు. నాకివతల బోలెడంత పనివుంది.

తల్లి : వాడిసంగతెత్తితేసరి. అలా భగ్గు మంటారేమండీ? వాడేం చేశాడండీ మిమ్మల్ని?

తండ్రి : కళ్ళు తెరవని పసికుంక – పదేళ్ళు నిండని పిల్లకాకి-వాడేంచేస్తాడు నన్ను? ఒకవేళ యేదైనా చేస్తే ఊరుకునే ఘటాన్నా నేను?

తల్లి : అయితే వాడిచదువు సంగతి పట్టించు కోరన్నమాట!

తండ్రి : పట్టించుకోకేం? ఆ విషయంలో నీ సలహా మాత్రం పాటించనని చెపు తున్నా. నెలకు పదిరూపాయలిచ్చి ప్రైవేటు మాష్టరుగార్ని పెట్టే తాహతు నాకులేదు. శ్రద్ధగా చదువుకుంటాడా బాగుపడతాడు. లేకపోతే–

తల్లి : అలాఅని వదిలేసి ఊరుకుంటే ఎలా గండీ? ఇంటి దగ్గరైనా కనుక్కోవాలా ఏం చదువు తున్నాడో? యేమో?

తండ్రి : కనుక్కో? ఎవరు వద్దన్నారు?

తల్లి : ఆ మాత్రం చదువే నాకుంటే లేద్దే ముంది?

తండ్రి : వాణ్ణి చదివించడానికి నీకు చదు వెందుకు? వీధుల్లో తిప్పకుండా ఇంటి పట్టునకూర్చోబెడితే,వాడేచదువుతాడు

తల్లి : ఆ పాఠాలు తెలియడంలేదని అఘో రిస్తున్నాడు. కాస్త చెప్పరాదటండీ?

తండ్రి : ఎప్పుడు చెప్పమంటావ్? తీరికేది? చూడు, ఆఫీసు ఆడిట్ వచ్చిందని– వేరెవ్వరూ దొరకనట్లు-ఆ కాగితాలన్నీ నానెత్తినే తగలేశారు. మూడు రోజు ల్నుంచీ సతమత మౌతున్నా-ఇంత వరకూ పూర్తికాలేదు స్టేట్మెంట్లు.

తల్లి : అవి పూర్తికానూ కావు. వాడికి చదువు రానూరాదు.

తండ్రి : రాకపోతే వాడిఖర్మ-దానికి మనమేం చేస్తాం? అడపా దడపా కొట్టడం తప్ప! ఇంతకూ వాడికి గ్రహబలం చాలలేదు. లేకపోతే యిలా వరసగా ఎందుకు తప్పుతాడు పరీక్షలు?

తల్లి : చాల్లేండి వేదాంతం. గ్రహబలం చాల్లేదట! మనకు శ్రద్ధ లేదనరాదూ?

తండ్రి : మనకుగాదు-వాడికిలేదు శ్రద్ధ.

తల్లి : వాడు శ్రద్ధగానే చదువుతున్నాడు– మీరు కనుక్కోకపోయినా-నేను కను క్కొని శ్రద్ధగానే చదివిస్తున్నా. మొన్న పరీక్షల్లో బాగానే వచ్చినాయి మార్కులు.

తండ్రి : ఏం వచ్చినా– వాడి యీడుకు మించి రానివ్వడుగా! వాడి వయస్సు పద కొండేండ్లు– వాడికి వచ్చే మార్కు లన్నీ ఆ లోపలే వుంటై.

తల్లి : కాదండీ! పోయిన పరీక్షలో నలభై లు యాభై లు వచ్చినయ్.

తండ్రి : ఇవ్వాళ సూర్యుడెటు పొడిచాడు ? తూర్పునా ? పడమరా ?

తల్లి : మీకంతా వేళాకోళంగా వుందే!

తండ్రి : వాడుచెప్పాడా? నా కిన్ని మార్కులు వచ్చాయని?

తల్లి : కాదు. ప్రోగ్రెస్‌కార్డు ఇచ్చారట, అందులో వున్నయ్.

తండ్రి : అయితే నాకు చూపించలేదేం? నేను సంతకం పెట్టాలిగా?

తల్లి : వాడు మీ దగ్గరకు రావటానికే భయపడుతున్నాడండీ. పోయినసారి కాయితం చూపిస్తే చెంప వాచేటట్లు కొడితిరి. ఐదువేళ్ల పొంగినయ్.

తండ్రి : తొమ్మిదులు, పదులు వస్తే అంతే కాగితంమీద సంతకం - చెంపమీద వేలిముద్రలు. ఇలా నలభైలు యాభైలు వస్తే ఎందుకు కొడతాను?

తల్లి : కొట్టక బహుమానాలు యిస్తారా?

తండ్రి : ఓ తప్పకుండా-చెప్పు, ఏం తెమ్మంటావ్ బహుమతి?

తల్లి : చొక్కాల్లేవని అఘోరిస్తున్నాడు. ఒక మంచి చొక్కాగుడ్డ తెండి.

తండ్రి : ఒకటేమిటి? నాలుగు తెస్తాను. ఏదీ ఆ కాగితం యిటు తెమ్మను.

తల్లి : వాడిప్పుడే బయటకు వెళ్లాడు.

తండ్రి : కాగితం యింట్లోనే ఉంటుందిగా. చూడు ఏ పుస్తకంలో వుందో...

తల్లి : చూస్తానుండండి (లోపలకు వెళుతుంది)

తండ్రి : (ఆఫీసు ఫైల్సు మడిచి డ్రాయరులో పెట్టుకుంటూ) ఈ దెబ్బతో మావాడి గ్రహాలు మారినట్లున్నయ్ (చొక్కా తొడుక్కొని జేబులో పర్సుతీసి డబ్బు చూసుకొంటాడు. తల్లి ప్రోగ్రెసు కార్డు తీసుకొనివచ్చి ఇస్తుంది)

తండ్రి ; (కార్డు చూస్తూ) 42, 44, 53, 78;- 78 ఎందులో- సైన్సులోనా ?– 36 సోషల్‌లో... తగ్గాయి ఎందుచేతో? 20 అరెరే ! హిందీలో ఇరవయ్యేనా? పోనీలే హిందీలో ఎంతవస్తేనేం ?– మొత్తంమీద మనవాడి ప్రోగ్రెసు బాగానే ఉంది.

తల్లి : బాగుండకేమండీ- పిచ్చిసన్నాసిని అనవసరంగా కొడతారుగాని ?

తండ్రి : ఛా ! ఛా !– పిచ్చిసన్యాసేమిటి ? మన వాడు మంచి సన్యాసి ! చాలా తెలివైన సన్యాసి !

(కిష్టి మెల్ల మెల్లగా ప్రవేశిస్తాడు. తండ్రిని చూచి తప్పుకోబోతాడు).

తండ్రి : వచ్చావురా నాయనా !– రా !– యీ సారి మార్కులు బాగా వచ్చాయా ?

కిష్టి : హిందీలో బాగానే వచ్చినయ్ నాన్నా.

తండ్రి : హిందీలో ఏమిటి ?– తక్కినవాటిలో మాత్రం ?

కిష్టి : అన్నిట్లోను బాగానే వచ్చినయ్, హిందీలో–

తండ్రి : హిందీలోగూడ యిదివరకు కంటే– ఎక్కువే వచ్చినయ్‌లే ! ఇదివరకు సున్నా వచ్చింది. ఇప్పుడు 20 వచ్చినయ్! మంచి ప్రోగ్రెసే!

కిష్టి : లేదు నాన్నా–

తండ్రి : నీ మొహం– ఎందుకురా భయపడతావ్? కొట్టన్లే! ఇలారా– ఈసారి నీకు మంచి బహుమానం తేబోతున్నాను. ఉండు చప్పున వస్తాను. (పిల్లవాణ్ణి బుగ్గన ఒక చిటికవేసి చెప్పులు తొడుక్కొని వెళ్తాడు)

కిష్టి : అమ్మా ! నాన్నగారు ఏం తేవటానికి వెళుతున్నారే?

తల్లి : నీకు చొక్కా గుడ్డలు తేబోతున్నార్రా!

కిష్టి : ఎన్ని?

తల్లి : నీ కెన్ని కావాలి?

కిష్టి : నాకా ? అరడజను.

తల్లి ; అరడజనేం ఖర్మ- డజను తెచ్చేట్టున్నారు.

కిష్టి : డజనెవరికి కావాలేం ?- నాకు అర డజనే కావాలి.

తల్లి : (నవ్వుతూ) సరే! అరడజనే తెస్తార్లే. కాసేపు చదువుకో- లేకపోతే ఆడుకో- అంతేగాని ఎక్కడికీ వెళ్ళబోకు. (లోపలికి వెళుతుంది)

కిష్టి : డజనెక్కువా? అరడజ నెక్కువా? అరెరెరెరె అరడజన్ల మానం మరిచి పోయినానే ( గుర్తు తెచ్చుకుంటూ ) 2 వస్తువులు = ఒక జత, రెండు జతలు = ఒక వస్తువు. అహహ! కాదు కాదు ! ఉండుండూ ! గణిత బోధిని చూద్దాం (లోపలనుంచి పుస్తకాలు తెచ్చి చూస్తాడు)

[బయటినుంచి కేక :- కిష్టి]

కిష్టి : [తండ్రి గొంతుక ననుకరిస్తూ] ఎవరు? (బయటినుంచి)- మా కిపి. యింట్లో వున్నాడండీ ?

కిష్టి : ఎందుకూ?
(బయటినుంచి)- ఊరికనే.

కిష్టి ; మావాడు రాడుపో.
(బయట్నుంచి)- కాదండీ మావాడూ-

కిష్టి : ఎవరబ్బాయ్ నీవు? ఇలా లోపలికిరా!

రఘు : (లోపలికివస్తూ) మరే మా మాష్టరు గారే (కిష్టిని చూచి ఆశ్చర్యపోతూ) ఓరి! నీవేన్రా!

కిష్టి : నన్ను చూచి మా నాన్నగా రను కున్నావు కదూ!

రఘు : నిన్ను చూస్తే ఎందుకనుకుంటాను! నీ మాటవిని మానాన్న గారనుకున్నా.

కిష్టి : ఏరా, నేను అచ్చం మా నాన్న గారిలా మాట్లాడాను గదూ!

రఘు : నీవేమిటి ? నేను చూస్కో- అచ్చం మన మేష్టారిలా మాట్లాడతా !

కిష్టి : ఏదీ మాట్లాడు ? చూద్దాం.

రఘు : (ఒక పుస్తకం తీసికొని తెరచి, దగ్గి) సైలెన్సు- జాగ్రత్తగా వినండి. ఛత్రపతి శివాజీ- మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని స్థాపించాడు. మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని ఎవరు స్థాపించారు ? ఛత్రపతీ-ఛత్రపతీ- శివాజీ- ఛత్రపతీ శివాజీ తండ్రి పేరేమి ? you- next - anybody - ఎవరికీ తెలీదురా ? వట్టి మొద్దులు- సరే వినండి- ఛత్రపతి శివాజీ తండ్రి పేరు... తండ్రిపేరు... (పుస్తకం తిరగవేస్తూ) సరే- ప్రస్తుతం మీ కవసరం లేదు. పెద్ద క్లాసులో తెలుసుకుందురు గాని-

(ఇద్దరూ నవ్వుతారు)

(బయట్నుంచి)- బాబూ! బిచ్చం అండీ!

కిష్టి : ఇప్పుడేం బిచ్చం, పోవోయ్!

బయట: మరింకెప్పుడండీ !

కిష్టి : ఎప్పుడూ లేదుపో !

బయట: ఎక్కడికి పోయేది బాబూ.

కిష్టి : ఎక్కడికి పోతావో మాకేం తెలుసు !

బయట: మరింకేం తెలుసు? తింటం తెలుసా!

కిష్టి : ఎవడ్రా తెగ దబాయిస్తున్నాడు?

రఘు : అరేయ్! వాడెవడో మామూలు బిచ్చగాడు కాదు- ఘరానా బిచ్చగాడల్లే ఉన్నాడు. కాస్త మర్యాదగా మాట్లాడు.

కిష్టి : ఇదిగో! బిచ్చమబ్బీ!

రఘు : గారూ అనరా!

కిష్టి : గారూ!

రఘు : ఇంకొకరింటికి పొమ్మను.

కిష్టి : ఆ ప్రక్కిల్లు మనదేగాని అక్కడికి దయచేయండి.

రఘు : ఆ ప్రక్కిల్లు మీదిట్రా?

కిష్టి : కాదని వాడికేం తెలుసులేవోయ్?

బిచ్చ : నాతో అబద్ధా లాడతావురా? ఆ పక్కిల్లు మీదా?

కిష్టి : రా, గీ అంటున్నాడ్రా!

రఘు : లోపలికివస్తున్నాడు. కొడతాడేమో! మీ అమ్మని పిలవరా.

కిష్టి : మా అమ్మెందుకురా? అమూల కఱ్ఱ వుంది తీసుకో.

రఘు : నీవే తీసుకో.

కిష్టి : నీవే! (కఱ్ఱ చేతికిస్తూ) పరవాలేదులే తీసుకో. తలుపు దగ్గరనుంచో, వాడు లోపలకు రాగానే ఒక్కటిచ్చుకో, మళ్ళీ మాట్లాడడు.

రఘు : నాకొక్కడికీ భయం. నీవుకూడా రారా!

కిష్టి : సరే, పద! (ఇద్దరూ తలుపు దగ్గరకు వెళ్తారు. బిచ్చగాడు లోపలకు వచ్చి దగ్గుతాడు. రఘు భయపడి కళ్ళు మూసికొని వెనక్కు తగ్గి కఱ్ఱ వదలి పెడతాడు. అది కిష్టి కాళ్ళమీద పడుతుంది.)

కిష్టి : అబ్బా! (అని కూలబడి కాలుచూసు కొంటూ) కొడతావేరా?

రఘు : నీవే అంటివిగా! లోపలకు రాగానే ఒక్కటి–

కిష్టి : నన్ను కొట్టమన్నానా?

గోపి : ఏరా! నన్ను కొడదామను కున్నారు?

రఘు : నేనుకాదండీ! వాడు. (అని కిష్టిని చూపిస్తాడు.)

కిష్టి : కాదండీ, వాడే! (తలెత్తి బిచ్చగాణ్ణి చూచి) ఓరి మన గోపిగాడ్రా!

రఘు : (కళ్ళు తెరచి) గోపిగాడా! ఎంత భయపెట్టావురా!

గోపి : మిమ్మల్నెవరు భయపడమన్నార్రా?

రఘు : లేకపోతే ఏమిట్రా. అన్నీ అడుక్కుతినే వేషాలు నువ్వూనూ! చూడు. వాడి కాలికి ఎంత దెబ్బతగిలిందో?

గోపి : (చూస్తూ) అరెరె పాపం దెబ్బతగి లిందిరా!

కిష్టి : పెద్దదెబ్బ కాదులే.

రఘు : మీనాన్న డాక్టరు కదరా! కాస్త కట్టు కట్టించరాదూ?

గోపి : మా నాన్నగారిదాకా ఎందుకురా? అదేపోతుంది–అరేయ్ నేను డాక్టరు నట. కాసేపు డాక్టరు ఆట ఆడ దామా?

రఘు : ఆఁ-అరేయ్ కిష్టీ! నీవు మంచంమీద పడుకో-నీకు జ్వరం వచ్చిందిట.

కిష్టి : ఇప్పుడు మంచం ఎందుకూ? ఈ కుర్చీమీద కూర్చుంటాలే.

రఘు : జ్వరం వచ్చినవాళ్ళు ఎక్కడైనా కుర్చీ మీద కూర్చుంటారేమిటి?

కిష్టి : ఆడుకోటానికేగా? పరవాలేదు లేవోయ్. ఏరా గోపీ?

గోపి : ఫరవాలేదులే. కూర్చో. (కిష్టి కుర్చీ మీద కూర్చుంటాడు. గోపి డాక్ట రులా ఠీవిగా నుంచుంటాడు.

రఘు : (తండ్రిలా) నమస్కారము డాక్టరు గారూ! మా వాడికి కాస్త సుస్తీగా వుంది. ఏమిటో చూడండి.

గోపి : ఏదన్నాయ్ చేయి? యిలాతే.

రఘు : చెయ్యెందుకోయ్ ? స్టెతస్కోపుతో చూడాలిగాని.

గోపి : అప్పుడు లేదుగా యిక్కడ. ఫరవా లేదులే- ఏదన్నాయ్ చెయ్యి! (అని చెయ్యిచూచి పెన్సిలిస్తాడు)

కిష్టి : పెన్సిలెందుకోయ్ ?

గోపి : పెన్సిల్ కాదులేవోయ్ యిది- జ్వరం చూసే థర్మామీటరనుకో.

కిష్టి : (పెన్సిలును థర్మామీటరు లాగా నోట్లో పెట్టుకుంటాడు)

గోపి : (పెన్సిల్ తీసింది చూచి) తీస్కు! (రఘు తీస్కున్నట్టు, గోపి కదిలినట్టు అభినయం చేస్తారు)

రఘు : ఏమిటుందీ జబ్బు ?

గోపి : ఇది కొత్తరకం జబ్బుండీ. ఏం పేరు పెడదామా అని ఆలోచిస్తున్నా.

రఘు : కొత్త పేరెందుకోయ్. ఏదో పాత పేరే చెప్పు, ఊ. ఏమిటుందీ వీడికి ?

గోపి : అది యిప్పుడిప్పుడే చెప్పటానికి వీల్లేదండీ. సీసా పంపించండి. మందిస్తా.

రఘు : పోరా. నీ కసలేం తెలీదు. జబ్బేమిటో తెలీకుండా మందిస్తారేం ?

గోపి : అయితే ఈ రోగం పెన్సిల్‌వేనియా.

రఘు : (విసుగుతో, కోపంతో) నీ తలకాయ వేనియా- పోరా నే నసలాడను.

గోపి : ఆడకపోతే మానే, మేమిద్దరమే ఆడుకుంటాం. ఏరా కిష్టీ !

కిష్టి : ఊఁ ఊఁ.

గోపి : ఇదిగో అబ్బాయ్! నీకేం భయంలేదు. జ్వరం దానంతటదే తగ్గిపోతుంది. సీసా పంపించు మందిస్తా.

రఘు : భలే డాక్టరురా నీవు !

[బయట్నించి కేక - కిష్టీ ! కిష్టీ !]

కిష్టి : ఎవరూ ?

విశ్వం: నేనురా.

కిష్టి : నువ్వట్రా విశ్వం ! రా, లోపలకురా!

విశ్వం: (లోపలకు వచ్చి) అరే అంతా ఇక్కడనే ఉన్నారే? "నాటకం రిహార్సెలు వేద్దాం. మీ యింటికి వస్తా" మని నాతోచెప్పి ఇక్కడకు వచ్చారటార్రా ?

రఘు : మీ యింటికనే బయలుదేరా. వీడిని గూడా పిల్చుకు వద్దామని యిక్కడకు వచ్చా.

విశ్వం: సరే రండిపోదాం. రారా కిష్టీ !

కిష్టి : మా అమ్మ నన్ను యిప్పుడెక్కడికీ పో వద్దందిరా.

విశ్వం: అందుకే నిన్ను నాటకంలో పెట్టు కోనిది. మరిప్పు డెట్లా ?

కిష్టి : పోనీ యిక్కడనే వేద్దాం రిహార్సెలు. అంతా యిక్కడనే ఉన్నాంగా.

విశ్వం: మీ అమ్మ కోప్పడదూ ?

కిష్టి : కోప్పడదులే ! ఎక్కడికీ పోకుండా యిక్కణ్ణే ఆడుకోమంది.

విశ్వం: సరే ! అయితే మూడు సీన్ల వరకు బాగా నలిగిందిగా. యివాళ నాలుగో సీను వేద్దాం.

కిష్టి : ఏదీ ? నీదగ్గర నేను కలమడిగి తీసి కొనే సీనేనా ?

విశ్వం: ఆఁ- రెడీ – సీనెలా ఉంటుందో తెలుసా ? (నాటకం పుస్తకం చూస్తూ) వేణూయిల్లు- వేణూనాన్నగారి ఆఫీసు గది- ఒక డ్రాయరు, 2, 3 కుర్చీలు డ్రాయరు మీద వాళ్ళ నాన్నగారి ఆఫీసు కాగితాలున్నాయి. వేణు వాళ్ళ నాన్నగారి కుర్చీలో కూర్చొని పెన్సి లుతో నోట్సు వ్రాసుకుంటాడు

బయట్నుంచి బ్రహ్మం పిలుస్తాడు "వేణూ, వేణూ!"

రఘు : అవన్నీ చెయ్యమను వాణ్ణి.

కిష్టి : (అలాగే చేస్తాడు)

విశ్వం: (బ్రహ్మం వేషంలో) వేణూ! వేణూ! (గోపితో) గోపీ, నీవు ప్రాంప్టింగ్ చెయ్యరా (పుస్తకం గోపి తీసుకున్నాడు).

కిష్టి : ఎవరు ? లోపలకురండి - నువ్వట్రా బ్రహ్మం! సమయానికి వచ్చావురా, కాస్త పెన్ను ఇవ్వరా-నోట్సు రాసుకోవాలి.

గోపి : ఆగవోయ్. 'కాస్త' కాదు. ఇందులో 'కొంచెం' అని ఉంది. 'కొంచెం నీ పెన్నివ్వరా' అనాలి.

కిష్టి : ఎట్లా అంటేనేం లేవోయ్ ?

గోపి : నీయిష్టం వచ్చినట్లు అనటమే నేమిటి ? ఇందులో ఉన్నట్లను.

రఘు : ఫర్వాలేదు లేవోయ్ !

గోపి : కాదు. అనాల్సిందే.

విశ్వం : సరే అనరా !

కిష్టి : ఊఁ కొంచెం నీ పెన్నివ్వవోయ్.

గోపి : 'ఇవ్వవోయ్' కాదు 'ఇవ్వరా'.

కిష్టి : పోరా-నీకసలు ప్రాంప్టింగ్ చేతగాదు.

గోపి : చూడరా వాడు? – వాడికి పోర్షను రాక, నాకు ప్రాంప్టింగ్ చేతకాదంటాడు.

కిష్టి : నాకు పోర్షను రాలేదూ?

గోపి : వస్తే తప్పులెందుకు చెప్తావ్ ?

కిష్టి : నావి తప్పులా ?

విశ్వం : అబ్బబ్బ ! ఆపండిరా యీ గోల. ఒరే కిష్టీ ! అందులో ఉన్నదున్నట్టు చెప్పు.

కిష్టి : ఏమిటిరా, నీవుకూడా వాడిపక్షమే మాట్లాడుతావ్?

విశ్వం : పక్షంలేదు గిక్షంలేదు, చెప్పవోయ్ !

కిష్టి : సరే, చెప్తాను. నాదేం పోయింది ! కొంచెం నీ పెన్నివ్వరా. నోట్సురాసుకోవాలి.

రఘు : అసలు ఈ వ్రాసిన వాడికి తలకాయ లేదురా - పెన్నెక్కడేనా కొంచెం ఇస్తారురా?

కిష్టి : నిజమేరా !

విశ్వం : ఒరేయ్ ! మీరింతకూ రిహార్సెలు చేస్తారా, లేదురా?

రఘు : చెయ్యండి - ఎవరు వద్దన్నారు?

విశ్వం : మళ్లా అడగరా కిష్టీ !

కిష్టి : కొంచెం నీ పెన్నివ్వరా - నోట్సు రాసుకోవాలి.

విశ్వం : నీ పెన్నేమైంది?

కిష్టి : పోయింది.

విశ్వం : ఎక్కడ?

గోపి : అహ! 'ఎక్కడ' కాదు - 'ఎప్పుడు?'

విశ్వం : ఎప్పుడు?

కిష్టి : చాలా రోజులైందిరా.

విశ్వం : మళ్లీ ఇంకొకటి కొనుక్కోక పోయినావ్?

కిష్టి : మా నాన్నగారు - "ఇదివరకే - నీవు నాలుగు పారేశావ్. ఇక నేను కొనను" అన్నారుగా!

విశ్వం : మరిప్పుడు దేంతో రాస్తున్నావ్?

కిష్టి : పెన్సిలుతో -

విశ్వం : ఇంకేం? దాంతోనే వ్రాసుకో.

కిష్టి : సరిగా కనపడటం లేదురా.

విశ్వం : అయితే నన్నేం చెయ్యమంటావ్?

కిష్టి : నీ పెన్నిస్తే - వ్రాసుకొని. మళ్లా సాయంత్రం నీకిచ్చేస్తా

విశ్వం : ఇదిగూడా పారేస్తే-

కిష్టి : పారెయ్యను లేరా.

విశ్వం : ఒకవేళ పారేస్తే?

కిష్టి : కొత్తది కొనిస్తా-

విశ్వం : ఇంకేం - అడబ్బులుపెట్టి ఇప్పుడే కొనుక్కో.

కిష్టి : పోన్లేరా-ఇవ్వకపోతేమాన్లే.

విశ్వం : కోపం వచ్చినట్లుందే !

కిష్టి : వస్తే నీకేం?

విశ్వం : పెన్నిస్తాగాని ఇందులో ఇంకులేదు.

కిష్టి : పెన్నివ్వాలిగాని - ఇంకు పోసుకో లేనూ ?

విశ్వం : సరే! తీసుకో (ఇస్తాడు) నీవు రాసుకొని మళ్లా నిండా ఇంకు పోసి ఇవ్వాలి.

కిష్టి : ఓ! అలాగే.

గోపి : (పుస్తకం చూస్తూ) బ్రహ్మం పెన్ను ఇస్తాడు. కిషి తీసికొని వాళ్ళ నాన్న డ్రాయరులోంచి సిరాబుడ్డితీసి కలంలో సిరా పోస్తుండగా ఒలికి వాళ్ళ నాన్నగారి ఆఫీసు కాగితాలమీద పడుతుంది. ఇంతలో వెంకట్రావు వస్తాడు.

విశ్వం : రారా ! వెంకట్రావ్ !

గోపి : ఇవ్వన్నీ చెయ్యవద్దూ ?

విశ్వం : నాటకంనాడు చెయ్యొచ్చులే - రారా రఘూ !

రఘు : (వెంకట్రావు వేషంలో) ఏమిట్రా కిష్టీ ఏం చేస్తున్నావ్ ? అరే! అదేమిట్రా! సిరాఅంతా అలా పోయింది ?

కిష్టి : అవున్రా ! కలంలో పోస్తుంటే- ఒలికి సిరా అంతా మా నాన్నగారి ఆఫీసు కాగితాలమీద పడిందిరా !

రఘు : ఆఫీసు కాగితాల మీదనే ! అయితే నీకు మీనాన్నగారి చేతిలో వీపు పెట్రేగి పోతుంది ఇవ్వాళ.

(తండ్రి ప్రవేశించి ఆ మాటలు వింటూంటూడు. పిల్లలు గమనించరు.)

కిష్టి : నేను పోశానని ఆయన కెలా తెలుస్తుంది ?

రఘు : ఎందుకు తెలీదూ ? ఎవరో ఒకరు చెప్తారు.

కిష్టి : ఇంకెవరికీ తెలీదుగా నీకూ నాకూ తప్ప.

రఘు : అయితే- నేనే చెప్తా.

కిష్టి : నువ్వా ? చెప్పొద్దురా.

రఘు : చెప్తా !

కిష్టి : చెప్పకురా! నీకొక ఐదు పైసలిస్తాను-

రఘు : ఊఁ హుఁ.

కిష్టి : పది పైసలు !

రఘు : ఊఁ హుఁ !

కిష్టి : పదిహేను పైసలు !

తండ్రి: (కోపం ఆపలేక) కాదు- ఇరవై పైసలివ్వు.

కిష్టి : ఇరవై పైసలా ? సరే ! ఇస్తాలే !

గోపి : (పుస్తకం తీస్తూ) ఏయ్ ! అదిలేదు ఇందులో !

రఘు, విశ్వం : వాళ్ళ నాన్నగారురా ?

గోపి : ఆఁ ! (పుస్తకం మూస్తాడు)

తండ్రి : ఏరా ! ఇరవై పైసలిస్తావ్ ? ఎవరు వీళ్ళంతా ? అసలు ఆ కాగితాలతో నీకేం పనివచ్చింది ?

కిష్టి : ఏ కాగితాలు నాన్నా ?

తండ్రి : నువ్వు సిరాపోసిన కాగితాలు.

కిష్టి : ఏం సిరా?

తండ్రి : ఏం సిరా అంటావేరా బుద్ధిలేక! వారం రోజుల్నుంచీ ప్రాణాలన్నీ గింజుకొని తయారుచేశా నా స్టే టు మెం టు! వాటితో నీ కేం ప ని వచ్చిందిరా? పై గా అ వి ఆ డి ట్ స్టేటుమెంట్లు కూడాను.

కిష్టి : వాటితో నాకేం పని నాన్నా?

తండ్రి : అవును. సిరా పార బొయ్యటమేగా నీ పని?

కిష్టి : నేను పారబొయ్యలేదు నాన్నా.

తండ్రి : దానంతటదే ఒలికిందా?

కిష్టి : అసలు ఒలకలేదు నాన్నా.

తండ్రి : అబద్ధం! పచ్చి అబద్ధం!

కిష్టి : నిజం నాన్నా! చూసుకో నీ కాగితాలు.

తండ్రి : చూస్తాగా! ఒక్కసిరాబొట్టు కనపడనీ చెప్తా నీపని.

(డ్రాయరు చూస్తాడు. కాగితాలు చెదరకుండా ఉండటం గమనించాడు)

తండ్రి : అరె! ఎక్కడివక్కడ కదలకుండానే ఉన్నాయి. సిరా పోలేదు. ఏంలేదు- ఏమిటబ్బాయ్, నేను వచ్చేసరికి అలా అంటున్నావు!

విశ్వం : అదా? నాటకం రిహార్సెలండీ అది!

తండ్రి : రి హా ర్సె లా ? బోల్తాకొట్టించారు గదోయ్ నన్ను. అయితే మా వా డు కూడా ఉన్నాడా నాటకంలో?

విశ్వం : ఉన్నాడండీ.

తండ్రి : అయితే మావాడి జాతకచక్రం గిఱ్ఱున తిరిగిందోయ్ ఈసారి - ఏ మే వ్! ఇలారా.

(తల్లి వచ్చింది)

తండ్రి : కాఫీ ఏమైనా ఉందా?

తల్లి : ఆ! డికాషన్ ఉంది. పాలు వె చ్చ బెడతాను.

తండ్రి : ఈ బిస్కట్లు ప్లేటల్లో పెట్టుకురా. (ప్యా కె ట్ ఇవ్వ బో తూ ఆ గి) అక్కర్లేదులే! నీ వు వె ళ్ళి కాఫీపని చూడు.

తల్లి : (వెళ్ళబోతుంది)

తండ్రి : వాడి కీ కొత్త చొ క్కా తొడుగు. వెళ్ళరా కిష్టీ !

(తల్లి, కిష్టి, వెళ్తారు.)

తండ్రి : ఇదిగో అ బ్బా యి లూ ! అ లా కూర్చోండి. (పిల్లల్ని బ ల్ల మీ ద కూర్చోబెట్టాడు. బిస్కట్ ప్యాకట్ విప్పుతూ) అబ్బాయ్! నీ పేరేమిటి?

రఘు : నా పేరు రఘు అండి.

తండ్రి : మీ నాన్నగారి పేరు ?

రఘు ! వెంకట్రావుగారు.

తండ్రి : వెంకట్రావుగారు ఎవరు ?

గోపి : ప్రక్కవీధిలో ఉన్న ప్లీడరుగారు.

రఘు : వీడు డాక్టరుగారి అబ్బాయి, గోపి.

గోపి : వీడు 'విశ్వం' అని మా క్లాసే.

తండ్రి : అయితే ఇప్పుడిక్కడ రి హా ర్స లు వేద్దామని వచ్చారన్న మాట !

రఘు : కాదండీ. చదువుకుందామనే-కాని...

తండ్రి : ఫరవాలేదులేవోయి ! ఆ డు కొ నే ట ప్పు డు ఆడుకున్నా చదువుకొనే టప్పుడు గట్టిగా చదువుకోవాలి. ఇంద! తీసుకోండి.

(బిస్కట్లు పెడతాడు)

గోపి : ఎందుకండీ ఇవి ?

తండ్రి : ఎందుకా? చెప్తా వినండి. పో యి న ప రీ క్ష ల లో మావాడికి దిట్టంగా వచ్చినయి మార్కులు. అందుకని

మీ అందరికి బిస్కట్లు పార్టీచేసి, మీ అందరి సమక్షంలో వాడికో మంచి బహుమతి యిస్తున్నాను. మీరుకూడా బాగా చదువుకొని మార్కులు తెచ్చుకుంటే మీ నాన్నగార్లుకూడా మీకూ యిలాగే బహుమతులు ఇస్తారు.

గోపి : నాకు మీవాడికంటే ఎక్కువే వచ్చినాయండి మార్కులు! అయినా మా నాన్నగారు నాకేమీ బహుమతి ఇవ్వలేదు.

తండ్రి : అలాగా ! ఎన్నొచ్చినాయి నీకు ఇంగ్లీషులో?

గోపి : 32

తండ్రి : ఓస్ ఇంతేనా? మావాడికి 41 వచ్చినాయి.

గోపి : కాదండీ మీ వాడికి వచ్చింది పదకొండే.

తండ్రి : నీవు కలలు కంటున్నావు. ఆరోజులు మారిపోయినాయి.

గోపి : కాదండీ! మీ వాడికి వచ్చింది పదకొండే.

రఘు : (సైగచేస్తూ) వీడికి తెలీదులెండి.

గోపి : నీకే తెలియదు.

రఘు : నోర్ముయ్!

గోపి : షటప్ !

తండ్రి : ఎందుకోయ్ మీరు పోట్లాడుకుంటారు? మావాడి ప్రోగెసు కార్డు ఇక్కడే ఉందిగా! (డ్రాయరులోంచి ప్రోగ్రెసు కార్డు తీస్తూంటాడు.)

(ఒక కుర్రాడు పరిగెత్తుకొంటూ వచ్చాడేమో, రొప్పుకుంటూ వచ్చాడు)

కుర్రాడు: (వస్తూనే) ఒరేయ్ కిష్టీ! నా ప్రోగ్రెస్ కార్డేదిరా ? (వాడక్కడ లేకపోవటం చూచి) ఏడీ కిష్టి ?

విశ్వం : నీ కార్డు వాడి దగ్గరెందుకుంది ?

కుర్రాడు: మా కార్డులు మారుపడ్డాయి.

తండ్రి : ఎలా మారుపడతయి? వాటిమీద మీ పేర్లులేవూ ?

కుర్రాడు: ఉన్నాయి.

విశ్వం : వీళ్ళిద్దరి పేర్లూ ఒకటేనండీ.

తండ్రి : అలాగా మీనాన్నగారి పేరేమిటబ్బాయ్ ?

కుర్రాడు: రాఘవరావుగారండీ.

తండ్రి : నా పేరూ అదే ! ఏదే నీదగ్గరున్న కార్డు యిలాతే. (తీసుకొని చూచి) మీ యింటిపేరేమిటబ్బాయ్ ?

కుర్రాడు: మాచిరాజువారండీ.

తండ్రి : మా యింటిపేరు మాదిరాజువారు.

విశ్వం : అందుకే మారుపడి వుంటయి.

తండ్రి : అబ్బాయ్ ! నీకు ఇంగ్లీషులో ఎన్ని వచ్చినయి మార్కులు ?

కుర్రాడు: 41

(కిష్టి కొత్తచొక్కా తొడుక్కొని, హుషారుగా వచ్చాడు)

తండ్రి : నీకురా కిష్టి ?

కిష్టి : ఏమిటి నాన్నా ?

తండ్రి : ఇంగ్లీషులో ఎన్ని వచ్చినయి మార్కులు ?

కిష్టి : ఎప్పుడూ ?

తండ్రి : పోయిన పరీక్షలో

కిష్టి : గుర్తులేదు

తండ్రి ; గుర్తులేదూ? గుర్తులేదట! సిగ్గులేకపోతేసరి. (కుర్రాడితో) నీకు క్వార్టర్లీలో ఎల్లావచ్చాయ్ మార్కులు?

కుర్రాడు; తెలుగులో 51 ఇంగ్లీషులో 62, లెక్కలలో 56.

తండ్రి : చాలు. చాలు, ఇదేలే నీ కార్డు. మా వాడివి కనిపిస్తూనే ఉన్నాయిగా తెలివితేటలు, పదులు. ఇదిగో నీ కార్డు ! నీవు తీసుకుపో. (ఇచ్చాడు. కుర్రాడు వెళతాడు) మీరు కూడా వెళ్లండి ఎవరిళ్లకు వాళ్ళు.
(పిల్లలు లేచి నుంచుంటారు—తండ్రి కార్డులోకి చూస్తూ)
9, 10, 3-ఏమి మార్కులురా ఇవి?

కిష్టి : హిందీలో 20 వచ్చినయి నాన్నా.

తండ్రి : వచ్చినయిలే. ఎట్లాగయితేనేం సున్నా! లెక్కల్లో మరీ సున్నా వచ్చిందేరా?

రఘు : (చివరి బిస్కట్టు ముక్క తింటూ) ఈ బిస్కట్లు ఎక్కడ తెచ్చారోగాని చాలా బాగున్నాయండి.

తండ్రి : తమరింకా దయచెయ్యలేదేం? ఇక్కడనుంచి వెళ్ళండి ముందు! ఊ!— వెళ్ళండి.

పిల్లలు : వస్తాంరా. కిష్టి!

విశ్వం : రిహార్సెలు రేపు పెద్దాంలే (వెళ్ళారు)

తండ్రి : రిహార్సెలుట! రిహార్సెలు! ఏమేవ్ ఇలారా!

తల్లి : (లోపల్నుంచి) ఎందుకండి అలా అరుస్తారు! కాఫీ కలిపేంతలో—

తండ్రి : కాఫీకూడా కలుపుతున్నావ్?

తల్లి : (ప్రవేశించి) ఆఁ

తండ్రి : ఇంకేం! తీసుకొచ్చి నా నెత్తినపోయ్.

తల్లి : అదేమిటండీ?

తండ్రి : ఏమిటా? చూడు (కార్డు చూపిస్తూ) మనవాడికి ఈ సారి 40లు, 50లు, వచ్చినయి మార్కులు.

తల్లి : ఇది వీడి కార్డు కాదండి?

తండ్రి : ఇదే వీడికార్డు? ఇందాకటిది మరొక కుర్రాడిది. ఇవి మారుపడ్డాయ్.

తల్లి : అలాగా?

తండ్రి : ఆఁ - నీవు శ్రద్ధగా చదివిస్తున్నావు గదూ-అందుకని దిట్టంగా వచ్చినయ్ మార్కులు.

తల్లి : వాడు పుస్తకాలు ముందర వేసుకు కూర్చుంటే చదువుతున్నాడు గదా అనుకుంటున్నా. మీరామాత్రం శ్రద్ధచూపించకపోతే ఎలావస్తాయండి మార్కులు?

తండ్రి : నిజమే.

(తెర)

# నటన - నాటకం:

★ నాటకం ఈ లోక వృత్తానికి ప్రతిబింబం.

★ మన ముఖాన్ని అద్దంలో చూచుకొన్నట్లు - ఈ సంఘాన్ని మనం నాటకంలో చూడ గలుగుతాం.

★ సంఘంలో మనుష్యులు సజీవమైన పాత్రలు : నాటకంలో ఈ సంఘజీవులు - ప్రతిబింబ పాత్రలు : సంఘంలోని మనుష్యులను వారి మనస్తత్వాలను-నాటకం మన కళ్ల ఎదుట నిలిపి చూపిస్తుంది.

★ అంటే, మనం, మనలనేగాక, మన మనస్తత్వాలనుకూడా నాటక రంగంమీద చూడగలుగు తామన్నమాట!

★ ఈ లోకమే-సూక్ష్మరూపంలో రంగస్థలం అవుతున్నది.

★ ఆ రంగస్థలంమీద వివిధ పాత్రలను ధరించి మనులుకోవాలంటే మనమే ఆ పాత్రలము అయిపోవాలి. దీనినే 'పాత్రలో లీనంకావడము' అంటారు.

★ ఈ లీనం కావడమనేది-పాత్రయొక్క భావంలోకాని, పాత్రలో కాదు.

★ తాను తానుగానే వుండి పాత్రను పోషించడమనే దానినే 'నటన' అంటారు!

★ నటనకు హావభావాలు ముఖ్యం. హావభావాలకు పాత్రోచితమైన భాషప్రధానం. ఆ భాష కంఠస్థం కావాలి.

★ అందుకే నాటకంలో 'ప్రాంప్టింగ్' పనికి రాదంటారు. పాత్రకు సంబంధించిన పాఠం అంతా కంఠతావస్తే, నటకుని దృష్టి నటనపై కేంద్రీకృతమై, పాత్ర పోషణ పరిపుష్ట మవుతుంది.

★ నటకుడు తన పాత్రనేగాక, తన ఎదుటి పాత్రపోషణకు కూడా దోహదమిచ్చే రీతిలో రంగస్థలంపై ప్రవర్తించాలి. అన్ని పాత్రలూ యథోచితంగా నటనారూపం పొందినప్పుడే నాటకం రక్తికడుతుంది; నిండుతనం పొందుతుంది.

★ పాత్ర, పాత్రాలంకరణ, పాత్ర పోషణ ఒకఎత్తు-రంగము. రంగాలంకరణ, కాంతిపరిపాలన ఒక ఎత్తు!

★ నటకులు, నాటక ప్రయోక్తలు-ఈ కళా సిద్ధాంతాలను అనుసరించినట్లయితే నిజమైన నాటక కళారాధకులవుతారు.



# కాసులపేరు

శ్రీయపతి కామేశ్వరి

ందులో వచ్చు పాత్రలు :

| | | |
|---|---|---|
| సుబ్బావధాని | : | ఇంటి విషయాలు ఏమీ పట్టించుకోని నడివయస్సు తండ్రి. |
| కాంతమ్మ | : | కూతురు పెళ్ళి ఎలాగైనా జరపాలని తపనపడుతున్న తల్లి |
| సుబ్బలక్ష్మి | : | పెళ్ళి కావలసిన కన్య (ముక్కుడి మాటలూ, మెల్లకన్ను, జడ్డితనం) |
| రమణి | : | సుబ్బలక్ష్మి చెల్లెలు |
| అమిత | : | సుబ్బలక్ష్మి స్నేహితురాలు, బహు చలాకిపిల్ల |
| వసంతమ్మ | : | 1వ సంబంధం |
| కూతురు | : | వసంతమ్మ కూతురు |
| ఎస్.టి.ఆర్. | : | పెళ్ళికూతుర్ని చూడవచ్చిన యువకుడు (ఈ పాత్ర అమ్మాయికి కూడా యువకుని దుస్తులు వేయవచ్చును.) |
| జానకమ్మ | : | 2వ సంబంధం |
| జయ | : | పక్కింటి అమ్మాయి |
| సురేష్ | : | పెళ్ళికొడుకు |

ఈ నాటకమునకు కావలసిన ముఖ్య పరికరములు

కాసులపేరు, ఉంగరం, గాజులు, బాక్సు కెమేరా, పూలమాలలు.

# మొదటి రంగము

(అవధాని ఇల్లు: అవధాని ఏదో పుస్తకం చదువు కుంటూ పడక కుర్చీలో కూర్చొనివుంటాడు. భార్య కాంతం ప్రవేశం)

కాంతం : ఏమండోయ్! ఏమండోయ్! మిమ్మల్నే అలా ఏది పట్టుకొని చదువుకుంటూ కూర్చుంటే ఎలాగండి? మన అమ్మాయి సంగతి ఏం చేశారు?

అవధాని. ఎవరు? మన సుబ్బి సంగతేనా!

కాంతం : ఏమండోయ్! దాన్ని అస్తమానం సుబ్బీ! సుబ్బీ! అని పిలిస్తే నే నూరు కోను.

అవధాని: ఏం ముద్దుగా పిలిస్తే తప్పా?

కాంతం : దానికి లక్షణంగా సుబ్బలక్ష్మి అని, సుభాషిణి అని మంచి పేర్లుండగా సుబ్బీ, డబ్బీ అని పిలిస్తే ఎవరైనా వింటే ఏమనుకుంటారు? పెళ్ళివారు చూపులకి రానే వస్తున్నారు. వాళ్ళ ముందు దాన్ని అలా పిలిస్తే ఏం బావుంటుంది?

అవధాని: మరి, అది ముక్కిడిగా మాట్లాడటం బాగుంటుందిగాని, నేను అలా సరదాకి ముద్దుగా సుబ్బి అని పిలిస్తే తప్పా?

కాంతం : తప్పా ? తప్పున్నరా ? సొంత కూతుర్ని అలా పిలుపకుంటారా? సుబ్బులూ అని పిలవండి బావుంటుంది.

అవధాని: ఏదీ! మన సుబ్బీ. ఆ అదే, అదే, సుబ్బీ కాదు సుబ్బులూ! సుబ్బులు...

సుబ్బి : (ప్రవేశించి ముక్కిడిగా) ఎందుకు నాన్న పిలిచారు?

అవధాని: ఇలారా! కూర్చో! నీకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నామే!

సుబ్బి : (సిగ్గును అభినయిస్తుంది)

కాంతం : చూశారా. దానికి అప్పుడే పెళ్ళి సిగ్గు వచ్చేసింది.

అవధాని: చూడు సుబ్బులూ! నువ్వు బాగా మాట్లాడటం నేర్చుకోవాలి, ఇలా ముక్కుతో మాట్లాడితే నీకు పెళ్ళి కాదు. (విసుగ్గా) ఇక దీనికి పెళ్ళికాదే!

కాంతం : అదేమిటండీ అలా అంటారు? బాల్లే వ్వరూ! శుభమా అని పెళ్ళి సంబంధాలు వస్తుంటే ఈ అపశకునం మాటలు ఏమిటండీ! మన తోటవారి అమ్మాయి లేదూ——దానికి బ్రహ్మ చెముడు. అయినా పెళ్ళయిందా లేదా?... .. మన వంకాయల వారి అమ్మాయి లేదూ సరోజ, దానికి కాలు సొట్ట. సొట్టయితే మాత్రం పెళ్ళాగి పోయిందా? అలాగే మన అమ్మాయికి కూడా పెళ్ళి అవుతుంది.

సుబ్బి : (ముద్దముద్దగా ముక్కిడిగా) అమ్మా! నాకు నిజంగా పెళ్ళా! ఎప్పుడే?

అవధాని: ఏమో ఎప్పుడో! దీన్ని చూడనంత సేపూ మన సంబంధం నచ్చిందనే అంటున్నారు. తీరా మాట్లాడేసరికల్లా ఆ ముక్కిడి మాటలు విని వెళ్ళిపోతున్నారు.

కాంతం : అలాగని ఊరుకుంటే ఎలా ? ఏదో ఉపాయం ఆలోచించాలి. వెయ్యి అబద్ధాలయినా ఆడి ఒక పెళ్ళిచేసి ఇల్లు నిలబెట్టాలంటారు.

అవధాని: అయితే ఏం చేద్దామంటావు?

కాంతం : వినండి మరీ! మన సుబ్బలక్ష్మికి ఉన్న లోపం ఎలాగో కప్పిపుచ్చి మాయ చేయాలి.

సుబ్బి : అమ్మా నాకు ఏం లోపం వుందే?

కాంతం : నువ్వు మాట్లాడకు. నోరుమూసుకొని కూర్చో ... (భర్తతో) ఇదిగో వినండి మరి! ఏదైనా సంబంధం కుదిరి, ఆ పుస్తెముడి కాస్తా పడేవరకూ మన సుబ్బులు చేత మాట్లాడించకుంటే సరి.

అవధాని: అప్పను సుమా! నీ ఆలోచన బాగానే వుంది. కాని వచ్చిన వాళ్లు అమ్మాయిని ఏదైనా ప్రశ్నలు వేస్తే?

కాంతం : అదే ఇప్పుడు ఆలోచించాలి. ఒక పనిచేద్దాం... మన పొరిగింటి అమిత లేదూ—అది ఎంతో ముచ్చటగా ఎకఎక మాట్లాడుతుంది.

అవధాని: అయితే?

కాంతం : దానిని పిలిపించి మన సుబ్బులుతో జత చేసి ప్రక్కనే కూచోపెడదాం. వాళ్ళడిగిన ప్రశ్నలు అన్నింటికి అమిత చప్పున జవాబు చెప్పేస్తుంది.. దాన్ని ఓ సారి పిలిపిస్తాను...అమ్మా! రమణీ! రమణీ!

రమణి : (లోనుంచి వచ్చి) ఏందుకమ్మా పిలిచావూ?

కాంతం : మన పక్కింటి అమ్మాయి అమితని ఓ సారి పిలుచుకురా తల్లీ !

రమణి ; (వెళ్ళబోతూవుండగా అమిత ప్రవేశం) అమ్మా ! ఇదిగో అమితే వచ్చింది.

అమిత : పిన్నిగారూ పిలిచారా !

కాంతం : నీ గురించే మాట్లాడుకుంటున్నాం. నికు వెయ్యేళ్ళు అయుష్షు

అమిత : (నవ్వుతూ) ఏమిటి సుభాషిణీ, ఏమిటి విశేషం ?

సుబ్బి : (అమ్మవైపు వేలు చూపుతూ) అదుగో అమ్మే చెబుతుంది.

కాంతం : చూడు, అమితా ! నువ్వోక చిన్న సహాయం చేయాలి.

అమిత : ఓ...యస్ ! తప్పకుండా వేసేస్తాను. ఏమిటో చెప్పండి.

కాంతం : మరేం లేదూ ! మన సుబ్బలక్ష్మికి రెండు మూడు సంబంధాలు వస్తున్నాయి. మనసుబ్బులు సంగతి నీకు తెలుసుగదా ! పెళ్ళివారు ఏమైనా ప్రశ్నవేస్తే వాటికి నువ్వే కల్పించుకొని టపీమని జవాబు చెప్పేయాలి.

అమిత : ఓ...యస్ ! తప్పకుండాను... ఇట్టే టపీమని జవాబు చెప్పేస్తాను. ఇంతకీ పెళ్ళివారు ఏమనిప్రశ్నలు వేస్తారండి?

కాంతం : అప్పే ! ఏమీ లేదు ! ఏం పేరు ? నువ్వేం చదువుతున్నావు ? పాట పాడగలవా?— అన్నీ ఇటువంటి ప్రశ్నలే అడుగుతారు.

అమిత : ఓ ! దానికేం అన్నీ వచ్చునని చెప్పేస్తాను. ఇంకా పై పెచ్చు ప్రైవేటుగా ఎం. ఎ, చదువుతోందనీ ! ఢిల్లీ లో డాన్స్ చేసినదనీ, ఎన్నో బహుమతులు కూడా వచ్చాయనీ ...

కాంతం : అబ్బెబ్బే: అంత అతిగా చెప్పెయ్యకు, ఉన్నదున్నట్లుగా చెప్పు చాలు. నీకు తెలుసుగా...

అమిత : అలాగేనండి ఉన్నది ఉన్నట్టుగానే చెబుతానండి. ఇంతకీ పెళ్ళి వారు ఎప్పుడొస్తున్నారండీ ?

కాంతం: ఇవాళే ! ఏ ఘడియలోనైనా రావచ్చును. పెళ్ళికూతురు పక్కనే నువ్వు కూర్చొని ఉండాలిసుమా !

సుబ్బి : అమ్మా పెళ్ళివారింకా ఎప్పుడొస్తారే ?

అమిత : తొందరెందుకే సుందర దేవీ ? (చేతులు చూసి) పిన్నిగారు ! మన సుబ్బలక్ష్మికి ఇంకా బాగా ముస్తాబు చేయాలండీ !

కాంతం : అలాగే చేద్దాం.

రమణి : అమ్మా నీచేతి గాజులు అవీ పెట్టమ్మా! అక్క చాలా అందంగా వుంటుంది.

కాంతం : అలాగేనమ్మా ! (అని చేతి గాజులు తీసి ఇస్తుంది) (రమణి అవి అక్క. చేతులకి పెడుతుంది)

కాంతం : ఇదుగో అమితా, ఈ ఉంగరం కూడా పెట్టు.

అమిత : (ఉంగరం పెట్టి) చేతిగాజులూ, ఉంగరం బాగానేవున్నాయి కాని చూడండి పిన్నిగారూ ! ఈ మెడ ఎంత బోసిగా వుందో... ఏదైనా నెక్లెస్ పెట్టాలండి.

సుబ్బి : (ముక్కిడిగా, ముద్దుముద్దుగా జడ్డిగా) అమ్మా ! నాకో కాసుల పేరు పెట్టవే!

కాంతం : కాసులపేరా ? అది ఇప్పుడు ఎక్కడ నుండి తేనమ్మా ?

అమిత : ఎవరిదైనా ఎరువుసొమ్ము తీసుకు రండీ, మరేం ఫర్వాలేదు.

కాంతం : అమ్మా ! మన పొరిగింటి పుల్లమ్మ గారు చేయించుకొన్నారే, కొత్త కాసుల పేరు....

అమిత : ఆ ! అవునే! ఆవిడను ఒకసారి నేను అడిగానని చెప్పి పట్రా.

రమణి : 'అక్కని చూట్టానికి పెళ్ళివారొస్తున్నారూ, మీ కాసుల పేరుని మా అమ్మ ఒకసారి ఇమ్మంది' అని చెప్పి అడగనా?

కాంతం : అలా చెప్పకు ! ఒకసారి అడిగానని చెప్పు, అంతే. మళ్ళీ సాయంత్రం ఇచ్చేస్తాం అని చెప్పు.

రమణి : అలాగే

(తెరలో మోటార్ హార్న్)

సుబ్బి : అమ్మా ! ఇంకా పెళ్ళివారెప్పుడు వస్తారే ?

కాంతం ; స్ ! నువు మాట్లాడకు ! మాట్లాడ వద్దంటే మాట్లాడుతావ్. పెళ్ళివారొచ్చి ఏమైనా ప్రశ్నలువేస్తే నోరు మూసుకొని కూర్చో. అన్నిటికీ మన అమిత జవాబు చెబుతుంది. తెలిసిందా !

సుబ్బు : అలాగే !

కాంతం : అదుగో కారాగింది ! పెళ్ళివారొస్తున్నారు !

రమణి : (చేత్తో కాసులపేరు పట్టుకొనివచ్చి) అమ్మా ! ఇదుగోనే కాసుల పేరు. నేను పెట్టనా !

కాంతం : (హడావిడిగా) అలాగే కాని...అక్కని లోపలకి తీసుకొని పోయిపెట్టు. పెళ్ళివారొస్తున్నారు. ఆవిడచూస్తే ఏమీ బాగుండదు. అమితా ! నువ్వు రెడీ !

(రమణి, సుబ్బలక్ష్మి లోనికి పోతారు.)

వసంత : (ప్రవేశం)

కాంతం : రండి వదినగారు! రండి కూర్చోండి !

వసంత : మీరేనా ! కాంతమ్మగారు.

కాంతం : అవునండి ! కూర్చోండి, ఈ పాప మీ అమ్మాయేనా ?

వసంత : అవునండీ ! కాబోయే వదినను చూడాలంటూ, వూరికే, ఇది వచ్చేసింది.... నేను వ్రాసిన ఉత్తరం అందిందా?

కాంతం : అందిందండీ ! పొద్దున్నించీ మీకోసం ఎదురు చూస్తున్నాను. రైలు ఆలస్యం గా వచ్చిందా ?

వసం : అబ్బే లేదండీ టైము కే వచ్చింది. మరోపని వుంటే చూసుకుని వచ్చాను. (అమిత వైపు చూసి) ఈ అమ్మాయేనా పెళ్లి కూతురు ?

అమిత : అబ్బెబ్బే! నేను కాదండి. పెళ్ళి కూతురు లోపల ఉందండీ,

కాంతం : రమణీ! అక్కని తీసుకొనిరామ్మా. అలా అ చేత్తోనే రెండు కప్పుల కాఫీ కూడా తీసుకురా !

వసం : కాఫీ గీఫీ వద్దండి. కతుకుతే అతక దన్న సామెత వుందికదండీ !

కూతురు: అమ్మా ! ఏదీ ! ఇంకా కొత్త వదిన రాదేమి ?

వసం : స్ ! నోరు మూసుకో !

(సుబ్బులు సిగ్గుతో ప్రవేశం. ఒక కుర్చీమీద గాని బల్లమీదగాని కూర్చుంటుంది. సుబ్బలక్ష్మి ప్రక్కనే అమిత కూర్చుని వుంటుంది.)

వసంత : (సుబ్బలక్ష్మివేపు చూచి) అమ్మాయి! నీ పేరేమిటి?

సుబ్బు : (నత్తిగా) సు సు స్సు ...

అమిత : (చప్పున) ఆ అమ్మాయి పేరు వెంకట వీరరత్న సుభాషిణీ!

వసంత : ఓహో! మంచి పేరే!...సు-భా-షి-ణీ నువ్వు ఏ క్లాసు చదువుతున్నావు అమ్మాయీ!

అమిత : (సుబ్బలక్ష్మి నోరు విప్పకుండా ఆ నోటికి అడ్డుగా నిలుచోని జవాబులు చెబుతుంది) ఆ అమ్మాయి క్లాసాండీ ! ఫస్ట్ క్లాస్.

వసంత : పాటా గ్రిటా నేర్చుకుందా అండీ!

అమిత : ఓ! మొన్న రేడియో పిల్లల ప్రోగ్రాంలో పాడింది. గొంతు విప్పితేచాలు అచ్చు కోకిల స్వరమే !

వసంత : అయితే డాన్స్‌కూడా నేర్చుకుంటున్న దన్న మాట. పెళ్ళికి నగలూ అవి బాగానే చేయించినట్టున్నారే!

అమిత : ఔనండీ! ఆ గాజులూ, ఆ దుద్దులూ అన్ని వాళ్ళమ్మవేనండి. కాని ఉన్న మాట చెప్పొద్దూ! ఆ మెడలో వున్న కాసుల పేరు మాత్రం వాళ్ళది కాదండి. ఎరువు తీసుకొచ్చారండి.

వసంత : అలాగటండీ!ఎరువు సొమ్మన్నమాట.

అమిత : అవునండీ, ఖచ్చితంగా ఎరువు సొమ్మే నండి.

వసంత : ఈ ఉత్తరంలో ఇంకో విధంగా రాశారే? (రిస్టువాచి టైముచూచుకొని) ఉ...ఇంక నేను వెళ్ళొస్తానండీ!

కాంతం : ఆ...ఆ...అప్పుడేనా?...మరీ...

కూతురు: (వెళ్ళిపోతున్న అమ్మ చెయ్యి వదలి సుబ్బులి దగ్గరికి పరుగెత్తి) అమ్మా మరి యీ కొత్త వదినో!

వసంత : వదినా లేదు గిదినా లేదు (వీపుమీద ఒక్కటేసి) పద...అమ్మాయి! చూడూ! ఈ ఎరువు సొమ్ము జాగ్రత్త, ఎవరిదో వాళ్ళది జాగ్రత్తగా ఇచ్చేయి. (అంటూ వెళ్లిపోతుంది)

కాంతం : (కోపంగా) ఓసేయ్ అమితా ! నీకు బుద్ధిలేదూ! ఆ కాసుల పేరు ఎరువు సొమ్మని నిన్ను ఎవరు చెప్పమన్నారే?

అమిత ; మరి అది ఎరువు సొమ్మే కదండీ ! ఉన్నమాట చెప్పాను.

కాంతం : ఉన్నమాటా లేదు, గిన్న మాటా లేదు. నీకు ఇబ్బందిగావున్న ప్రశ్న లేస్తే నాకు తెలియదని చెప్పు.

అమిత : సరేనండి.

(ఫోన్ వినిపిస్తుంది)

కాంతం : రమణీ! నాన్న గదిలో ఫోన్ వినిపిస్తోంది, వెళ్ళి చెప్పమ్మా!

అవధాని: "హలో" .. ...ఆ! ఎవరదీ ... ... వచ్చారా! మీరే వచ్చేశారా ? టాక్సీలో తిన్నగా వచ్చేయండి.

కాంతం : ఎవరండీ ఫోన్ చేశారు.

అవధాని: అదేనే! మనకి కాబోయే అల్లుడు. అతనే ఈ వూరు వచ్చాట్ట. స్టేషన్ నుండి ఫోన్ చేశాడు. టేక్సీలో రమ్మన్నాను.

కాంతం : (కంగారుగా) రమణీ! అక్కని లోపలికి తీసుకొనిపో. అమితా! నువ్వు ఇక్కడ కూర్చో, సుబ్బులు ఇక్కడ కూచుంటుంది. ఏమండోయ్! మీరు కాస్త వీధి గుమ్మం దగ్గర వుండి అల్లుడుగారు రాగానే లోనికి తీసుకు రండి! రమణీ! నువ్వు కూడా నాన్న గారితోవెళ్లి టాక్సీరాగానే చప్పున వచ్చి చెప్పు...(వస్తువులన్నీ సర్దుతూ) అమితా నీకు గుర్తుందా కానులపేరు సంగతి.

అమిత : ఓ ఎస్! బాగా గుర్తుంది,

రమణి : అమ్మా! బావొచ్చారే!

అవధాని: (ప్రవేశించి) రా నాయనా! రా! ఆమే నీకు కాబోయే అత్తగారు.

('ఫిల్మ్ హీరోలాగా దుస్తులు. మెడలో ఒక కెమెరా వ్రేలాడుతూ ఉంటుంది).

ఎస్.టి.ఆర్: ఓహ్! ఐసీ!

కాంతం : రండి (సిగ్గులు అభినయించి) అల్లుడు గారు! కూర్చోండి అల్లుడుగారు ఒక్కరే వచ్చినట్లున్నారే! అమ్మా నాన్నా రాలేదా?

ఎస్.టి.ఆర్: లేదండి! నేనొక్కడినే వచ్చాను. అమ్మాయి నాకు నచ్చితే, మా ఇంట్లో అందరికీ నచ్చినట్లే.

కాంతం : అలాగండీ!

ఎస్.టి.ఆర్: (అమితవైపు చూచి) వాట్ ఈజ్ యువర్ నేమ్?

అమిత : మైనేమ్ ఈజ్ మిస్. అమిత.

ఎస్.టి.ఆర్: ఓ ఐసీ! మిస్ అ–మి–త చక్కటి పేరు

అమిత : వాట్ ఈజ్ యువర్ నేమ్ ప్లీజ్.

ఎస్.టి.ఆర్: మై నేమ్ ఈజ్ ఎస్.టి.ఆర్.

అమిత : ఎస్.టి.ఆర్?... ఫిల్మ్....

ఎస్.టి.ఆర్: ఎస్.టి.ఆర్ నా పేరు శటకంప తిమ్మేశ్వరరావు.

అమిత : అహా (...... అలాగా !

ఎస్.టి.ఆర్: నిన్ను చూస్తే......

కాంతం : అబ్బెబ్బే! ఆఅమ్మాయి కాదండీ పెళ్ళికూతురు. పెళ్ళికూతురు లోన వుంది.

ఎస్.టి.ఆర్: ఓ! ఐసీ!

కాంతం : రమణీ అక్కని తీసుకొని రా అమ్మా! (పెళ్ళికూతురు ప్రవేశం ఆమె ప్రక్కనే అమితని కూర్చోమని తల్లి సౌంజ్ఞ)

ఎస్.టి.ఆర్: (గొంతు సర్దుకొని) అమ్మాయి! నీ పేరు?

అమిత : (లేచి) ఈ అమ్మాయిని సుబ్బలక్ష్మి అనియు సుబ్బులూ అనియు ఇంకా ముద్దుగా సుబ్బీ అనియు వివిధ నామంబులతో పిలుస్తారు. ఆమె అసలు పేరు మిస్. సుభాషిణీ.

ఎస్.టి.ఆర్: సు-భా-షి-ణీ-! అంటే బాగా మాట్లాడుతుందా?

అమిత : అవునండీ! నోరు విప్పితే మీకే తెలుస్తుంది.

కాంతం : (స్ అని సంజ్ఞ)

ఎస్. టి. ఆర్: అమ్మాయి! నీకు పాటలు, డాన్సు వచ్చునా ?

అమిత : నేను ఆమె కలిసే డాన్స్ నేర్చుకున్నాం. ఆమెకు సినీడాన్సులు వచ్చునండీ. కావాలంటే నేను చేసి చూపిస్తా (అని తధికిణ తోం.......)

ఎస్. టి. ఆర్: యు నో, యు నో! ప్లీజ్ సిట్ డౌన్ (పెళ్ళికూతురు దగ్గరికి వెళ్ళి) ఓయ్! నగలు గట్రా పెళ్ళికి బాగా చేయింబారే.

అమిత : అవునండీ. ఈ గాజులు, దుద్దులూ, వడ్డాణం వాళ్ళమ్మ వాళ్ళు బాలా రోజులక్రితమే చేయించారు. ఆ కాసుల పేరు చూశారా...దాని సంగతి మాత్రం నన్ను అడగవద్దండీ.

కాంతం : స్ నువ్వూరుకో అమితా!...మా దిరికని......

ఎస్. టి. ఆర్: ( వినిపించుకోకుండా ) ఓ కే ... ఓకే ... అమ్మాయీ! ఏది నీ ముఖం ఇలా తిప్పు.

సుబ్బులు:(మెల్లకన్ను పెట్టి తలతిప్పి భీకరంగా చూస్తుంది)

ఎస్. టి. ఆర్: (షాక్ తిన్నవాడిలా) ఓకే-ఓకే - మామగారు, ఇక నేను వెళ్ళి వస్తాను. చాలు.

* * *

కాంతం : (కోపంగా) ఏయ్ అమితా! నువ్వేదో సహాయం చేస్తావని పిలుస్తే.........

(బండి మువ్వల చప్పుడు)

చూడు తల్లీ! వీధిలో జట్కా ఆగినట్టుంది. ఎవరు చెప్మా!

రమణి : (తిరిగివచ్చి) అమ్మోయ్! ఎవరో కొత్త ఆవిడ మనింటికి వస్తోంది.

కాంతం : ఎవరు చెప్మా ? కొత్త ఆవిడ !

అమిత : ఎవరైనా పరవాలేదండీ! నేనున్నానుగా.

కాంతం : సరిసరి : నిన్ను నమ్ముకుంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్టే. ఇదిగో అమితా ఇప్పుడు చెప్తున్నా! ఆ కాసుల పేరు ఎరువు తెచ్చాం ఇదీ, అదీ అని నువ్వు ఏమీ చెప్పనక్కరలేదు. మన సుబ్బులు వంటిమీద వున్న వస్తువులన్నీ దానివే! తెలుసా ?

అమిత : సరేనండి!

జానకి : (ప్రవేశించి) ఏమండీ కాంతంగారిల్లు ఇదేనాండీ ?

కాంతం : అవునండి! నేనేనండి కాంతాన్ని. రండి, కూర్చోండి. మీరు...

జానకి : మాది రాజమండ్రి అండి. మీ ఇంట్లో పెళ్ళికి ఒక అమ్మాయి వుందని విన్నాను.

అమిత : అవునండీ! వున్నదండీ! ఆ అమ్మాయి పేరు వెంకటవీరరత్న సుభాషిణి అండీ. కాని మేము సుబ్బలక్ష్మి అనియూ, సుబ్బి అనియూ వివిధ నామంబులతో పిలుచుచుందుము.

జానకి : మరి నువ్వు ?

అమిత : నేను పెళ్ళికూతుర్ని కాదండి. ఆమె స్నేహితురాలిని. పెళ్ళికూతురు ఆ గదిలో ముస్తాబు అవుతోంది. ఈ లోన మీరు ఆ అమ్మాయి గురించి ఏమైనా ప్రశ్నలు వేయండి. నేను జవాబు చెపుతుంటాను. నేను అందుకే ఇక్కడ వున్నాను.

కాంతం : అమితా! అధిక ప్రసంగం తగ్గించు, సుబ్బులూ, సుబ్బలక్ష్మీ! రా అమ్మా! కొత్తసంబంధం వచ్చింది.

జానకి : కొత్త సంబంధాలంటున్నారు, కొన్ని సంబంధాలు వచ్చి వెళ్ళి పోయాయా?

అమిత : అవునండీ! నేను ఉన్నది ఉన్నట్టు చెప్పాలంటే ఇవాళ రెండు సంబంధాలు వచ్చి వెళ్ళిపోయాయండీ.

కాంతం : అబ్బా! నువ్వూరుకోవే!

(సుబ్బులు వస్తుంది)

అదుగోండి, ఆ అమ్మాయే సుభాషిణి.

అమిత : సు-భా-షి-ణి అంటే అర్థం ఈ అమ్మాయి బాగా మాట్లాడుతుందని.

కాంతం : అమితా! నువ్వూరుకో!

జానకి : (దగ్గరికి వచ్చి చూసి) బంగారంలాంటి పిల్ల! బోలెడు నగలు అవీ చేయించారే.

అమిత : అవునండీ, ఆ చేతిగాజులు, ఆ దుద్దులు ఆ నగలన్నీ పెళ్ళికూతురువేనండీ, ఆ కాసులపేరు వుంది చూశారూ, ఆ మెడలో అదికూడా పెళ్ళికూతురుదే నుమండీ.

కాంతం : ఒసే అమితా, ఆ కాసులపేరు సంగతి నీ కెందుకే!

అమిత : నేనేమన్నానండీ! అదికూడ దానిదే అన్నాను. మనం ఎరువు తెచ్చామని చెప్పానా!

సుధ : (ప్రవేశించి) ఏమండోయ్! పిన్నిగారూ! పిన్నిగారూ!

కాంతం : ఏవమ్మాయీ!

సుధ : పొద్దున మీరు మా అమ్మ కాసులపేరు సుబ్బులుకి పెట్టడానికి తెచ్చారట, అది ఇప్పుడు నాచేత పంపమంది. ఎక్కడికో పేరంటానికి వెళ్ళాలట.

కాంతం : కాస్సేపు వుండమ్మాయీ, పెళ్ళి వారితో మాట్లాడుతున్నాను, చూస్తున్నావా!

జానకి : వదినగారూ! అయితే ఈ నగలన్నీ అరువు సొమ్ములా!

సుబ్బు : (ఏడుపు కంఠంతో ముక్కుడిగా) అమ్మా నాకీ కాసులపేరు వద్దే. వాళ్ళది వాళ్ళకియ్యవే! (లేస్తుంది)

జానకి : ఈ గొడవేదో కానీయండి వదినగారు! నేను రేపు మళ్ళీవస్తాను. (వెళ్ళను)

అమిత : పిన్నిగారూ, నా పనికూడ అయిపోయింది. నేనుకూడ వెళ్ళి పోతాను.

కాంతం : ఉద్ధరించావులే. వెళ్ళు వెళ్ళు...

సుబ్బు : (తల్లిదగ్గరికి వస్తూ) అమ్మా నాకింకా ఎప్పుడే పెళ్ళి?

కాంతం : (విసుగు,కోపం, దుఃఖం అభినయిస్తూ) పెళ్ళా! ఇదిగో పెళ్ళి (అని వీపుమీద రెండేస్తుంది).

జయ : పిన్నిగారూ! పిన్నిగారూ!

కాంతం : ఏం తల్లీ, మళ్ళా వచ్చావు!

జయ : మా అన్నయ్యకూడా వచ్చాడండీ.

సురేష్ : నమస్కారమండీ... నా పేరు సురేష్ అండీ—

కాంతం : రా నాయనా! కూచో ...... నువ్వు పుల్లమ్మగారి అబ్బాయివా!

సురేష్ : ఔనండి, మా అమ్మ చేయించిన కొత్త కాసులపేరు మీరు ఎరువు తీసుకు రావడం, మీ అమ్మాయికి వచ్చిన సంబంధాలన్నీ తప్పిపోవడం గురించి విన్నానండి.

కాంతం : అదే నాయనా మాదురదృష్టం. ఇంతకీ నీకు ఎవరు చెప్పారు నాయనా మా ఇంటి సంగతి.

సురేష్ : మీ అమ్మాయి స్నేహితురాలు అమిత ఇందాక మా ఇంటికి వచ్చి మా అమ్మతో చెబుతూవుంటే విన్నానండి. ఒక్కపైసా కట్నం పుచ్చుకోకుండా నేను మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానండి.

అమిత : (ప్రవేశిస్తుంది).

కాంతం : నువ్వూ వచ్చావూ?

అమిత : ఔనండి, నేనే ఈ సంబంధాన్ని కుదిర్చినది. ఊఁ చెప్పవయ్యా!

సురేష్ : మా బ్రహ్మచారుల మందరము ఈ మధ్యనే శపథం పూనామండి- వర కట్నం పుచ్చుకోకుండా పెళ్ళి చేసుకుంటామని మేము ప్రతిజ్ఞ పూనామండి. అది విని మీ అమిత...

అమిత : అవునండి, నావల్లనే కదండీ మీ అమ్మాయి కొచ్చిన సంబంధాలు తప్పి పోయాయి! అందుకనీ—రమణీ! మీ అక్కని తీసుకురా అమ్మా!

(రమణి, సుబ్బి ప్రవేశం)

సుబ్బులూ! నీకు కాసులపేరంటే చాలా ఇష్టంకదూ! అందుకనీ – ఈ సురేష్‌నీ, కాసులపేరునీ తీసు కొచ్చాను.

అమిత : ఇదుగో సురేష్, నేను చెప్పానే అమ్మాయి. ఈ అమ్మాయిని గురించే. ఈమెలో ఉన్న చిన్న చిన్న లోపాలు చెప్పానుగా. వాళ్ళు కట్నం ఇచ్చుకో లేరు.

సురేష్ : తప్పు. నేనూ ఒప్పుకోను. ఈఅమ్మా యినే నేను చేసుకుంటాను.

కాంతం : చాల సంతోషం సురేష్. మాసుబ్బులు చాల అదృష్టవంతురాలు.

అవధాని: ఇంకేం పెండ్లి పనులు అప్పు చేయిస్తాం.

అమిత : అంతకుముందుగానే, ఇప్పుడే, యీ వేదికమీదే, పూల దండలు వేసు కుంటారు. ఇదిగో, దండలు నేను తీసుకొచ్చాను. ఇదుగో సురేష్, యీ దండ సుబ్బులు మెళ్లో వెయ్యి. ఈ కాసుల పేరు కూడా పెట్టు.

(సురేష్-దండవేసి, కాసులపేరు సుబ్బులు మెళ్లో వేస్తాడు.)

ఇంక సుబ్బులూ, నువ్వీదండ సురేష్ మెళ్లో వెయ్యి...... అలా సిగ్గు పడతా వెందుకూ ? వెయ్యి ......

(ఆనంద మానంద మాయెనే ...
మా సుబ్బులూ పెండ్లికూతురాయెనే...
మా సురేషు పెండ్లి కొడుకాయెనే...)

# అ భి న య ం

★ అభినయం ఒక విశిష్టమైన కళాస్వరూపం.

★ భారతదేశంలో అన్ని ప్రాంతాలకంటే దక్షిణ భారతదేశంలో ఇది విశేషంగా అభివృద్ధి చెందినది.

★ భాషలోవున్న భావాన్ని, మాటల ద్వారానే గాక అవయవాల కదలికతో వ్యక్తీకరించేది "అభినయం" అవుతుంది.

★ అందుకే- 'మానవుడు చేసే ప్రతీ చేష్టకూడా అభినయమే అవుతుంది' అన్నారు ప్రసిద్ధ శాస్త్రవేత్తలు.

★ అభినయానికి ముఖ్యమైన వాటిలో- ముఖము ప్రధానమైనది-

★ ముఖమునందున్న కళ్ళు, నోరు, పెదిమలు, ముక్కు మొదలైనవి, వివిధ భావాల వ్యక్తీకరణకు- ప్రాధాన్యం వహిస్తాయి.

★ —రెండవ స్థానం చేతులది. చేతులతో చూపలేని అభినయం లేదంటారు.

★ అభినయంలో- ఆంగికము, వాచికము, సాత్వికము- అని మూడు ప్రత్యేక వర్గము లున్నవి-

★ ఆంగికం— చేతులతో భావాల్ని చూపడం
వాచికం— భావయుక్తంగా మాటలను చెప్పడం
సాత్వికం— ముఖ కవళికలతో, కన్నులతో, పెదవులతో భావప్రదర్శన చేయడం--

★ అభినయానికి గల అన్ని వివరాలను తెలుసుకొని చేసిన అభినయం కళాత్మకమై రసపుష్టి నందుతుంది.



# పగటి వేషాలు

ముద్దిపట్ల
వెంకటరావు

**పాత్రలు :**

శేషావతారం :
(పెద్ద డబ్బున్న పిసినారి షావుకారు)

వెంకటావతారం :
(శేషావతారం కొడుకు, అమాయకుడు)

రాఘవులు :
(శేషావతారం మేనమామ కొడుకు)

పగటి వేషగాళ్ళు :
(భల్లూకం, కూవస్త్రం, మండూకం)

**రంగాలంకరణకు కావలసిన పరికరాలు :**

బియ్యం, కిరాణా దుకాణం : వివిధములైన సరుకులున్న డబ్బాలు, పెట్టెలు, త్రాసు, బస్తాలు, గల్లాపెట్టె. ప్రక్కగా ఒకటిరెండు కుర్చీబల్లలు, ఒక పెద్దబల్ల—

పగటి వేషగాళ్ళకు, పోలీసులకు- యథోచితమైన వేషాలంకరణ—

దుకాణంలోనుంచి లోపలకు వెళ్ళి, రావడానికి వీలగు ఒక గుమ్మం—

# మొదటి రంగము

[చిన్న బియ్యం దుకాణం. తెర ఎత్తగానే "రామా నన్ను బ్రోవరా" అంటూ పాడుకుంటూ భల్లూకం, మండూకం, హార్మోనియం, మద్దెల, తాళాలతో ప్రవేశం.]

భల్లూకం: ఏమండీ!...ఏమండీ!... ఏమండోయ్! చింతపండు శేషావతారం గారూ!

వెంకటావతారం: [లోపల్నుంచి కుంచంతో ప్రవేశిస్తూ] ఎవరండీ!... ఎవరయ్యా!... ఏంటయ్యా! అంతతొందర. పలికానా ఒకసారి! రావాలా! సరాసరి లోపల్నుంచి!

మండూకం: బాబుగారూ!

వెంక : ఊఁ! ఏమిటి? మా ముత్తాతల బేరం నికర్చి...... మా తాతల బేరం అతి నికర్చి!...... మా బాబు బేరం మహా నికర్చి!......మన బేరం! హూ! మహా, మహా నికర్చి!...... ఊఁ! త్వరగా!

కూపస్తం: మేం! బేరానికి రాలేదు స్వాములూ! మేము...

వెంక : మరేంటి స్వాములూ?

భల్లూకం: మేము ప్రఖ్యాత ఆంధ్ర కూచిపూడి భాగవతులం. ఈ వేళనుంచి మీ గ్రామంలో పగటివేషాలతో మాచతుఃషష్టి కళలనూ, ప్రదర్శిద్దామనుకుంటున్నాము. ఏదో అంతా తమకు తోచినట్లు, ఏదో కాదనకుండా తమ శక్తికి సరిపడేలా యిస్తున్నారు!...... గ్రామంలో సంపన్నులూ, మర్యాదస్థులు, అతి నిఖర్చి వ్యాపారస్తులు మీరుకూడా...

వెంక : ఆ! ఆ! ఆగండి!... ఉండండుండండి! ఈ విషయంలో మన పెత్తనం సున్నా!... ఆట మొదలుపెట్టండి!... ఈ లోగా మా బాబు వస్తాడు! చూద్దాం! ఊఁ! ఆడండి!

మండూకం: ఈనాటి కథావిధానం బెట్టిదనిన... ఆచార్య చండామార్కుల వారి నుండి కుమారుడు ప్రహ్లాదుని పిలిపించి, తండ్రియైన హిరణ్యకశిపు డిట్టులనియే

హిర : ఓరోరి! బాలకా! ప్రహ్లాద వినుమురా.
ఏమేమి చెప్పారు! నీ గురువులూ
॥ఓరోరి॥

ప్రహ్లా : చదువులలో సారము చెప్పారు
ఓ తండ్రీ!
నేర్చాను శాస్త్రాలు సకలములన్నియు
॥చదువు॥

హిర : అటులైన బాలకా! విన్న వింపుము
కొంత
వింటాము మేమంతా! వీనుల విందుగ
॥అటు॥

ప్రహ్లా : తండ్రీ వినుము! "కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" (పద్యం-భాగవతం)

హిర : ఓరీ! బాలకా?... ఎంత చెప్పిననూ నీ వాచాలత్వమును వీడకున్నావు—
"ఎంతచెప్పిన వినవు నీవు! ఏమిరా
ఈహొగరు బాలకా! ॥ఎంత॥
ఎందు వున్నాడురా నీ విష్ణువూ;
ఎందూ వున్నాడురా!
నాశత్రువూ! ॥ఎందూ॥
ఇందు గలడా—అందు గలడా!
ఎందు గలడురా—నాదు శత్రువు!
ఎందు గలడురా-నీదు విష్ణువు!॥ఇందు॥
ఎందూ ఉన్నాడురా—నీవిష్ణువూ!
ఎందూ ఉన్నాడురా—
నా శత్రువూ ॥ఎందూ॥

(వచనం) ఎక్కడరా! నీ విష్ణువు! ఇందున్నాడా! అందున్నాడా!

ప్రహ్లా : ఉన్నాడు తండ్రీ! ఆ సర్వాంతర్యామి ఎందుచూసిన అందే కలడు. "ఇందు గలడందులేడని సందేహము వలదు తండ్రి" [పద్యం-భాగవతం]

హిర : అయ్! ... ఈ స్తంభము నందునూ కలడా!... ఒరీ!...హరీ! రమ్మీ౯వలకు ఐతే నా గదాదండంబుచే ఈ స్తంభ మును వ్రక్కలు చేసెదనుగాక! (అంటూ గదపైకి ఎత్తుతాడు.)

వెంక : చచ్చాబ్చా!... ఆపండీ! ...... అవేం పాటలు? ఛిఛ్ఛీ! మీకు మంచివిరావు!

భల్లూకం: ఓహెూ! అదాండి ప్రభువులు!...... ఊ! ఆడరా! [పాట] "మధురా నగరిలో... చల్లనమ్మ బోదు!"

వెంక : చచ్చా!... మీకేంరావు!... ఛిఛ్ఛీ! పొండి!

కూపస్తం: మహానుభావులు! మీరే అలా అంటే ఎలా! సరిగ్గా ఏం ఆడమంటారో సెల విప్పించండి ప్రభూ!

వెంక : ఊ! అద్దదీమరీ! [ట్విస్ట్ ఆడి చూపించి] ఇలా ఉండాలి! ఊ! కానివ్వండి!

మండూకం: అబ్బా! చచ్చాం! భగవంతుడా! స్వేచ్ఛగా పాడుకుంటూ మా కళానై పుణ్యం ప్రదర్శించే రోజులు పోయాయి! సరసంగా కళాకారుల్లా మా నైపుణ్యం ప్రదర్శిస్తే కడుపు కట్టడిపోతుంది! ఏమయితేనేం?...... ఇదంతా ఆ కళామతల్లి వాత్సల్యమే అనుకోవాలి!... తల్లీక్షమించు!...ఏం వేస్తామ్!... అంతా కడుపు కక్కుర్తి! ఊ!... ఆడండి!... ఊ!... వాయించ రా భల్లూకం!

[ట్విస్ట్ ఆడి పాడుతూ వుండగా తెరలోనుంచి శేషావతారం పిలుస్తాడు]

శేషావతారం : ఒరేయ్!... అబ్బాయీ!... వెంక టావతారం!

వెంక : అమ్మబాబోయ్! ఆపండి! బాబోయ్! ఎల్లిపొండి!... మాబాబు!... అమ్మ బాబోయ్!

భల్లూకం: ఫర్వాలేదు నాయనా! మీ నాయన గారు సాక్షాత్తు కర్ణుడు. చేయి చాచిన వారికి కాదనడు! ఆయన కుబేరుడు.

శేషా : [ప్రవేశిస్తూ] ఆ! ఆ! ... ఎవరోయ్! నన్నలా పొగిడి పారేస్తున్నారు! ... ఊ! ఆగారేం!... పొగడండి!

[కూపస్తం పలుకుతూ ఉంటే వారు వంతపాట పాడుతారు]

ధర్మరాజు............ భళిభళీ!
దానకర్ణుడు............ భళిభళీ!
శేషావతారాలు....... భళిభళీ!
వరహావతారాలు...... భళిభళీ!

ఆహహా! వేయేల! అడిగిన వారిని కాదని, కాదన్న వారిని అడిగి విసుగె త్తించి, పీడించి, ఏడిపించీ ఏడిపించని అవతారం.... భళీ! భళీ!

శేషా : ఓహ్హొహెూ!...... చాలుచాలు! మీ రెంత మంచివారు! వెళ్ళిరండి. అప్పు డప్పుడు వస్తూ ఉండండి! ఇదిగో!... అబ్బాయ్! నువ్వుకూడా ఒకటివెయ్యి! ఏడుకొండల వాడా! (అంటూ తండ్రి కొడుకులిరువురూ చెరి ఒక నయాపైసా యిస్తారు.)

మండూకం: ఇదేమిటి! మహాప్రభువులు! రెండు నయాపైసలా! అసలుసిసలైన కళా కారులను యిలాగా గౌరవించడం! కనీసం!... నూటపదహార్లయినా......

భల్లూకం: కనీసం... అర్ధనూట పదహార్లయినా...

శేషా : అబ్బో ! అబ్బో ! చాలా ఆశే !...... వెళ్ళు ! వెళ్ళవయ్యా ! నూటపదార్లు ! తేరగా ఉన్నాయి కాబోలు ! అసలే యుద్ధాల్లేక, మేమఘోరిస్తూంటేను!... నాల్గు కుప్పిగంతుయి వేసినందుకేనా? పైగా! ఏ సినీస్టారయినావరదబాధితుల నిధికి వస్తే ... వెయ్యినూటపదహార్లు యిద్దు౦! చాలుచాల్లేవయ్యా ...... వెళ్ళు... వెళ్ళు!

కూపస్తం: బా బూ ! కనికరించాలి ! ధర్మ దాతలు!...... మీరే యిలా అంటే...

వెంక : వెళ్ళిపోతారా! లేకపోతే మాఅమ్మను పిలవమంటారా?

శేషా : ఊఁ ! అవునా! అబ్బీ ! పిలుపిలు !

వెంక : ఊఁ ! పిలవనా? ......మా అమ్మ వచ్చిందంటే ఆరెండు నయాపైసలు కూడ లాక్కుంటుంది, తెలుసా ?

భల్లూకం: భలే ధర్మదాతలు ! మీలాంటివాళ్లు పదిమందివుంటే చాలుబాబు ! ఊరంత భగ్గుమంబుంది ! (అంటూ వెళ్ళిపో తారు).

వెంక : భలేగా పొగిడించుకున్నాము కదూ ! అయ్యా ! రెండు నయాపైసాలిచ్చి యిద్దరమూ రెండు అర గంటలు మంచి ప్రచారం చేయించుకున్నాం.

శేషా : అవునవును ! అదీ యివ్వకపోదును ! కాని తిట్టుకుంటూ ఊరంతా దుష్ప్ర చారం చేస్తారని యిచ్చేశాను.

(తెర)

# రెండవ రంగము

(అదే యిల్లు—శేషావతారం. వెంకటావతారం లోపలుంటారు. ఈలోగా యిద్దరు పోలీసులు వేషాలతో ప్రవేశిస్తారు)

పోలీస్ : శేషావతారంగారూ ! శేషావతారం గారూ !

వెంక : ఊఁ ! ఎవరెహై పొద్దుటే బేరం ! (అంటూ బయటకు వచ్చి పోలీసుల్ని చూచి) అమ్మబాబోయ్ ! (అంటూ పారిపోబోతే పోలీసులిద్దరూ అతన్ని పట్టుకుంటారు)

పోలీస్ : ఏయ్ ! శేషావతారం అంటే మీ నాన్నేనా ?

వెంక : (ఒణుకుతూ) ఆ! అవునండి ! మా.... బాబే ?

పోలీస్ : అయితే సరే ! ...... యిలా పిలుచు కురా.

వెంక : సరే ! (అంటూ లోపలకు వెళ్లి వెంటనే తిరిగివచ్చి) ......ఇంట్లో లేడని చెప్ప మన్నాడండి. రాత్రే తిరుపతికి ఎల్లాడు. సంవత్సరందాకా రాడు.

పోలీస్-2; (1వ పోలీసుతోరహస్యంగా) భలేగా ఉందే !... వాళ్లు మనకి 'గిస్కా' యిద్దా మనుకుంటున్నారు. సరే... అయితే మనం వాళ్ళకి గట్టిగా గిస్కా యివ్వాలి.

పోలీసు-1: అబద్ధమాడకోయ్ ! శునకావతారం. మీనాన్న నిఖర్చి వ్యాపారానికి ప్రభు త్వం మెచ్చుకొని అతనికి ఖరీదయిన బహుమతి పంపారు.

వెంక : నిజంగా ! ...... అయితే ఉన్నాడు. అన్నంతింటున్నాడు లోపల. ఏదీ బగుమతీ. మా నాన్నకిచ్చేత్తాగా !

పోలీసు-2: అప్పే! అదేమీ కుదరదు. సబ్ ఇన్‌స్పెక్టరుగారు వస్తున్నారు. స్వయంగా మీ నాన్నగార్కి అందచేస్తారు.

వెంక : అయితే సరే! మానాన్నని పిలుస్తా.

స.ఇన : ఫైవ్ నాట్ వన్! శేషావతారం అంటే ఎవరు?

శేషా : (శేషావతారం ప్రవేశిస్తూ) నేనేనండి! నమస్కారం! అరెరే! నుంచునే ఉన్నారే! చిట్టిపండూ, కుర్చీ పట్టుకు రారా!

వెంక : (పట్టుకొచ్చి వేస్తాడు. యస్. ఐ. కూర్చుంటాడు.)

స.ఇన : నీ మీద కేసు వచ్చింది తెలుసా?

శేషా : కేసా! నామీదా? (నవ్వుతూ) అంతా మీరు వేళాకోళం చేస్తున్నారు ...... ఏదో బగుమతి అంటు కదూ?

స.ఇన : అదంతా నువ్వు బయటకు రావడానికి వేసిన పన్నాగంలే. నీవద్ద బాలా బియ్యం, ధాన్యం ఉన్నాయని "ప్రొక్యూర్" చేయమని ఉత్తర్వులు వచ్చాయి!.. ...అందుకే పట్టుకుందామని వచ్చాము. సరిగ్గా మాకుసమాధానంచెప్పకపోతే యివి తగలించి (బేడీలు చూపించి) ....స్టేషన్‌కి తీసుకుపోతాం.

శేషా : అమ్మయ్యమ్మో!...... కొంప మునిగింది!......అంతా అబద్ధం! అవతల వీధి పప్పురాఘవులుగాడు చెప్పిఉంటాడు, ప్రభువులూ! రక్షించాలి! అదంతా ఒట్టిది. అమ్మతోడు.

స.ఇన : అదేం కుదరదు. ఆ పప్పు రాఘవుల్ని పట్టుకొన్నాం. వాడి పని అయిపోయింది. ఇక నీ పని! ఏం?..... ఎంతవుంది సరుకు? నీవు చూపిస్తావా? లేకపోతే....ఏయ్! 501, 441...

వెళ్ళి సోదా చెయ్యండోయ్! (పోలీసు లిద్దరూ లోపలికి వెడతారు.)

శేషా : ఆగండి! ...ఆగండి! అదంతా వద్దండి! అదిమా సొంత ధాన్యం!... మాబుల్లోడు అత్తోరు కోడలు కుర్ర దానికి పంపించారు. అంతే! బ్లాక్ మార్కెట్టు చెయ్యడం లేదు! మీరు ఆడి మాటలు నమ్మకండి, (అయినా వినకుండా పోలీసులు శేషావతారాన్ని తోసుకొని యింట్లో ప్రవేశిస్తారు.)

పోలీస్-2: సార్! ఈ ప్రక్కగదిలో పదిహేను బస్తాల బియ్యం ...... ఇరవై ఆరు బస్తాల ధాన్యం ఉన్నాయి సార్. సీళ్లు వేయమంటారా?

శేషా : (1ను ప్రక్కకు పిలిచి) నాయనా! నువ్వు వీళ్లందరలోనూ కొంచెం మంచి వాడివిలా, పిల్లాజల్లా ఉన్నవాడిలా ఉన్నావు. ఇలారా! (అంటూ ప్రక్కకు పిలిచి).... అయ్యగారికి .... ఏదో సమర్పించుకుంటాను!...... దయ వుంచి వదిలెయ్య మనకూడదూ.

పోలీసు1: అదేమీ కుదరదండి!...... ఆయన మహా నిఖర్చయిన మనిషి. (కొంచెం సేపు ఆగి)..... సరే! ...... అయినా అడిగి చూస్తాను. (అంటూ సబ్ ఇన్‌స్పెక్టరును సమీపించి రహస్యంగా, పద్దాడువలలో!...... ఎంత?

స.ఇన : అయిదు వందలు ...... అను.

పోలీస్1: సరే! (అంటూ అవతారాన్ని సమీపించి) అయిదు వందలయితే ఈ నేరం పయిసలా అవుతుందయ్యా.

శేషా : అమ్మ బాబోయ్! అయిదువందలే!

పోలీస్-1: ననిగితే లాభంలేదు! సీలు వేశారంటే మొత్తం బియ్యం, ధాన్యం అన్నీ గవర్నమెంటువారి గోడవును పాలు అవు

తాయి. అదీగాక వెయ్యో పదిహేను వందలో జుల్మానా! త్వరగా ఆలోచించుకో. తరువాత యిబ్బందుల్లో పడతావు! ఇంకా అయ్యగారు అడిగింది తక్కువే.

శేషా : అయిదొందలు! ...... నా వల్లకాదు.

పోలీస్-1; అయితే చిక్కుల్లో పడతావు! ...... ఆఖరిని అఘోరించి లాభంలేదు!..... ఏమంటావ్?

శేషా : అంత అన్యాయమయ్యా! ఐదొందలే!...... రెండొందలిస్తా! ఏదో సర్ది చెప్పు ...... బీదోణ్ణిని!...... నీ కో పదిస్తా వెళ్లి చెప్పు!

పోలీస్-1: సరే! అడుగుతా!...... వప్పుకుంటే సరేసరి...... (సబ్ ఇన్స్పెక్టరుతో) రెండొందలు సార్ ... బీదోడు!...... కనికరించండి.

స.ఇన : బీదవాడా!...... అయితే మూడు వందలు! ఇక తగ్గదు,

పోలీస్-1: (శేషావతారంతో)... మూడువందలు! నిఖర్చి

శేషా : బాబ్బాబు!...... రెండొందలు ఏబై. (అంటూ లోపలికి వెళ్ళి 250 రూపాయిలు పట్టుకువచ్చి సబ్ఇన్స్పెక్టరుకు యిస్తూ) దయుంచండి బాబూ! ఇటువంటి వ్యాపారం మాకు మీకూ తరతరాలునుంచీ వస్తోంది! ఇంకా ఉందిగా..... ఈ సారికి మీకు సంతృప్తి కలిగేటట్లుగా ఏర్పాటు చేస్తాగా. దయుంచండి! ......ఒరేయ్! అబ్బీ! అమ్మనడిగి ఒక రాగిపైసా తీస్కురా.

(వెంకటావతారం తెచ్చి యిస్తాడు) ఇదుగో బాబూ! రెండు వందల ఏబై రాగి డబ్బు! (అంటూ యిస్తాడు.)

స.ఇన : (పుచ్చుకొని) మహానుభావులు! (అనబోయి నాలిక కరచుకొని) ఊ... సరే ఇటువంటి పాడు వేషాలు యింక వెయ్యకూ. ఏయ్! 501, 441, రండి పోదాం! (అంటూ స. ఇ. ముందు నడుస్తాడు)

పోలీస్-1: చా మామూలూ!

శేషా : సరే!...... యింద! (అంటూ యిస్తాడు)

పోలీసు : ఒకటా!...... ఉండు...నీ పని పడతా!

శేషా : అంతపనొద్దు!... తీసుకో. ఇంద... (అంటూ మరో నోటు యిస్తాడు. వారు వెడతారు) అమ్మయ్య! ప్రతీ ఏడూ లంచాలు అయిదు వందలు వదుల్తున్నాయి! అబ్బాయీ!... మన యాపారంలో లాభం ఈ ఏడు చాలా బాగా కన్పిస్తోందికదూ? అంతా ఏడుకొండలవాని ఎలువ! ఏడుకొండలవాడా.

వెంక : అవును... అయ్యా! అదంతా నేను వ్యాపారంలో కాలుపెట్టిన తర్వాతే...

(ఇంతలో బయట్నుంచి,) "శేషా!---- వరేయ్ బావా!" (అంటూ రాఘవులు నెత్తిన గుడ్డ వేసుకొని ప్రవేశం)

శేషా : ఏంరా!—— ఇంకా ఏం మొహం పెట్టుకు వచ్చావు? — నా సంగతి పోలీసుల్కి చెప్పి నన్ను పట్టించాలని చూశావ్రటా! చవటా!

రాఘు : అ!——— అయితే——— యిక్కడికీ వచ్చారూ?——— ఏమాత్రం వదిలిం చేమిటి?

శేషా : నేనేం నీకుమల్లే వ్యాపారంలో చవట ననుకున్నా వేమిటి? నిరుటిమీద సగం యిచ్చి పంపేశానుగా. అయితే నువ్వెంతేమిటి?

రాఘు : అయిదొందలు !

వెంక : భలే!— భలే!——— అమ్మోయ్! మా బావకి భలే చవరం అయిందే!

రాఘు : నా కొక్కడికే కాదు! ఆ దుర్మార్గులు మనందరికీ చవరంచేసి ఎల్లారు.

(అంటూ నెత్తిన గుద్దేసుకొని ఏడుస్తాడు)

శేషా : ఏంటెహే!— ఎందుకేడుపు!— ఇది మామూలేగా.

రాఘు : అదికాదురా బావా!— వాళ్లు పగటి వేషగాళ్ళు! పోలీసుల మారువేషాలు వేసుకవచ్చి మనల్ని వెర్రిబాగు లోళ్ళనుచేసి చవరం చేసుకు పోయారు!— అయ్యా! అయి దొందలు——— అయ్యయ్యో!

శేషా : అ! రెండొందల ఏభై, పైన రాగి పైసా!——— అమ్మయ్యో! యెంకట రమణా!— ఎంతపని చేశావురా! ఆ డబ్బుంటే నీ పాత మొక్కుబడి తీర్చ లేక పోయానట్రా స్వామీ!

వెంక : అయ్యోయ్!— పోలీసులు మళ్ళీవస్తు న్నారు! నిరుడొచ్చి నోళ్లేనయ్యో!—

శేషా : చచ్చాం—మనకొంప మునిగిందిరా-- ఇప్పు డీళ్ళకో అయిదొందలు!— అబ్బా!— అయ్యో!— అయ్యయ్యో!

(శేషావతారం గుండె బాదుకుంటాడు)

(తెర)



# నటుడు - నటన

★ నాటకంలో ఏపాత్రనైనా నటించాలనుకునే నటకుడు - కొన్ని ముఖ్యమైన విషయాలను గురించి శ్రద్ధవహించాలి.

★ నాటకం ఇతివృత్తం ఏమిటో ముందుగా తెలుసుకోవాలి.

★ ఆ నాటకాన్ని కవి ఏ అభిప్రాయంతో రచించాడో, దానిని ఏరూపంలో చిత్రించాడో, అసలు ఏ ఆశయాన్ని, అభిప్రాయాన్ని దృష్టిలో పెట్టుకొని నాటకాన్ని రూపొందించాడో అర్థం చేసికోవాలి.

★ ఇక, ఆ నాటకంలో తాను తీసుకొన్న పాత్రయొక్క మనస్తత్వాన్ని ప్రత్యేకతను అవగాహన చేసికోవాలి. ఆ పాత్రయొక్క పూర్వాపర సందర్భాలు ఎలాంటివో తెలుసుకోవాలి.

★ మొత్తం నాటకం యొక్క లక్ష్యాన్ని, అందు తన పాత్రయొక్క వైశిష్ట్యాన్ని ఆకళింపుకొని 'ఇది ఇదీ' అనే ఒక స్థిరమైన భావాన్ని ఏర్పరుచుకోవాలి.

★ ఇంతేకాదు, నాటకంలో తనపాత్రను మాత్రమేగాక, ఇతర పాత్రలను గురించి, ముఖ్యంగా తనతో నటించే పాత్రలయొక్క తత్వాన్ని, తనపాత్రకు, ఆ పాత్రకూగల సంబంధమెట్టిదో కూడా అర్థంచేసుకోవాలి.

★ తనతోపాటు రంగస్థలంపై నటించే ఇతర పాత్రల లక్షణము, చిత్త ప్రవృత్తులనూ తెలుసుకొనడంతో పాటు, నాటకంలో ఆ పాత్రలు (కథ వివర) పొందే పరిణామాలు, మార్పులూ తెలుసుకోవాలి.

★ నాటకానికి ఒద్దికలిచ్చి, దర్శకత్వాన్ని నిర్వహించే వ్యక్తికంటె ముందే, తన పాత్రను తాను క్షుణ్ణంగా అర్థంచేసికొని వుండడం వల్ల, దర్శకుని సలహాలు తన పాత్రపోషణకు ఇంకా మెరుగుదిద్దుకోగల అవకాశం కలిగిస్తాయి.

★ నాటకం – ఒక నటకుని యొక్క సామర్థ్యం వల్ల రక్తి చెందేది కాదు; నాటకంలోని నటకులు అందరి యొక్క సమిష్టి కృషివల్లనే రాణిస్తుంది.

★ ఈ విషయంలో "నటుడు–నటన-" ఏకత్వరూపంపొంది, నాటకంలోని నట సంఘంతో సమిష్టి భావంలో పాలు పంచుకొని, తన నటనకు, నాటకానికి రసపుష్టిని కలిగించగలుగుతాడు నటుడు.




జానపద గాథలలో "పరమానందయ్యగారి కథలు" ఎంతో వినోదాన్ని కలిగిస్తూవుంటాయి. ఆయన చర్యలు, ఆయన శిష్యుల చేష్టలు నవ్వు పుట్టిస్తూవుంటాయి. పరమానందయ్య శిష్యుల కథలని చెప్పుకొనే వాటిలో ఒక కథ ఈ నాటికకు ఆధారం.

## పాత్రలు :

పరమానందయ్యగారు, చెన్నడు, గున్నడు, తిన్నడు, పెద్దమనిషి.

# మొదటి రంగము

(పరమానందయ్యగారి ఆశ్రమం : చెట్టుక్రింద తిన్నెమీద కూర్చుని పరమానందయ్య గారు శిష్యులకు పాఠం చెపుతూవుంటారు, శిష్యులు క్రింద నాపమీద భక్తి శ్రద్ధలు చూపుతూ ఆయనకు ఎదురుగా కూర్చుని వుంటారు,)

పరమా : చెప్పు చెన్నడూ, –చెప్పు–గుఱ్ఱము–
చెప్పు...

చెన్నడు : గుల్లము – గుల్లము

పరమా : గుల్లమేమిట్రా? గుఱ్ఱము అను.

చెన్నడు : గుల్లము.

పరమా : కాదురా ఱ బండిరా.

చెన్నడు : బండిరా అండీ ? అలా చెప్పరేం ?
మరండీ, అందుచేతనేనండి, నా కా
మాట రావటంలేదు.

పరమా : ఎలా చెప్పమంటావురా?

చెన్నడు : ఇప్పుడు చెప్పారుగాదండీ బండిరా
అని, అదే......

పరమా : ఏ మదేరా?

చెన్నడు : గుల్లంలో బండిరా వుందన్నారుగా !
గుల్లము, బండికూడా ఒక్కసారిగా
నాకు నోట పట్టటంలేదండీ.

గున్నడు: ఔనండి గురువుగారూ! వాడి నోరు
బొత్తిగా చిన్నదండీ, బళ్ళు రాళ్ళు
అసలు పట్టవు...... మరో మాట
చెప్పండి,

పరమా : మొదట్లోనే అలా చెప్పమని ఏడవక
పోయావూ... సరే గున్నడూ, నువ్వు
చెప్పు. అశ్వము.

గున్నడు: అంటే ఏమిటండీ?

పరమా : అశ్వం రా... అశ్వం... అంటే గుఱ్ఱ
మన్న మాట.

చెన్నడు : అశ్వం గుఱ్ఱం ఎలా అవుతుందండీ?
గురువుగారూ ... నాకు తెలియక
అడుగుతానుకానీ—బొత్తిగానూ.

పరమా : అశ్వం గుఱ్ఱం అవడంకాదురా......
రెండు మాటలకు ఒకటే అర్థం. అశ్వం
అనేమాట సంస్కృతమూ, గుఱ్ఱమనే
మాట తెనుగూనూ.

గున్నడు: అలాగండీ ! యీ రెండు మాటలూ
వచ్చేస్తే తెనుగూ, సంస్కృతము
రెండు భాషలూ వచ్చేస్తాయన్నమాట.

చెన్నడు : అయితే గురువుగారూ! రెండుమాటలు
రెండు ఘడియల్లో కంఠతా పట్టేసి
వప్పచెప్తామండీ. అలా చెట్టుక్రింద
కూర్చుని వల్లె వేసుకొస్తాం.

పరమా : సరే పోండి. శ్రద్ధగా వల్లెవేసి చెప్పండి,
నేను ఈలోగా పూజ పూర్తిచేసుకొని
వస్తాను. (వెడతాడు)

చెన్నడు : ఒరే గున్నా, అబ్బా! ఎంత అదృష్ట
వంతులంరా మనం! రెండూ—రెండు
భాషలు వచ్చేస్తున్నాయి మనకీ.

గున్నడు: ఏమిట్రోయ్, రెండూ నీకే అన్నట్టుగా
మాట్లాడుతున్నావ్! ఒకటి నాదీ.

చెన్నడు : నీదెలా అవుతుంది? ఒకటి నాది,
రెండు నీదీని...

గున్నడు: ఓరేయ్ గుఱ్ఱం నువ్వనలేకపోతే నేను
గురువుగారిని ఇంకోమాట చెప్పమని
అడిగానా? అప్పుడు ఆయన ఏమని
చెప్పార్రా... ?

చెన్నడు : అపును చెప్పారు...నాకోసం చెప్పారు
కనుక అశ్వం నాది. గుఱ్ఱం నీదీను.

గున్నడు: నే నొప్పుకోను, నాదీ అశ్వం.

చెన్నడు : కాదు, గుఱ్ఱం – నీది.

గున్నడు: (గబ గబ అంటూ ఇద్దరూ పోటీపడ తారు).

చెన్నడు : ఒరేయ్! నువ్వలా పేచీ పెట్టావంటే గురువుగారితో చెబుతాను.

గున్నడు: గురువుగారితో చెబుతే ఇద్దర్నీ తిడ తారు. ఒరేయ్ చెన్నా–నీకు తెలియదు కాబోలు !

చెన్నడు : అవునురోయ్–నిజమే ఆమాట ! పిచ్చి మొద్దుల్లారా ! ప్రతిదానికీ అలా దెబ్బ లాడుకొంటారుట్రా......ఏదో కూడ బలుక్కుని, సమాధానపడి, కలిసి కట్టుగా పని చేసుకోవాలిగా నీ, అంటారు—అప్పుడేంచేస్తాం?

గున్నడు: అందుకోసం సమాధాన పడదాం రా, చెన్నా ! ఏం?

చెన్నడు : సమాధానపడడం ఎలాగరా? గున్నా!

గున్నడు: ఎలాగంటే నేను చెబుతానుగా ! జాగ్ర త్తగా వినరా, చెన్నా ! ఏమంటే మొట్ట మొదట గురువుగారు చెప్పినది...... గుల్లమనేగా?

చెన్నడు : అవును, అందులో బండిరా వుందిగా, అదినాకు రాలేదుగా—

గున్నడు: రాకపోతేనేం? నాకు చెప్పిన అశ్వం వుందిగా ! నీమాటలో బండిరా వున్న చోట నామాటలోని – శ్వ – పెట్టేస్తే సరి.

చెన్నడు : ఏమిటేమిటేమిటి? ఇట్టే చెప్పేశావురా- నాకు అట్టే అర్థమవలేదురా. విడ మరచి చెప్పరా, అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లూ...

గున్నడు: ఏమంటే అర్థం చేసుకొంటూ విను – వింటూ అర్థంచేసుకో- తెలిసిందా? ఏ మంటే ? గుర్రములోని ఱ్ఱ తీసేసి, అశ్వములోని 'శ్వ' ను ఱ వున్నచోట పెట్టేయడమేరా !

చెన్నడు : బలే ఆలోచనరా! అప్పుడెలా అనాలి గుల్లము అశ్వము ఱ బదులు శ్వ శ్వ ఆ ! అరె !గుశ్వము - ఒరేయ్ గున్నా, వచ్చేసిందిరా గుశ్వము. గుశ్వమురా గున్నా! గుశ్వం...గుశ్వం...(అంటూ ఆనందంతో ఎగురుతూ గంతులేస్తాడు)

గున్నడు: చెన్నడితో పాటు సంతోషంతో తిరు గుతూ చెన్నడిని నిలబెట్టి)అదీ! చూడు, ఇప్పుడునీకు నోరూ పడుతుంది, మన రెండు మాటలూ కలిసి ఒక సమాధా నమూ కుదిరింది. బావుందిర . చాలా బాగుంది. కాదురా ! చెన్నా పద.... మన గురువుగారికి దీనిని - ఏ ది - ఈ గుశ్వాన్ని–వప్ప జెప్పేస్తే పాఠం వప్పజెప్పినందుకు మనల్ని ఎంతో మెచ్చుకుంటారా్ర...... ప ద ...... పద...

చెన్నడు : పద, పదరాబాబూ - నాకు ఆనందం ఆగటంలేదు... అంతా ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. అరుగో గురువుగారు!

ఇద్దరు : గురువుగారూ ! గురువుగారూ ! వచ్చే సిందండి, ఇద్దరికీ కంఠతా వచ్చే సింది... గుశ్వమూ...

పరమా : ఏమి వచ్చేసిందిరా ?

ఇద్దరు : గుశ్వమండీ !

పరమా : గుశ్వమేమిటిరా? గుశ్వం రావడమే మిట్రా? గుశ్వమూ ! గుశ్వమూ...!

చెన్నడు : గుశ్వమేనండీ...గుశ్వం ..గుశ్వం.

పరమా : ఇదెక్కడొచ్చిందిరా? ఎప్పుడూ విన లేదూ......!

చెన్నడు : అలా అడగండి చెబుతాను గురువు గారు! నాకు గుల్లం చెప్పారా! అందు లో నాకు బండిరా రాలేదుగా.

గున్నడు: నాకు అశ్వము చెప్పారా ! అది నాకు వచ్చేసిందా?.....

చెన్నడు : వాడికి వొచ్చినది, నాకు రానిది, రెంటినీ కలిపి, ఇద్దరికీ వొచ్చేట్టు చేసే సేశాం. గురువుగారూ ! కలిసికట్టుగా వుండాలని రెండూ కలిపేశాం అప్పుడు గుశ్వము అయిందండీ. ఒకే మాటలో గుశ్వం అయివూరుకుంది గురువుగారు !

గున్నడు: రెండు భాషలూ కలిపేసి నేర్చేసుకుంటున్నాం గురువుగారూ.

పరమా : ఏడిచినట్టేవుంది మీనేర్చుకోవడం మీరూను... శివ శివ శివ శివ శివా.

చెన్నడు : గురువుగారూ అదేమిటండీ ! గురువుగారూ! అలా అనేశారేమిటండీ గురువుగారూ ! తప్పయితే మీరు మమ్మల్ని క్షమించాలి, గురువుగారూ! క్షమించేసెయ్యాలి,

పరమా : శివశివా ! ఏం క్షమించమంటార్రా .. మీ తెలివి అంతా విషమించి పోతూ వుంటేనూ......!

ఇద్దరు : విషమించడమా? అంటే ! విషమే... అయ్యిబాబోయ్...... విషమేనాండీ !

పరమా : మీ మొహం...చెప్పిన ఒక మాటైనా నోటపట్టని శుంఠలు...ఎలాచచ్చేదిరా మీ తోటి !

ఇద్దరూ : చచ్చి పోవద్దు, గురువుగారూ ! మీరు చచ్చిపోతే మేము బ్రతికి వుండేటంత తెలివితక్కువ వాళ్ళమా ! గురువుగారూ... (బ్రతిమిలాడుతూ) గురువుగారూ! నోట తిరిగే ఇంకోమాట చెప్పి పుణ్యం కట్టుకోండి !

గున్నడు: గురువుగారూ క్షమించి ఇంకో మాట చెప్పండి.

పరమా : సరే చెబుతాను ఏడవండి. తురగము.

చెన్నడు : మేం తిరగమండీ.

గున్నడు: ఎక్కడా తిరగము గురువుగారూ! ఇక్కడ వుండే వల్లేవేస్తాం -- చెప్పండయ్యా.

పరమా : తిరగడం కాదురా...... తురగము అనండి గుర్రం రాకపోతే.

చెన్నడు : గుఱ్ఱం రాకపోతే తిరగడమెలా తిరుగుతాము గురువుగారు?

గున్నడు: అది గాదురా, గుఱ్ఱం వచ్చినా తిరగమని చెప్పరా. తిరగమండయ్యా. గురువుగారూ! గుఱ్ఱం వచ్చినా తిరగం, చచ్చినా తిరగం. మీరు చచ్చిపోయినంత ఒట్టే! తిరగం తిరగం. తిరగం

పరమా : హరీహరీ నేను చావనూ వద్దూ -- మీరు తిరగనూ వద్దు. పోండి, అవతలకు పోండి.

చెన్నడు : అదిగాదండీ......

పరమా : కాకపోతే, ఏమిట్రా నీమొహం ! శివ శివ -- మీకు గుఱ్ఱమూరాదు, అశ్వమూరాదు, తురగమూరాదు శివ శివ- మీకే రానిది, నాకేం చేసిపెడతారురా! గుఱ్ఱంమాట నేర్పితే, గుఱ్ఱాన్ని సంపాదించుకువచ్చి, దాని మీద నన్ను కూర్చోబెట్టి, కాశీకి తీసుకు వెడతారనుకున్నానా. శివ శివ శివ వాడేడిరా మూడవవాడు......? తిన్నడూ

తిన్నడు : గురువుగారూ! గురువుగారూ! వచ్చేశానండీ. పట్టేశానండీ... పట్టేసి, వచ్చేశానండీ...గురువుగారూ...!

(ఒగర్చుకొంటూ -- అపసోపాలు పడతాడు).

పరమా : ఏం పట్టేశావురా? అంత ఆయాసమెందుకురా, కూర్చోరా...ఆయాసం

తీర్చుకోరా, ముందు స్థిమితపడరా, అప్పుడు చెప్పు!

తిన్నడు : పట్టేశానండీ...గుఱ్ఱము, గుఱ్ఱం గుడ్డూ కూడా పట్టేశానండీ.

పరమా : గుఱ్ఱమా? గుఱ్ఱం గుడ్డా? ఏం పట్టే శావురా?

తిన్నడు : రెండూ పట్టేశానండి, రెండండీ, రెండూ పట్టేశానండి, గురువుగారూ.

పరమా : ఏమిట్రా? స్థిమితపడి చెప్పరా -- ఏం పట్టేశావూ? ఎక్కడ పట్టేశావూ?

(తిన్నడు ఆయాసపడుతూ చెబుతూ వుంటే చెన్నడు వానికి విసనకర్రలతో విసురుతూ తాను కూడా ఆయాస పడుతూవుంటాడు.)

తిన్నడు : చెప్తా నండి. మీకు గుఱ్ఱము ఎక్కాలనే కోరిక వున్నదని తెలుసుకొన్నటువంటి వాడనై —అప్పటినిని ఎక్కడవున్నా— అంగ, వంగ, కళింగ, కాశ్మీర, నేపాళ, ఘూర్జర--ఛప్పన్న దేశాలలో ఎక్కడ వున్నా పట్టుకొనివచ్చి, మీ పాదాలకడ వుంచాలని బైలుదేరానండి -- కాని, అదృష్టవశాత్తూ దగ్గరలోనే అది దొరి కిందండి.

పరమా : అలాగట్రా, తిన్నడూ! ఎక్కడ దొరి కిందిరా? నా నాయిన! నా నా యి న! చెప్పు చెప్పు...

తిన్నడు : మన మఠానికి పది క్రోసుల్లో ఓ చెరువు గట్టున రెండు అడగుర్రాలు మేస్తున్నా యండి. బలేగా వుంది ని అనుకొని ఆ గుర్రాల ఆ సామీ ని అడిగానండి గుడ్లు అమ్ముతావా? అని. అతడు నాకేసి అట్టే పైకీ క్రిందికీ చూచి అమ్ముతానన్నాడండి--అయితే, ఎంత వెల? చెప్పమన్నానండి, పది వరహా లిచ్చి పట్టుకు వెళ్ళమన్నాడండి. ఆప శంగా పరుగెత్తుకొంటూ వచ్చేశానండి. పది వరహాలిచ్చేయండి గురువు గారూ— పట్టుకొచ్చేస్తా ను గురువు గారూ గుఱ్ఱం గుడ్డు పట్టుకొచ్చేస్తా నండి.

పరమా : ఆఁ ఆఁ ఎంతపని చేసుకొచ్చావురా నాయనా...శిష్యుడంటే నువ్వేరా!

తిన్నడు : చిత్తమండి గురువుగారూ–మీ ఆశీర్వ చన ఫలితమండి గురువుగారూ.

పరమా : వత్సా! ఆగుఱ్ఱడ్లు శ్రేష్ఠమైనవేనా...? ప్రశస్తమైనవేనా?

తిన్నడు : అయ్యో గురువుగారూ. రెండూనండీ! రెండూ రెండేనండీ! పది వరహాలిచ్చే యండి... పట్టుకొచ్చేస్తా? పరుగెత్తు కుని వెళ్ళి, పట్టుకొని పరుగెత్తుకొని వచ్చేస్తా.

పరమా : ఔనురా – అవును – అది అవశ్యం ఆచరణీయమేకాని, కాస్త ఆలోచ నీయం కూడాను – (ఆకాశంవైపు చూస్తూ ఆలోచిస్తాడు)

చెన్నడు : ఆలోచించకండి గురువుగారూ!...... ఇచ్చేయండి పట్టుకొస్తాం... ఆలోచన అనవసరమండీ! ఇలాగ ఆలోచిస్తూ కూర్చుంటే అవకాశం జారి పోతుందండీ......

గున్నడు: మాకు గుఱ్ఱము అనేమాట రాక పోయినా మీకు గుఱ్ఱమేనా వస్తుంది... మమ్మల్ని పంపించండి...... మోసు కొచ్చేస్తాం. ఆలోచించకండి. ఆలో చిస్తూకూర్చుంటే, ఆలస్యం అయి పోతుంది.

చెన్నడు : ఆలస్యం అమృతం విషం అన్నారుగా మీరు, గురువుగారూ! జ్ఞాపకం చేసుకోండి.

పరమా : అయితే, తలిచినప్పుడేనా తాత పెళ్లి?

తిన్నడు : తాత పెళ్లాండి? గురువుగారూ! బలే! బలే... !గుర్రాన్ని తీసుకొచ్చేస్తే దాని మీద ఎక్కి సవారిచేస్తూ అందరమూ తాత పెళ్లికి తరిలి వెళ్ళొచ్చు కదండీ.

చెన్నడు : ఔనౌను...చల్ చల్ చల్ చల్... (అంటూ అందరూ గుర్రం ఎక్కినట్లు తిరుగుతారు).

గున్నడు: గురువుగారూ...ఆలోచించకండి...

పరమా : ఆలోచించకుండా ఎలాగురా? గుర్రం గుడ్డు గాని, గుర్రం కాదుగా!

చెన్నడు : అయితేనేమండి గుర్రంగాక, గుర్రం గుడ్డు కావటం మంచిదండీ!

పరమా : దానిని పొదగవద్దూ? ఎవరు పొదుగుతారు?

చెన్నడు : మేమంతా లేమూ గురువుగారూ. అంత చేతగాని వాళ్ళమా గురువుగారూ?

గున్నడు: పొదగ బెట్టడమేగాదు, ఎదగ బెడతాం కూడానూ......

తిన్నడు : ఇందులో ఇంకొక ధర్మసూక్ష్మంకూడా వుంది. గమనించండి గురువుగారూ? గుడ్డు దగ్గర్నించీ పొదిగి ఎదిగిన గుఱ్ఱం మనం చెప్పినమాట వింటుంది. అదే ఎదిగిన గుర్రం అయితే మన మాట వినదు. ఎగిరి తన్నుతుంది. అదిచాలా ప్రమాదకరం. కనుక పది వరహాలు ఇచ్చేయండయ్యా మోసుకొచ్చేస్తాం......గురువుగారూ...

పరమా : సరే. ఇంతగా సరదాపడుతున్నారు కనుక ఆగుడ్డు పట్టుకురండి. అమ్మగారినడిగి సొమ్ము పట్టుకెళ్ళండి. జాగ్రత్తగా వెళ్ళిరండి. గుడ్డు మొయ్యలేకపోతే, మీరు ముగ్గురూ వంతులేసుకుని బుజాలు మార్చుకోండి. చెట్లంటా గుట్లంటా జాగ్రత్తగా వెళ్ళిరండి.

అందరూ! వెళ్ళివస్తాం గురువుగారూ, నమస్కారం.

పరమా : శుభం. క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరండి.

# రెండవ రంగము

(పొలాలమధ్య గట్టుదారి. ఒక బూడిదగుమ్మడికాయను గుడ్డలో మూటకట్టి, దానిని ఒక కర్రకు వ్రేలాడకట్టి, ఇద్దరు శిష్యులు తమ బుజాలమీద ఆకర్రను పెట్టుకొని మోసుకొస్తూ వుంటారు. మూడో శిష్యుడు హుషారిస్తూ ఉంటాడు.)

అందరు : ఓం ఓం ఓం ఓం

చెన్నడు : ఓరేయ్ గున్నడూ! బుజంమార్చుకోరా.

గున్నడు: ఛేస్! బుజమంతా తెల్లగా బూడిదయ్యింది. ఇందాకా బుజంమీద మోసుకొస్తేనూ......

తిన్నడు : గుడ్డా? మరోటా? అయితే అయింది, జాగ్రత్తగా మోసుకురారా మన మఠం దగ్గరకు వచ్చేస్తున్నాం.

గున్నడు: కర్రకు కట్టి మోసుకొస్తున్నాం కనుక కొంత సుళువు అయింది.

తిన్నడు : ఔను, యీకొండ దాటామంటే మన ఆశ్రమం అల్లంత దూరంలో కనపడుతూ వుంటుంది. ఆశ్రమం బయట గురువుగారు నుంచుని మనకోసం ఎదురుతెన్నులు చూస్తూవుంటారు.

చెన్నడు : ఒరేయ్! చెట్టుకొమ్మలురా, వంగి నడవరా! లేకపోతే కొమ్మలురాసుకొని గుడ్డు గీతలు పడిపోతుంది.

గున్నడు: ఆఁ, కొమ్మకిందికి వొచ్చేశాక చెబుతారేంరా (ధ్వని) అరే అనుకున్నంత పనీ అయింది, కర్ర జారిపోయి గుడ్డు కింద పడిపోయిందిరోయ్.

తిన్నడు : అయ్యో, గుడ్డు పగిలి పోయిందిరోయ్.

చెన్నడు: పోతే పోయిందిగాని వారేయ్ పిల్ల వూడి పడిందిరోయ్. బలే, బలే...... (మూట క్రిందపడి కాయపగులు

తుంది. అదే సమయంలో ఆ పొదల వాటునుండి ఒక తెల్లటి కుందేలు బెదురుతూ పారిపోతుంది. )

గున్నడు: అదిగోరా! ఆడొంకలోకి పిల్ల పారి పోయిందిరోయ్.

తిన్నడు : అ రె రె! ఎలాగ? గుడ్డూ పోయి, పిల్లా పోయి...

చెన్నడు : వెదుకుదాం పదండి. అదిగో అది పారిపోతోంది.

గున్నడు: అరే! తెల్లగా బొద్దుగా చెవులూ అదీ... మాబలేగా వుంది అరేరే... మా అంద మైన గు రంగుడ్డు పిల్లరా! ఇట్లే జారి పోయిందిరా! చూస్తూకూడా దానిని పట్టుకోలేక పోయామేమిటి? చెన్నా.

చెన్నడు : ఏం చెప్పమంటావురా? చేతుల్లో దొరికి వేళ్ళమధ్యనుండి పారి పోయిందిరా, అయ్యయ్యో (ఏడుస్తాడు)

తిన్నడు : ఏ డ వ కు రా చెన్నా, నువ్వు ఏడిస్తే గున్నడుకూడా ఏడుస్తాడురా...... అ ప్పు డు నాకుకూడా ఏడుపొచ్చే స్తుందిరా.

గున్నడు: ఏడుపు వస్తున్నప్పుడు,ఏడవ వద్దంటే, ఎలా ఏడవడంరా-ఒరేయ్ – ఏడుస్తూ కూర్చోవడం కాదురా – ఏడుస్తూనే గుర్రంగుడ్డు పిల్లకోసం వెదుకుదాం, పదండిరా–ఈ తుప్పలు, గిప్పలూ ముళ్ళ గీసుకు పోయినా సరే-వెదుకు దాం పదండిరా-

చెన్నడు : అలాగే పదండిరా-ఏడుస్తూనే వెదుకు దాం–ఏం చేస్తాం–పదండి.

గున్నడు: గుర్రం గుడ్డూ లేక, గుర్రం గుడ్డు పిల్లా లేక గురువుగారిమొహం ఎలా చూస్తామురా !

తిన్నడు : గురువుగారూ–గురువుగారూ – ఎంత పనిజరిగి పోయిందండీ (ఏడుస్తాడు)

చెన్నడు : (ఏడుస్తూ) ఏడవకురా! వెదకరా !

గున్నడు: పదరా, నువ్వు ఆ ప్రక్కకు పరుగెత్తు, నే నీప్రక్కకు పరుగెడతాను. పొలా లన్నీ వెతికేద్దాం.

(విచారంగా ముగ్గురూ అక్కడంతా వెదు కుతూ–మూడు వైపులకూ వెడతారు).

# మూడవ రంగం

ఆశ్రమంలో పరమానందయ్యగారు శిష్యులకోసం ఎదురుచూస్తూంవుటారు. అంతలో శిష్యులు ముగ్గురూవచ్చి ఆయన పాదాలమీద పడతారు.)

చెన్నడు : మీ పాదాలకు దండాలు గురువు గారూ.

గున్నడు: సాష్టాంగ దండ ప్రణామాలు గురువు గారూ.

తిన్నడు : అనేక కోటి దండాలు గురువుగారూ.

పరమా : అ య్యో! అ య్యో! అదేమిటర్రా– చెన్నా, గున్నా, తిన్నా, లేవండిరా– లేచి నిలబడండిరా–ఏం చేశారు?

చెన్నడు : చావలేక బతికి వచ్చాం గురువుగారూ.

గున్నడు: బతకలేక చచ్చివచ్చాం గురువుగారూ.

తిన్నడు ; చావూ కాక బతుకూకాక, ఇక్కడకు వచ్చిపడ్డాం గురువుగారూ !

పరమా : ఏమిట్రా ఏం జరిగింది? వొంటినిండా యీ రక్కులేమిటి? యీ రక్తాలేమిటి?

చెన్నడు : గుర్రం గుడ్డు పిల్లకోసం పరుగెత్తి పాటు పడ్డాం గురువుగారూ.

గున్నడు: చెట్లంటా గుట్లంటా పరుగులెత్తి, పడి, దొర్లి ఇలాఅయిపోయాము గురువు గారూ.

తిన్నడు : పదిఆమడలూ పాటుపడ్డాం గురువుగారూ,

పరమా : ఇంతకీ ఆ గుఱ్ఱంగుడ్డు పిల్ల ఏదరా?

చెన్నడు : అది పారిపోయింది గురువుగారూ! దొరకలేదండీ.

గున్నడు: గుడ్డు పగిలి పిల్ల గంతేసి పారిపోయిందండి.

తిన్నడు : మాకళ్ళముందే తుర్రుమందండి.

పరమా : పోనీ ఆ పగిలిన ముక్కలేవరా?

తిన్నడు : ఇవిగో గురువుగారూ! ముక్కలన్నీ ఏరుకొచ్చామండీ--కొంచెంకూడా వది లెయ్యకుండా!

పరమా : ఆఁ ..... ఇదేమిటరా ఇదేమి గుఱ్ఱం గుడ్డరా! శివశివా – ఇవి బూడిద గుమ్మడికాయ ముక్కలురా — అయ్యయ్యో – ఒకటిచెప్పి, మరొకటి చూచి, ఇంకొకటి పట్టుకొచ్చారేమరా! (తిన్నెమీద కూలబడతాడు)

చెన్నడు: బూడిద గుమ్మడి కాయాండీ! అంటే?

గున్నడు: గుమ్మడికాయ కానిది బూడిద గుమ్మడికాయ కాబోలురా —

తిన్నడు : బూడిద పూసుకొన్న గుమ్మడి కాయను బూడిద గుమ్మడికాయ అంటారు కాబోలురా!

పరమా : మీ మొహం-శుంఠల్లారా! శివశివ- గుఱ్ఱమూలేదు, గుఱ్ఱంగుడ్డూ లేదు- పదివరహాలు గంగపాలు చేశారుకదరా.

పెద్దమనిషి: అయ్యా, గురువుగారూ-నమస్కారాలండి!

పరమా : ఎవరుబాబూ-మా శిష్యుడేనా యేమిటి?

పెద్దమనిషి: మీ శిష్యుణ్ణి కాకపోయినా అలాంటి వాడినేనండి! అయితే మీ శిష్యులు లాంటివాణ్ణిమాత్రంకాదండి. మీరుజగద్గురువులు. అందుచేత అందరికీమీరు గురువులే, అందరూ మీ శిష్యులే—

పరమా : దానికేం బాబూ. అదంతా మీ అభిమానం! రా, ఇలారా కూర్చో! అదేమిటి? ఏదో పట్టుకొచ్చావు!

పెద్దమనిషి: ఇదేనండి–గుఱ్ఱం గుడ్డుపిల్ల--

శిష్యులు : అరే, అరే ఔనండి గురువుగారూ-అదే అదే! గుఱ్ఱం గుడ్డు పగిలి, పిల్లపారిపోయింది.!

పరమా : అది పారిపోయింది; మీ మతి జారిపోయింది -- వెర్రిచవటల్లారా! అది గుఱ్ఱం పిల్లకాదు, కుందేలు పిల్ల.

పెద్దమనిషి: చిత్తం-మీరైనా తెలుసుకొన్నారు- దీనికోసమే మీ శిష్యులు వెతికి వెతికి యిలా అయిపోయారు.

పరమా : నేనుమాత్రం వాళ్ళలా అయిపోకుండా వున్నానా ?- వాళ్ళతోపాటు నేనున్నూ మతిలేని వాడనైపోయాను.

పెద్దమనిషి: గుఱ్ఱం పిల్లను పెడుతుంది-గుడ్డు పెట్టదుగా--

పరమా : అదే, వాళ్లతోపాటు నాకుకూడా మతిపోయిందని అంటున్నానుగా.

పెద్దమనిషి: అంతమాట అనకండి. మీరు పెద్దలు! వాళ్ళతోపాటు ఏదో పొరపాటు పడి వుంటారు, అంతే! ఇవిగో మీ పది వరహాలూనూ!

పరమా ; ఇదేమిటి, మీరే వీళ్లకు అమ్మేరా?

పెద్దమనిషి: ఔను -- మా పొలంలో బూడిద గుమ్మడికాయలు చూచి, గుఱ్ఱంగుడ్లు అమ్ముతావా? అని అడిగారు. వీళ్ళేమో చిత్రమైన వాళ్ళలా వున్నారని వీళ్ళకు అమ్మి, వీళ్ళతో పాటు వెనకాల బైలుదేరాను, విచిత్రం చూద్దామని! ఇక్కడ మిమ్ములను చూచి, ఇలావచ్చాను, మీతో చెబుదామని!

పరమా : మంచివాడవు నాయనా- మా అందరికీ తెలివి చెప్పావు!

పెద్దమనిషి: తెలివి మాట ఎలావున్నా -- మీ శిష్యులు సృష్టించిన "గుఱ్ఱం" మాత్రం కలకాలమూ వుంటుంది -- మీరు, మీ శిష్యులు -- చిరకాలము వర్ధిల్లుతారు, తెనుగుజాతి జానపద చరిత్రలో – సెలవు --

పరమా : శుభం.



# పుట్టినరోజు పండుగ

కె.ఎల్. నరసింహారావు

వెట్టిచాకిరీ అనేది మానవ సంఘానికి మాయని మచ్చ. అందులోనూ బాలలచే 'వెట్టి' చేయించడం మహాద్రోహమనే చెప్పాలి. పిల్లలను కార్మికులుగా వినియోగించడం మానవత్వానికి తీరని కళంకమని చెప్పే నాటిక——

పాత్రలు :

రాజు......ఒక అబ్బాయి
ప్రసాద్......రాజు తండ్రి
రత్నం......రాజు తల్లి
విశ్వం......రాజు మేనమామ
సుబ్బన్న......ప్రసాద్ ఇంట్లో పనిచేసే కుర్రవాడు
గంగన్న......సుబ్బన్న తాత

# మొదటి రంగము

(రాజు మామూలు డ్రస్సులో నీట్‌గా ఉంటాడు. సుబ్బన్న బీదరికాన్ని సూచించే డ్రస్సులో ఉంటాడు. అంటే – ఒక చిన్న లాగు మటుకువుంటుంది. చింపిరి జుట్టు, రాజు – పలక బలపం తెచ్చి)

రాజు : సుబ్బన్నా!

సుబ్బన్న: (చేతిలో తట్ట, గొడ్డలితో వచ్చి) ఏంటి సినదొరా?

రాజు : ఇదిగో-నా పుట్టినరోజు సందర్భంలో నీ కోసం, పలక బలపం తెచ్చాను. ఓనమాలు దిద్దబెడతా-రా!

సుబ్బన్న: అమ్మో! ఇప్పుడ్యాడి సదువులేం. ఇంట్ల శనా పనుండది. పోయిలకు పుల్లలు కొట్టాలె, అంట్లు తోవాలె, పాలు పిండాలె, గడ్డికి పోయిరావాలె, గొడ్ల కాడి పేడదియ్యాలె. శనా పనుండది.

రాజు : ఆ, ఆ పనులు రోజుండేవే లెద్దూ. దిద్దబెడతా ఒకసారి చూచి పలక బలపం దాచుకో.

సుబ్బన్న: మీకు తెలవదు సినదొరా, అమ్మ గారు జూస్తే కొట్టనే కొడ్తరు.

రాజు : నువ్విట్రా సుబ్బన్నా! (సుబ్బన్న దగ్గరి కొస్తాడు) ఏమిటి - ఇవేళ చాలా నీర సంగా వున్నావు?

(సుబ్బన్న మాట్లాడడు)

రాజు : ఏం సుబ్బన్నా! మాట్లాడవేం?

(సుబ్బన్న వెక్కివెక్కి ఏడుస్తాడు)

రాజు ; అదేమిటి సుబ్బన్నా! ఏడుస్తా వెందుకు? మా అమ్మేమైనా కొట్టిందా?

(కొట్టలేదని సుబ్బన్న తల వూపు తాడు)

రాజు ; చూడు సుబ్బన్నా నువ్వు చీకటితోలేచి పది గంటలదాకా కాఫీ అయినా తాగ కుండా పనిచేస్తావు. నీకు ఆకలె య్యదు?

(సుబ్బన్నకు ఇంకా దుఃఖం వస్తుంది)

సుబ్బన్న: నాకు కాఫెందుకు సినదొరా? (మరీ ఏడుపు) నిన్నటినంది బువ్వే లేదు దొరా. ఉపాసం.

రాజు : అరరే-పాపం! ఏం-నాన్న జీతం గింజ లియ్యలేదా?

సుబ్బన్న: నాకు జీతం రాదుగద సినదొరా. తాతలనాటి బాకీ కింద జీతంజేస్తున్న.

రాజు : ఏమిటి-మీ తాత బాకీ కింద నువ్వు జీతం జేస్తున్నావా?

సుబ్బన్న: ఔ, సినదొరా, ఇరవై ఏండ్ల సంది మా తాత తమకాడ జీతం జేసుకుంట వస్తే అమ్మగారికాడ అప్పు దీసుకుం డంట. ఆ అప్పు మా అమ్మ, అయ్యలకొచ్చిన రోగాలకు కర్సు బెట్టిండంట. ఆ కర్సుకు మా ఆవు పెయ్య నమ్మినా ఆల్ల రోగాలు నయం గాక సచ్చిపోయిన్రంట. అమ్మగారి అప్పు అట్నే మిగిలిందంట. మా తాతకు పని సేతగాకుంటె నేను జీతానికొస్తున్న సినదొరా. ఇంగ నాకు జీతం ఎట్లొస్తది?

రాజు : మరి నీకు గింజలు రాకుంటే అన్నం ఎట్లా తింటావు?

సుబ్బన్న: సేత నైతే మా తాత కట్టెలమ్మి కొన్తడు. అయ్యి అమ్మెడయి గింజ లొస్తె తింటం, లేకుంటే ఏం లేదు.

రాజు : అయితే - నువ్వు కడుపు మాడ్చు కుంటూనే పనిచేస్తున్నా వన్నమాట! నాకీ సంగతే తెలియదు సుబ్బన్నా.

రత్నం : (చేతిలో ఒక పెద్ద బిందెతో వస్తూ) ఏరా సుబ్బిగా! ఇక్కడే వున్నావూ? నాకు తెలుసు, నేను అరవందె ఈ ఇంట్లో ఎవరూ పని చెయ్యరని, ఇవేళ చినదొర వుట్టినరోజు పండగని చెప్పానా?

సుబ్బన్న: సెప్పినమ్ దొరసానీ.

రత్నం : అయినా - నన్ను అరిపించాలని ఇట్లా నిలబడ్డా వన్నమాట? నాకు తెలుసు, నేను అరవంది ఈ ఇంట్లో ఎవరూ పని చెయ్యరని. ఇంతవరకు పాలు పిండలేదు. దొడ్లో పేడ తియ్యలేదు. అంట్లు తోమలేదు, కట్టెపుల్లలు కొట్ట లేదు. గడ్డికి పోలేదు. పైగా పొద్దున్నే పలకా బలపం తీసుకొని చదువుకు తయారయ్యావు. చదువు! నీ మొహా నికి ఆదొక్కటే తక్కువ. ముందు ఈ బిందె తీసుకెళ్లి బావిలో నీళ్ళు తోడి గాబులోపోసి, నీళ్ళకింద మంట బాగా పెట్టు. చినదొర స్నానం కావాలె. మా అందరి స్నానాలు కావాలె. ఇప్పుడో ఇంకాసేపటికో తమ్ముడు విశ్వం కూడారావచ్చు. అందుకని బోలెడు నీళ్లు కావాలె. గుడ్లు మిటక రిస్తూ నిలబడితే పనికాదు. పనికి ఒళ్లొంచాలె, వెళ్ళు (సుబ్బన్న వెళ్లి పోతాడు) నాకు తెలుసు నేను అరవంది ఈ ఇంట్లో ఎవరూ పనిచెయ్యరని. (రాజుతో) ఏరా వాడంటే పరాయి వాడు నీవన్నా కాస్తపోయి వుండొద్దూ. వుట్టినరోజు పండుగ నీ దనుకు న్నావా? నాదా?

రాజు : నాకేం తెలుసమ్మా, నాదని! మీరేగా కావాలని చేస్తున్నారు?

రత్నం : బహుమతి కోరడం తెలుసుగాని పండుగని తెలియదన్నమాట.

రాజు : మీరు తీరుస్తున్నారు కాబట్టి బహు మతి కోరుతున్నానంతే,

రత్నం : చాల్లే చదువు. తలంటి పోసుకుందువు గాని (రాజు వెడతాడు) అరె సుబ్బిగా నీళ్ల తోడడం అయిందా? వస్తున్నా, అబ్బబ్బ నాకు తెలుసు నేను అర వంది ఈ ఇంట్లో ఎవరూ పనిచెయ్య రని.

ప్రసాద్ : (కొత్తబట్టలతో వస్తూనే) ఏయ్- ఇదిగో! నీవు అరవకుండానే అబ్బా యికి కొత్తబట్టలు తెచ్చానుమరి.

రత్నం : చాల్లెండి మాటలు. నిన్న అరవ బట్టేగా, ఇవాళ తెచ్చారు. సరే, మంచి పని చేశారుగాని కాస్త మీరుకూడా స్నానంచేయండి.

ప్రసాద్ : ఎప్పుడో చేశాగదే.

రత్నం : అవునుకదూ, హడావుడిలో మరిచె పొయ్యాను. అయినా, చీకటితో లేచి అరిస్తేగాని తెల్లారాక స్నానం చెయ్య లేదు. ఎలాగూ నా అరుపు తప్పిందా ఏమిటి? హయ్యోరాత. నా అరుపు తప్పించేవారు లేరు ఈ ఇంట్లో. సరే మరి పలహారానికన్నా రండి. మళ్ళీ నన్ను అరిపించకండి సుమా, నాకు బోలెడు పనుంది. సుబ్బిగా, అలాగే

నిలబడ్డావా? హొయ్యికింద మంట భగ భగ మండుతున్నదా? (దుస్తులు కుర్చీ మీద వేసి లోనికి వెళ్ళ బోతుండగా విశ్వం వస్తాడు.)

విశ్వం : ఏమి బావగారూ! సేమమే గదా!

ప్రసాద్ : అరరే విశ్వం! నువ్వెప్పుడొచ్చావోయ్?

విశ్వం : ఇదేమి బావగారు! పరిహాసమా ఏమి? ఇప్పుడేకదా వచ్చుచుంటిని.

ప్రసాద్ : అలాకాదులే. నేను ఇప్పుడే బజారు నుంచి వస్తున్నాను. నువ్వు ఎప్పుడో వచ్చావనుకుంటున్నాను. రత్నం! రత్నం!

రత్నం : (వస్తూనే) అబ్బబ్బ! ఎందుకండీ అరుస్తారు? ఏం సిగరెట్ పెట్టె కనబడ లేదా? అగ్గిపెట్టె కనబడ లేదా? చెప్పులు కనబడలేదా? కండువా కన బడలేదా! నాకు తెలుసు, నేను చూసి పెట్టందే ఈ ఇంట్లో ఎవరు ఏమీ చేయలేరని.

ప్రసాద్ : అయిపోయిందా నీ దండకం. కాస్త ఉపన్యాసం ఆపి అటు చూడు. మీ తమ్ముడొచ్చాడు, తమ్ముడు విశ్వం.

రత్నం : అదేమిట్రా విశ్వం, లోపలికి రాకుండా కొత్తవాడిలా అలాగే వుండిపోయ్యావేమిట్రా! అంతా బాగు న్నారా? ఇంతకూ వాడికి కాళ్లు కడు క్కొనేందుకు నీళ్లిచ్చారా? లేదా? అబ్బబ్బ నాకు తెలుసు ఈ ఇంట్లో నేను చూసుకోందే ఏపనీ కాదని.

విశ్వం : అక్కగారూ! నాకా పాతకాలపు పద్ధతులు అక్కరలేదు. కాళ్లకు బురద యేమియు అంటలేదు.

రత్నం : అట్లయితే తలంటు పోసుకుందువు గాని రా! అల్లుని పుట్టిన రోజు పండు గగా మరి.

విశ్వం : స్నానము చేసియే బయలుదేరితిని అక్కగారూ!

రత్నం : నీ మొహం నువ్వూ! నీభాష. వాడిభాష వింటూ అలాగే నిలబడ్డారేమిటండీ! వాడిని తీసుకొని ఫలహారానికి రారే మిటీ లోపలికి. అబ్బబ్బ, నాకు తెలుసు నేను చెప్పంది ఈ ఇంట్లో ఎవరూ ఏపనీ చెయ్యరని. అయినా ఇంట్లో నాకు బోలెడు పనులు రండి. (లోనికివెడుతుంది)

ప్రసాద్ : పదవోయ్ విశ్వం ఫలహారమన్నా చెయ్యంది ఇక నీ అక్కయ్య వూరు కోదు. మళ్ళీ ఆమెను అరిపించకు. బ్లడ్ ప్రెషర్ వచ్చినా రావచ్చు.

విశ్వం : అట్టులనే ఉపాహారమునకు ఇరు వురము బయలుదేరుదము బావగారూ.

ప్రసాద్ : ఏమిటోయ్ ఆ కృతక భాష? అంతా వ్యావహారికం కావాలనుకుంటూ వుంటే నువ్వు గ్రాంధికంలోకి వెడు తున్నావేమిటి?

విశ్వం : చెప్పినది చేయకపోవుటయే గదా నేటి యుగధర్మము బావగారూ. ఈ విష యమున నేను తీసిస్ వ్రాయబోవు చున్నాడను.

ప్రసాద్: పైగా తీసిస్‌కూడానా?

విశ్వం : కాక మరేమనుకొంటిరి? మాట వరసకు మీరు శాసనసభలో ప్రజలు అమలు జరుపుటకు అనేక చట్టములను ప్రవేశ పెట్టు చుంటిరి. కాని, వాటిని మీరు అమలు జరుపుదురా యేమి?

వరకట్న నిషేధము ప్రవేశపెట్టితిరి. భూసంస్కరణలు ప్రవేశ పెట్టితిరి. వెట్టిచాకిరీని నిషేధించిరి. త్వరలో మద్యపాన నిషేధమూ కూడా ప్రవేశ పెట్టనున్నారు గదా. అవి అమలు జరుపుడనీ, జరుపనిచో శిక్షింపబడు దురు అనీ ప్రజలను బెదరించుటయే గాని, మీరు స్వయముగా అమలు జరుపు చుంటిరాయేమి? అటులనే అందరికినీ వ్యావహారికము కావలె నందుము మాటలలో, చేతు మాయేమి? గొప్పవారు చెప్పునది చేయుదురా యేమి? నేనును గొప్ప వాడనగుటకు ప్రయత్నించు చున్నా డనుగదా! అందులకే ఈ సాధన.

ప్రసాద్: చాల్లే చాల్లే, నిన్ను కదిలించడం నాదే బుద్ధితక్కువ. పదపద ఫలహారానికి, అక్కయ్య అరుస్తుంది.

(విశ్వం ప్రసాద్ వెళ్లబోతుండగా గంగన్న తట్టతో వస్తాడు. ప్రసాద్ ఆగుతాడు.)

ప్రసాద్: ఏమిట్రా గంగా వచ్చావు?

గంగన్న: గింజలు దొరా.

ప్రసాద్: ఎక్కడి గింజలురా?

గంగన్న: ముంగల్నే తిన్నంలేరిగని దొరా! నిన్నా యియ్యాల సేతగాక నేను కట్టెలకు పోలేదు దొరా. నేను బువ్వ లేకున్నా తట్టుకులేస్తగని పంటోడు సుబ్బిగాడు తట్టుకోలేడు దొరా. తల్లి దండ్రి లేనోడు. ఆడిగోస సూడలేను. పది మానికెలు ఇప్పియ్యిరి.

ప్రసాద్: ఇప్పటికే ఏడాది గింజలు ఎక్కువ ముట్టాయి తెలుసా?

గంగన్న: అంతేలేరి. నెయ్యన్నం తినే దొరలు అబద్ధమాడరుగని, అందనక ఆగలేం దొరా, నాకు వొంట్లె బాగుంటె నేను గూడా వచ్చి జీతం చేసి తవరి బాకీ నయాపైన లేకుండ తీర్చుకుంటలేరి. తవరి బాకికింద ఇంక ఎన్నాళ్లు జీతం జెయ్యాలె దొరా?

ప్రసాద్: ఏడాదని ఇప్పుడు నువ్వే గదరా అన్నావు.

గంగన్న: అన్నలేరిగని దొరా! ఎట్టగేని అంత వొడ్డీ జర తీసెయ్యాలె దొరా.

ప్రసాద్: అదంతా నాకు తెలియదు. ఆ డబ్బంతా దొరసానిగారిది. వారను కొన్నదానికి పైసైన తగ్గినా ఊరుకోరు.

గంగన్న: అంతేలేరిగని దొరా! ఎట్టనైనా కూటికి లేనోల్లం. ఇరువైయేళ్ల సంది తవరి పాదాలకాడ బతుకు తుండం, జర కాపాడాలే.

ప్రసాద్: అందుకే ఏడాదికి తగ్గింపు. అయినా అదంతా నాకేమీ తెలియదన్నాగా (వెళ్ళ బోతుంటే)

గంగన్న: దొరా! ఐదు మానికెలన్న సెలవిప్పియ్యిరి.

ప్రసాద్: అరే గంగా! అనవసరంగానాకు కోపం తెప్పించకు. 5 మానికెలు కావుగదా 5 గింజలుకూడా లేవు. చేస్తావా ఏడాది జీతం చెయ్యండి, లేకుంటె ఆ రూపాయలు వడ్డీతో తీసుకున్న అప్పు కట్టిపోండి.

గంగన్న: డబ్బుల్యాడతెస్తం లేరిదొరా. జీతాలే చేసి తవబాకీ తీర్చుకుంటం. (ప్రసాద్

లోనికెడతాడు. గంగన్న బయటకి వెళ్లబోగా సుబ్బన్న వస్తాడు.)

సుబ్బన్న: తాతా, తాతా, కన్లు తిరుగుతుండయే!

గంగన్న: కడుపుల బుక్కలేకుంట కన్లు దిరిగి గేరిరాక ఏమైతదారి. మన బతుకులు ఇంతేపా. వాయసులున్న మీఅమ్మ అయ్యలు పాటిపోయిరి. ముసలోన్ని నీ కష్టాలు జూడడానికి నేను బతికున్న. ఇంటికి పోదాయి పా. (సుబ్బన్నను తీసుకుపోబోతుండగా రాజు టీ, టిఫిన్లతో వచ్చి)

రాజు : వెళ్లకు సుబ్బన్నా!

గంగన్న: ఇప్పుడేవస్త సినదొరా. ఆనికి వొంట్లె బాగాలేదు. ఇంట్ల దింపివస్త. ఆని కింద నేను జేస్తలేరి జీతం.

రాజు : ఎవరూ వెళ్లొద్దు గంగులూ! ఇదిగో ఈ టిఫిన్, కాఫీ తీసుకోండి.

గంగన్న: మాకా సినదొరా!

రాజు : మీకే గంగులూ. నిన్నటి నుంచి నువ్వూ సుబ్బన్నా అన్నమే తినలేదట. అబ్బ! ఏం చేశామిది? ఎలా వున్నారు పాపం! ఇప్పుడివి తీసుకోండి. కాస్తాగి అన్నం తిందురు గాని.

గంగన్న: తినాలనే వుండదిగని ... పెద్దయ్యగారు, అమ్మగారు ఏమనుకుంటరో ఏమో.

రాజు : అదేంలేదు. ఆ విషయం నేను చూసుకుంటాలెండి. అంతేకాదు. నాన్న నా కోసం తెచ్చిన డ్రస్సు కూడా సుబ్బన్న వేసుకోవాలి.

గంగన్న: ఏందిది సినదొరా. మమ్ముల ఇట్లనన్న బతికనిస్తరా లేదా? అమ్మో ఈ [illegible] ఏస్తె ఇంగమేము బతికే [illegible]?

రాజు : మీకే భయమూ లేదని నేను చెప్పా నుగా. సుబ్బన్న తప్పకుండా ఈ డ్రస్సు వేసుకోవాలి. వేసుకోకుంటె నా మీదఒట్టే. వేసుకోవాలి. వేసుకో నేనిప్పుడే వస్తాను. (రాజు బయట కెడతాడు. గంగులు. సుబ్బన్నకు డ్రస్సు వేయడంలో తికమక పడు తుండగా ప్రసాద్ వచ్చి చూసి కోపంగా)

ప్రసాద్ : ఏం పనిరా యిది. వాడు డ్రస్సు ఇక్కడ పెట్టుకొని వెడితే వాడు లేనిది చూసి ఆ డ్రస్సు మీరు వేస్తున్నారన్న మాట? ఇలావుందన్నమాట మీపని? (బెత్తం తెచ్చి సుబ్బన్నను కొట్టడానికి ఎత్తేసరికి రాజు పూలదండతో వచ్చి)

రాజు : ఆగండి నాన్నగారూ! సుబ్బన్నను కొట్టకండి. వాళ్లకు ఆ టిఫిన్, డ్రస్సు ఇచ్చింది నేనే! ఆ బెత్తంతో నన్ను కొట్టండి. (వంగి వీపు అందిస్తాడు)

ప్రసాద్ : రాజూ! ఏమంటున్నావు?

రాజు : నిజమే నాన్నగారూ! (ఇంతలో తల్లీ మామకూడ వస్తారు) ఈ రోజు ముచ్చటగా నా పుట్టినరోజు పండుగ వేడుక చేస్తున్నారు. ప్రతి పండగకూ ఏదో వరంలాగా నన్ను ఒక మంచి కోరికను కోరుకోమంటున్నారు. పోగా ఒక సారి మామిడికి నీళ్ళ ట్యాంకు కావాలనీ, మరోమారు నాకు సైకిలు కావాలనీ, ఇలా నేను కోరినవన్నీ ఇస్తూ వచ్చారు. ఈ సారికూడ ఒక కోరిక కోరాలని వుంది. మీరు శాసన సభ్యులైవుండి ప్రజలందరి క్షేమం కోరే చట్టాలు ఎన్నో చేస్తున్నారు. చట్టాలన్నీ చాలా మంచివే, గొప్పవే. అందులో వెట్టి చాకిరీని నిషేధించే చట్టం కూడా ఒకటి. కాని ఆచట్టాన్ని నిజాయితీతో మనమే అమలు జరుపలేని దురదృష్టవంతుల మైనందుకు

ఎంతో దుఃఖిస్తున్నాను. సిగ్గుపడు తున్నాను. ఒకనాడు పంతులుగారు దాని అవసరాన్ని బళ్లో చెబితే నేను అంతగా పట్టించుకోలేదు. కాని - ఈనాడు గంగన్న, సుబ్బన్నల జీవి తాలు చూశాక, దాని అవసరం ఎంత వుందో అర్థం చేసుకున్నాను. అందుకే నా పుట్టినరోజు సందర్భంగా వాళ్ల కుటుంబాన్ని వెట్టిచాకిరీ నుంచి విము క్తులను చేయాలనే వరాన్ని కోరుకో దలచాను. మీరు కరుణిస్తే అదన్నా ప్రసాదించండి. లేదా - ఒక వేళ కుర్రవాడుగా నా కోర్కె తప్పయితే ఆ బెత్తంతో నన్ను - మీ ఆవేశం చల్లారే దాకా కొట్టడంలో ఎంత మాత్రం వెనుకాడవద్దని ప్రార్థిస్తున్నాను (అని వీపు వంచుతాడు)

ప్రసాద్ : (బెత్తం దూరంగావేసి రాజు మెళ్లో దండవేసి ఎత్తుకొని) రాజూ! ఎంత మాట అన్నావు! ఇంకా నేను నిన్ను కొట్టడమా! చిన్నవాడవైనా ధైర్యంగా నిజాన్ని చెప్పి పరోక్షంగా ఫెళ్ళున కొట్టినందుకు నేనెంతో సంతోషిస్తు న్నాను, గర్విస్తున్నాను.

విశ్వం : నీలాంటి కుర్రాళ్లు ఇలా అడిగి లోక జ్ఞానంతెచ్చుకుంటే మీచదువుకూ సార్థ కతవస్తుంది. తల్లిదండ్రులూ జీవితాన్ని పురాణకాలక్షేపంగా కాక నిజాయితీగా ఎంచుతారు రాజూ.

ప్రసాద్ : ఏమిటోయ్ విశ్వం. భాషేమార్చే శావు!

విశ్వం : బావగారు! మీ అంతటి గొప్పవారే మారిపోయినప్పుడు-నాలాంటి సామా న్యుడికి ఆ కృత్రిమభాష ఎందుకండీ!

ప్రసాద్ : భలేవాడివోయ్. మళ్లీ ఒక దెబ్బ వేశావూ? నిన్ను కదలించడం నాదే తప్పు.

రత్నం : అంతా కలసి నన్నేగా వంచేది?(లోప లికి పోతుంది)

ప్రసాద్ : విశ్వం, ఎందరు మారినా మీ అక్క గారు మారదు. కాస్త ఆమెను మార్చరాదూ!

విశ్వం : మీరు నిజాయితీతో నిలబడితే అంతా మారతారు బావగారూ. అరే రాజూ! పుట్టినరోజు పండుగను ఒక ఒట్టి కాల క్షేపపు వేడుకగా గాక - గట్టి ప్రయో జనంగా మార్చినందుకు అక్కయ్యా! ఆ స్వీట్లు ఇట్లా అందుకో. (రత్నం స్వీట్లు తెస్తుంది. అది విశ్వం తీసుకో బోతాడు)

రాజు : నో నో, స్వీట్లు మీకు నాకు కాదు మామయ్యా ఇవ్వాల్సింది. నా చిన్న కోర్కెను మన్నించినందుకు నే నే మీకివ్వాలి. (అని ఒక్కొక్కరి నోట్లో స్వీట్లు కుక్కి గంగన్న, సుబ్బన్నలకు తప్ప తల్లి, తండ్రి, మామలకు నమస్కరిస్తూ వుండగా...

(తెర)

# నటులు - ఆహార్యము :

- నాటక కళకు సంబంధించిన వివిధ శాఖలలో "ఆహార్యం" అతి ముఖ్యమైనది.
- వర్ణాలంకరణ-వస్త్రధారణ- అనేవి ఇందు ముఖ్యాంశాలు.
- వర్ణాలంకరణ అంటే-రంగులు వేసుకోవడం. వస్త్రధారణ అంటే దుస్తులు ధరించడం.- అంటే-నటకుడు-తాను ధరించబోయే పాత్రకు సంబంధించిన ఆకారాన్ని సంతరించుకోవడానికి-అందుకు అనుగుణమైన రంగులు వేసుకోవడము, దుస్తులు ధరించడము అన్న మాట!
- రాణి, రాజు - పాత్రలను ధరించే నటీ నటకుడు - ఆ పాత్రలను పోలిన రంగులు వేసుకోవాలి; ఆ రకం దుస్తులు ధరించాలి.
- రంగులు వేసుకోవడమనేది ఒక ప్రత్యేకమైన కళ. పూర్వం నటకులు తమ ముఖాలకు, చేతులకు రంగులువేసుకోవడానికి నేడు వున్నన్ని సౌకర్యాలు వుండేవి కావు. అందుచేత సింధూరము, ఇంగిలీకం, కాటుక-పసువు, కుంకుమ, నీలిరంగు సుద్ద మొదలైనవి వాడుకోనేవారు.
- ఆయా రంగులను అవసరమైన పాళ్ళలో కలుపుకొని ముఖానికి చేతులకు రాసుకొనేవారు. కనుబొమ్మలకు, రెప్పలకు కాటుక పెట్టుకొనేవారు. బొట్టు, చుక్కలు-దిద్దుకొనేవారు.
- దుస్తులు కూడా ప్రత్యేకం తయారు చేసికొనేవారు. రాజు, రాణి వేషాలకు చమ్కీకోట్లు, రవికలు తయారుచేసికొని ధరించేవారు. ఇలాగే, ఇతర దుస్తులను కూడా సమకూర్చుకొని అలంకరించుకొనేవారు.
- ఇక-పౌరాణికమైన పాత్రలకు కావలసిన కిరీటాలు, భుజకీర్తులు, హారాలు మొదలైనవి-స్త్రీ పాత్రలకు కావలసిన శిరోభూషణాలు, జూకాలు, ముక్కు పుడకలు — మొదలైనవి కూడా పూసలతో తయారుచేసికొని ధరించేవారు. ఈ అలంకరణ, ఆహార్య విశేషాలన్నీ మహారాష్ట్ర నటీ నటకులను అనుసరించేవారు.
- నేటికి సుమారు యాభై సంవత్సరాలకు పూర్వం మహారాష్ట్ర నాటక నటసంప్రదాయం దేశం అంతటికీ అనుసరణీయంగా వుండేది. ఈ విషయంలో మహారాష్ట్ర కళాకారులు మార్గదర్శకులైనారనటంలో అత్యుక్తి లేదు.
- నటకుడు రంగస్థలంపైకి రాగానే, అతని దుస్తులు రంగుల అలంకరణతో-అతడు పలానాపాత్ర ధరించి నటించబోతున్నాడని ప్రేక్షకులకు అర్థం అవుతుంది.
- నటకుని ఆహార్య అలంకరణ, అతని పాత్రకు జీవం పోస్తుంది.
- అందుకే నటీ నటకులు ఆహార్యాలంకరణ విషయంలో ఎంతో శ్రద్ధ తీసికొంటారు.



# బుచ్చయ్య దెబ్బ

యశోదారెడ్డి

పాత్రలు :

రంగయ్య, బుచ్చయ్య, కొండ రెడ్డి, రాంరెడ్డి, రాంరెడ్డి తల్లి, పార్వతి, కట్టోడు, రాజయ్య, పంతులు, రాములు — యింకా కొందరు పిల్లలు.

రంగాలంకరణ :

పల్లెటూరి బడి వాతావరణం-పిల్లలు కూర్చొనడానికి చిరిబాపలు, ఒక కుర్చీ, బల్ల, గంటకొట్టే యినపకొయ్య, బ్లాకు బోర్డు - మొదలగునవి.

# మొదటి రంగము

రామచంద్రాపురం వీధిబడి; వీధిబడి పంతులు వెంకయ్య పోయి కొత్తపంతులు వచ్చే సందర్భం.
(ప్రవేశం బడిపిల్లలు, వారి పెద్ద బుచ్చయ్య)

రంగయ్య: బుచ్చయ్యా! బుచ్చయ్యా! రేపు మళ్ల కొత్త పంతులొస్తడంట గదా! ఇంగ సర్కారు సాల్లెతీర్గ మనసాల్లెల గూడ సదువు జెప్తరంటగద.

ఒకడు : అవును పెబ్బ నిజంగనా, కొత్త పంతులయ్య వచ్చే సంగతి.

బుచ్చయ్య: అవును, కొత్తపంతులు రేపొస్తడు గని, కొత్తపంతు లొస్తేంది, పాత పంతులుంటేంది. ఎట్లయిన "పెబ్బ" ను నేనే. ఇగ నా తరువాత పటేలు కొడుకని కొండరెడ్డికిగిట్ల పంతులు బెదుర్తడో ఏందోగని, నేనుండంగ మీకేందిరా బుగులు.

రంగయ్య: బుచ్చయ్యా, యెట్లనన్న జెర కొత్త పంతులొస్తే మనకు కష్టమే అయితది. యెందుకంటే, నీకు, కొండరెడ్డికి, సాలెరామునికి పెద్దెరుసులు, సిన్నెరుసులు రానేరావు. మన వస్టిం పంతులయ అంటే వూకుంటుండెగాని కొత్తాయన యేమంటడో యేందో.

బుచ్చయ్య: అరే అట్లగాదుర, పాతపంతులున్నప్పుడే జర తిప్పలుండె గా పంతులున్నప్పుడే గీ యెరుసులు, సిన్నపుట్టి, పెద్దపుట్టి లెక్కలు గావల్సి వుంటుండె. ఇగ సర్కారిసాల్లెతీర్గజేస్తే బొట్లెర్సుల లెక్కతోటి పనేలేదు మనకు. కొత్త పాటాల సంగతంటవా, నేనైతే పెబ్బనే, యిగ యేమన్న జెర దెబ్బల బయముంటే కొండరెడ్డికే. సాలె రాముడేమో తాటిదూల మంతుండె. వాణ్ణి కోదండ మెక్కిచ్చినా కాళ్లు న్యాల కాంతవి.

వొకడు : బుచ్చయ్య! యిగో మన కాపు రంగయ్య కొడుకు రాంరెడ్డి జిట్టెడు లేడు. వాడు యాపాటం చెప్పినా గడగడ మంచినీళ్ల దాగినట్లే. వీని తోటొచ్చింది సావు మనకు, మనజత గాండ్లకు.

బుచ్చయ్య: రంగయ్యా! ఓయబ్బా నీకు వాడో పెద్ద గురేటుకాడాయే. ఏంది, రెండు దినాలు మనంగూడ గోలీలు, యిసు పేట్లు ఆడకుండవుంటిమంటే మసం వాని తాత సదవొచ్చు. దండి బాగ్యా నికి నీవు వానికి బయపడ్తవా యెట్ల.

వొకజు : ఎట్లగన్న బుచ్చయ్య రేపు కొత్త పంతు లొస్తే జెర బద్రంగనే వుండాలె. ఆయన వచ్చే ట్యాళ్ళకు బియ్యం గియ్యం శనా దెచ్చిపెట్టాల. నీవైతే యెట్లగన్న పెబ్బవు. అందరితోటి బాగ జెప్పు.

బుచ్చయ్య: గీమాట నాకు చెప్పాల్నా, నేను నీకన్న ముందుగాల్నే అనుకున్న. అరే పిల్లలూ, రేపు కొత్త పంతులయ్య వొస్తుండడు. అదిగాక మళ్ళ పలకల పూజ. ఇంగ మీరందరు పంతులుకు తలా పావుశేరు బియ్యం, సెటాకు పావెడు నూనె, మరి నాకోపైస దీస్కరావాలె. లేకుంటే ఇగ శ్రీనుక్కలు రాసెటప్పుడు తప్పులు రాసి,

వొక్కొక్కడి యాపులు పలగొట్టిస్త. మఱి యింగ గొల్లసాయిగాడేమో నా పల్కను ముద్దుగ గడ్కి సిత్తారి దింపాలె, కుర్వ సెంద్రిగాడేమో బంగులల్కాలె, ఆ కొండరెడ్డి యింగా కోమటి సింగోటం కొడ్కు గనపడడు. పోయిన అష్టమికైతనాడు పుట్నాలు, బెల్లం దీస్కరాకనేపాయే. మరి యీ పల్కల పూజకన్న తెస్తడో తేడో. మన వష్టింవంతున్నంగ వాని తండ్రికి బెదిరి అయ్యగాడికి జెర దెబ్బలు దగులకుండె. రేవు కొత్త వంతులొస్తె యిగ జరా సూస్కోబిడ్డ తమాస.

కొండరెడ్డి : ఇగో బుచ్చయ్య, రాంరెడ్డితోటి బాగ చెప్పు బియ్యం దెమ్మని.

బుచ్చయ్య: రాంరెడ్డి, వో రాంరెడ్డి! యిప్పుడు జెప్పిన ముచ్చట నీ కినపడ్డదా, లేక పోతే నీకు మళ్ళజెప్పాల్నా.

కొండరెడ్డి: అవునయ్యో ! రాంరెడ్డి నీ వొక్కడవు దేక. కొత్తవంతులు వచ్చేదినం రాంగనే మాయందరికి వడ్లను పెట్టిచ్చేవు.

# రెండవ రంగము

(రాంరెడ్డి ఇల్లు. కాపురాంరెడ్డి, తల్లి, చెల్లి పార్వతి)

రాంరెడ్డి : అమ్మా, వోయమ్మా, యీయాళ్ళ నేమో పలుకల పూజంట, మరి కొత్త వంతులొస్తడంట, మరి నాకుపావెడు నూనె, బియ్యం, పైస గావాలె.

తల్లి : బాగానే వుంది యాపారం. సదువు సారెడు, బలుపాలు దోసడంట. ఇంట్లలేని నూనె నీకు యాడికెల్లి దెచ్చిత్తు.

రాంరెడ్డి : నేనీయాళ్ళ నూనెగిట్ట దీస్కపోకపోతే నన్నందరు గలిసి యెక్కిరిస్తరు. నిజంగ నేనొక్కణ్నెగాదు, బియ్యానికి బదులు కట్టోణ్ని పైసలు దెమ్మన్నరు. కొండరెడ్డయితే నన్నుజూసి పూరకెనే కిసకిస నగుతడు.

తల్లి : అయ్యో కతా! ఆ కొండరెడ్డి నగంగనే నీపై బిల్లులు వడేనా రెండు పైస లున్నోడు, వాడు నగిండని నీ వెగురైకుదర్తదా యేంది ?

రాంరెడ్డి : ఓయమ్మ, ఇవి యీయ్యాళ్ళ దీస్కపోకపోతె నాకు దెబ్బలు దగల్తవే.

తల్లి : పార్వతమ్మా, వో పార్వతమ్మ. జర సింగోటం దగ్గరికివోయి పావెడు నూనె బదులు దీస్కరా. వీని సదు వేమోగాని, మా పని గువ్వలకాడ్కి వచ్చేటట్లేవుంది.

పార్వతి : అమ్మా, మళ్ళ అన్న నూనెతోటే సదువుకుంటడా యెట్ల, మొన్ననేమో బెబ్బరిగారెలు జెయ్యమంటె నూనె లేదంటివిగాని యిప్పుడంట యీయనకు నేను నూనె దెస్తనంట.

తల్లి : ఆరీ రాములూ, నిజంగనే, మరి పాతవంతులయ వుండంగా పావుశేరు

బియ్యంతోటే సరిపోతుండె. యిప్పు డేమో నూనె, బియ్యం, పైనగూడ యియ్యమంటుండ వేందిరా !

రాంరెడ్డి : అమ్మా గివన్నీ యాపంతులు జెప్ప లేదే. యీపైసనేమో మా పెబ్బకంట. మరి నూనెనేమో పంతులయ్య యింట్ల దీపానికంట. బుచ్చయ్య దెమ్మన్నడు లేకపోతే నామీద తాకట్లుజెప్పి కొట్టిస్త డంట.

తల్లి : వాడు నీమీద తాకట్లు జెప్పితేమట్కు పంతులయ యినేటందుకు వాడంత మనగాడా యేంది. నీ తీర్గ వాడు, వాని తీర్గ నీవు, సదువు సక్కన సదివితే పంతులయ్య యెందుకు గొడ్తడూ !

పార్వతి : అమ్మా, అన్న యీ పైస పెబ్బపేరు జెప్పి తానే బొంబాయి మిఠాయిగిట్ట గొన్న తింటడో యేందోనే.

రాంరెడ్డి : అదిగాదే అమ్మా! నేనన్ని పాఠాలు బాగానే యాదిజేస్త. మరి పాత పంతు లయ్య వుండంగ గూడ నన్ను మెచ్చు కుంటుండెగని, మా పెబ్బా, కొండ రెడ్డి, రాములుగాడు అందరుగల్సి నన్ను నీవు ఈసారిగిన పాటాలు బాగా వొప్ప జెప్పితే పెద్దచెర్లకు యీతకు వోయేటప్పుడు కొడ్త మన్నరు. కొత్తపంతు లొస్తెగూడ సదువొద్దన్నరు.

తల్లి : పార్వతమ్మా పోయే; నా తల్లిగదనే ! నిన్నడుక్కుంటనే, వీని పోరు పడలే కుండున్ననే.

పార్వతి : అవూ నేనుబోను పో, నేనేమో యింటుండి పనిజెయ్యాలంట, తనేమొ జిట్టిపోలీసోలే సదువు కుంటడంట. మన పటేలుబిడ్డ సద్వుకుంటలేదా ! నేనుగూడ బళ్లెకు పోతపో !

తల్లి : ఇంగ బాగానేవుంది, ఏశం. తోటోడు తొడ గోసుకుంటె తాను మెడ గోసు కున్నడంట. వున్న మారాజు లెట్ల జేసినా జెల్లుతది. వాళ్ళతీర్గ మనం జెయ్యాలంటె వొప్పుతారా యెట్ల.

రాంరెడ్డి: అవునే అమ్మ. నిజం, గనే సేల్లను గూడ సాళ్లెకు దోల్కపోతేనే, యిద్ద రం ముద్దుగ గలిసి సదువుకుంటమే.

తల్లి : వొక్కని సదువుతోటే ఏగలేగ సస్తుండ. పంతులయ కిచ్చే జీతం బాపతు అటుంచి, అష్టిమిపైన, పలుకలపూజ బియ్యం, ఇగ గూట్ల దీపం బెట్టంగనే యాడజెర దీపంజ్యోతి సదివి యింట్ల పడ్తరో లేదోగని, అమాస అమాసకు పావెడు నూనె యివన్నీ యాడదెత్తు.

పార్వతి : అన్నా, ఓయన్న, అంగడికి మామ పైసయిస్తే నీకే యిస్తనే, గిప్పుడు మట్కు నూనె లేకుండ పోవే, నీవు గిట్ట వూకె నూనె పైస అడ్గుతవని అమ్మ నన్ను సాళ్లెకు దోల్తలేదు.

తల్లి : మనం జెప్పితే వాడింటడా, బీటు జవా నొచ్చినట్టు వాడు పైస యియ్యమని గట్టిగ పట్టుపట్టిండు. ఆరే రాములూ మీ లొల్లితోటి నాకు యాడిపని అడ్నే వడ్డది. ఎసరొచ్చింది. ఎసట్లన్న ఏయలేదు. నీయిష్టం వుంటే యీ బియ్యం గొండవో, లేకుంటే లేదు.

రాంరెడ్డి : అట్లే కొండవోతలే అమ్మా.

పార్వతి : అమ్మా, ఓయమ్మా, సూడే అన్న నామాట యిన్నడు గదనే, నూనె పైస లేకుండనే పోతున్నడు, మరి నేను గూడ సాళ్లెకు పోతనే రేపు.

తల్లి : అట్లే వోదువు పో!

# మూడవ రంగము

(వీధి బడి, బుచ్చయ్య పిల్లలతో బియ్యము, పైస, నూనె వసూలుచేసి తన యిష్టప్రకారం శ్రీ చుక్కలు వ్రాసి పేరు పిలుస్తాడు)

పెబ్బ : రాములుగాడు, కొండరెడ్డి, రాజయ్య, యిస్తారి, గట్టోడు, నర్స, రంగడు, శ్రీరాంరెడ్డి, చెంద్రిగాడు, కృష్ణయ్య, మాద్గి కత్తోడు సుక్క.

రాం : నేనందరికంటే ముందుగాల్నేవస్తిగద. నేను సుక్కెందుకైత.

పెబ్బ : పిట్టకొంచెం కూతఘనమని నీవు శనా దీర్ఘలు దీసి మాట్లాడ్తవు. పావెడు నూనె దీస్కరాలేదుగని, జర పంతులు రామండు తెస్త నీ తమాస..... అరె కత్తోడ! నీవు దినాము వుస్కె మీద గూకుండెటోడవల్ల యీయాళ్ల సావదెచ్చుకొనీ మా బరాబరైద మను కున్నవా!

కొండ : అవునేమయా! దినం దినం ఈడి కండ్లు నెత్తికెక్కినట్టున్నవి.

కత్తోడు : అట్టగాదయా, వాన కాలంల సల్లగ బూమె దవునెక్కిందని మాయమ్మ గీసావసింపు కొండవొమ్మన్నది.

రంగడు: కొండరెడ్డీ, యీయాళ్ళ కోమటిరాజయ్య వృత్త సెతల వచ్చినట్టే గనపడ్తది, జెర కదలిచ్చినూడు.

కొండ : కోమటి రాజయ్యా! మరినీవు బీడీలకట్ట తేలేదు? పెద్దెరుసులెక్క యాది జేయ లేదని కుర్సి గూసోబెట్టమన్నవా, మాట్లాడవూ!

రాజయ్య : అదిగాదు కొండరెడ్డీ మామయ్య, మడ్గెత్తాళం ఏసి వూళ్ళెకుపోయిండె. యివ్వతల బీడీల కట్టలు లేకుంటె. అంటుకే తేలేదు. రేపు రొండు కట్టలు దెస్త.

యింకొకడు: బుచ్చయ్యా, కొండరెడ్డి, పంతు లయ్య వొస్తుండడు.

మరొకడు; ఈ పంతులు పోరగాని తీర్గనే వుండ దేందిరా!

పెబ్బ : అరే పంతులొస్తుండడు, మీరందరు కుక్కిన పేనల్లెగాకుంటె జర నాదిచ్చె సదువుకుండిరా!

1. కా కాకుంటేయిమిస్తే కా, కావడిస్తే కి,
2. యానం బొట్టూ, యానం రెండుబొట్లూ,
3. రెండెక్కం బొండూ, రెండు రెండ్లనాలూ
4. మంచమయా వుండలేక, మగనే బ్రతికే
5. తూమెడున్నార. తూమెడూ

(పంతులు ప్రవేశం)

(అందరు లేచి వందనం పంతులు)

పంతులు: కూర్చొండి.

పెబ్బ : పంతులూ, యీ బియ్యం కొల్చు కుంటరా? ఇందుల శనాకుంది పావు సేరుకు తక్కువనే దెచ్చిండ్రు.

పంతులు: ఎందుకు బియ్యం?

కొండ : నూనెగూడ దెచ్చినం పంతులూ.

రాములు: యీయాళ్ళ పలుకలవూజ పంతులూ!

పంతులు: నూనె, బియ్యంతో మీకు పనీ?

(పంతులు ఏమీతోచక చూస్తూఉంటాడు)

(నూనె బియ్యం తేనివారిలో వొకడు): పంతులూ మాయమ్మ యింట్ల బియ్యం నిండు కున్నవన్నది.

మరొొకడు: మాయయ్య పోయిన అంగట్ల నూనె దీస్కరాలేకుండె.

ఇంకొొకడు: మాయమ్మ పైసలు లేవన్నది.

(కట్టైన్న క్రింది నుంచి లేచి వణుకుతూ) పంతులు నా తాన మూడు పైసలు లేవు. మామయ్య వొక్క పైసనే యిచ్చిండు.

పంతులు: మీారెప్పుడీ వస్తువులన్నీ యీావిధంగా తెచ్చే అలవాటా?

పెబ్బ : అవు.

పంతులు: నేనెప్పుడూ మీాతో పైసగాని, బియ్యం కాని తీసుకోను, యిప్పుడు మీారు తెచ్చిన వస్తువులు మీారు తీసు కొండి. (అందరు సంతోషముతో ఎవరి వస్తువులు వారు తీసుకుంటారు)

వొకడు : పంతులూ పైసలు పెబ్బకుయిచ్చినం.

పంతులు: పెబ్బ ఏవరూ? దేనికి?

రాములు: కర్ణం రంగయ్య కొడుకు బుచ్చయ్య పంతులూ, మా అందరికన్న పెద్ద గుంటడని పెబ్బయిండు, మాయందరి పైసలు పెబ్బనె వసూలు జేసిండు.

పంతులు: బుచ్చయ్యా నీవాపైసలు యెవ్వరివి వాళ్ళకు యిచ్చెయి. యిక మీాద నా పేరు చెప్పి యే విధమైన డబ్బుగాని, వస్తువులుగాని తీసుకోవడానికి వీలు లేదు. బుచ్చయ్య మీాకు ఏమాత్రం పెద్దకాడు. కొన్ని రోజుల తరువాత, మీా జ్ఞానమును, చదువును చూచి నేనే పెద్దను యేర్పాటు చేస్తాను. (నిలు చున్న వారిని చూస్తూ) మీా రింకా కూర్చోరేమి? ఆ పిల్లవాడెందుకు దూరంగా మట్టిలో కూర్చున్నాడు.

ఒకడు : వాడు హరిజనుడు పంతులూ,

యింకొకడు: మేము, ముందుగాలొచ్చిన గుడ, మేము రాలేదని పైసదేనందుకు పెబ్బ మమ్ములను సుక్కజేసిండు.

పంతు : ఓహెూ చాల గందరగోళంగా వుందే పరిస్థితి, అబ్బాయీా యిటురా! భయ పడకు (కట్టోడు వణుకుతూ బుచ్చ య్యను కొండరెడ్డిని చూస్తూ వస్తాడు)

పంతు : అబ్బాయిలూ, యిటు చూడండి యీా పిల్లవాడుకూడ మీాతోపాటు చదువు కుంటున్నాడు. ఇంటివద్ద యెటు వంటి కులభేదాలు పాటించినప్పటికీ యిది పాఠశాల చదువుకునే స్థలం. అందరూ సమానులే.

పిల్లలూ : అట్లే పంతులూ.

పంతు : ప్రతిరోజు మీారందరూ 9 గం॥ వరకే రావలయును, ఆలస్యమైనచో శిక్షించే వాణ్ణి నేను, బుచ్చయ్య కాని మరి యితరులుగాని శ్రీ చుక్కలంటూ వ్రాయవలసిన పనిలేదు. ఇక మీారు కూర్చోండి. చదువులో బీదా గొప్ప భేదం లేదు. నేనందరికి సమానంగా చదువు చెబుతాను. తప్పుంటే సమా నంగా శిక్షిస్తాను. చదువులో శ్రద్ధ వుండి, అందరిలో తెలివిగల్లవాడే యీాకు పెద్ద.

పిల్లలు : రాంరెడ్డి సిన్నగున్నా బాగ సదువు తాడు పంతులూ.

వొకడు : ప ం తు లూ. బుచ్చయ్య పెబ్బ అని, బీడీలు దేనందుకు కచ్చతోటి సుక్క జేసిండె.

ఇంకొకడు: పంతులూ! నన్ను రాంరెడ్డి జత పట్టొద్దని పాటాలు బాగ సదువుతె బాయిల ముంచుతానని బెదిరిచ్చి పెబ్బ గోలీలాటకు తోల్కపోయిండు.

మరొకడు: పంతులూ! బుచ్చయ్య బిడుజాను కొని కొండరెడ్డిగూడ మమ్ములను బెదిరిస్తాడు.

పంతు : అ బ్బా యి లూ! మీరంద రీవిధంగా అల్లరి చేయవద్దు. ఒక్కొక్కరే మాట్లా డాలి. ఇదుగో బుచ్చయ్యా నీవుచేసే చెడ్డపనులకు అంతులేదు. యింకెప్పు డైన యిటువంటి విషయాలు నిన్ను గూర్చి విన్నానంటే ముందుగా నిన్ను గుంజిళ్ళు తీయిస్తాను. నిన్ను బళ్లోకే రానివ్వను. కొండరెడ్డీ. నీవుగూడ జాగ్రత్త, అసలు యి లా టి పోకిరీ వాళ్ళను బళ్లోకి రానివ్వను తెలిసిందా?

బుచ్చయ్య: యింగోసారి జెయ్యను పంతులూ, వస్తింపంతులే యిట్ల నన్ను జెయ్య మని జెప్పిండె. (బె ం ప లు వేను కుంటాడు)

పంతు : ఈ రోజుకు యికమీరు వెళ్ళండి. రేపు అందరు తొందరగారండి. యిక మీచదువు కొత్తవిధానంలో ఆరంభం చేతాం.

పిల్లలు : దండం పంతులు, దండం.

(పంతులు వెళ్లిన తరువాత)

వొకడు : రంగా,పంతులయ్యకు నామంబోడురా.

రంగ : మరి కాకుంటే, మనకంటె పెద్దోడని బుచ్చిగాడు, వాని జతగాళ్ళ కుక్కలు సీల్గినట్లు సీలుగుతుండ్రి, బాగయింది బిడ్డలకు.

రాం : అరే పంతులుకు స దు వం టే శా యి ష్టం. మరి రేపు మనందరం బాగా యాదిజేయాల పాటాలు.

కొండ : రాంరెడ్డీ! అప్పటికి మీ యింటికొస్త జెర సుమతి శతకం అర్దం జెప్పయా!

రంగ : ఇప్పుడు నీ జతకాణ్ణియిడ్సి మా దగ్గ రికి వస్తివి?

చెంద్రి : పాపం. కత్తోడు వృక్కల గూలపడి వస్తుండె. ఈ పంతులు జేయవట్టి వానిపూలు పుట్కలవడె.

రాజయ్య: వొక్క క ట్టో డి కే నా మంచిగైంది, మనకు గాలేదా! పంతులయ రాక ముందు అంగడంగడికి పైన, బెల్లం, బీడీలు యియ్యలేక మా అయ్య నా సదువే మోకువజేత మనుకుంటుండె.

రాం : అరే! రేపు మనందరం పొద్దుగాల రావాలె.

అంద : అట్లే. మనయింట్ల యీ స ం గ తి చెప్పితె కుసిపడ్తరు.

# నాల్గవ రంగము

(రాంరెడ్డి యిల్లు, తల్లీ, చెల్లెలు)

రాంరెడ్డి : అమ్మా ఓయమ్మా.........

తల్లి : వీడు బయటనుండే కూతలు వెస్తుం డడు. మళ్లేమి ఆముదాని దెచ్చెనో యింటికి.

పార్వతి : అన్నను పంతులయ్య కోదండం యేసిండో ఏందోనే.

తల్లి : ఏమో పాపం నీవు నూనెదేక పోతివి వాడెన్ని తన్నులు దినెనో ఏందోనే.

రాంరెడ్డి : (ఆతురతతో) అమ్మా, తన్నులు గాదే, మాకు కొత్త పంతులొచ్చిండు.

తల్లి : ఎవర్రా ఆయిన, ఆయిన కడుపు సల్ల గుండ.

రాంరెడ్డి : అమ్మో, యిప్పుడేగాదు. యింగె ప్పుడూ పైసగాని, బియ్యంగాని తీసు కోడంట. మళ్ళ మంచిగ సదువు జెప డంట. ఇప్పుడు యిగ బుచ్చయ్య పెబ్బగాడంట.

పార్వతి : అన్నా మళ్ళ యిప్పుడు పెబ్బ యెవ రైతరే?

రాంరెడ్డి : యెవరు మంచిగ సదువుతే వాళ్లే నంట.

పార్వతి : అన్నా, మరి నీవు ముద్దుగ సదువు కోవే. పెబ్బ అయితవు.

తల్లి : సూడురా! దానికి నీమీద యెంత ప్రాణవార్తికమో. నా బంగారు రాములు, ముద్దుగ సదువుకోనాయిన. దూముగిట్ట జేయకుండ.

రాంరెడ్డి : నేను సదువుకుంటగని, పంతులు పైసలు గిట్ట యేం దీస్కోడు, సెల్లను గూడ పంపమ్మ సాల్లెకు.

పార్వతి : అన్నా, యిగో మామ నాకప్పుడే పల్కా, బల్పాం దెచ్చిచ్చిండు.

రాంరెడ్డి : పార్వతీ. మళ్ళ నాతాన యెప్పుడు కయ్యం బెట్టుకోకుంటే బళ్లెకు దోల్క వోత.

పార్వతి : అవు, అయ్య నన్ను దోల్కపోవాలె పట్టి. నేను పోనాయేంది.

రాంరెడ్డి : నీవు సాల్లెకు వచ్చినంక, నేను పెబ్బనై మెత్తగొడ్త.

పార్వతి : అయ్య పెబ్బఅయి నన్నుగొడ్తడంట. నేనే ముద్దుగ సదువుకొని, నీకన్న ముంజాత నేనే పెబ్బ అయిత.

తల్లి : (నవ్వుతూ) ఇగ మీ కొట్లాట సాలు జేసి కాళ్ళ జేతులు గడుక్కోండి, మీకో పనకాయి పెడ్త.

పార్వతి : అన్నా! గారెలు.

రాంరెడ్డి : పా చెల్లి తిందం.

(తెర)



# వెఱ్ఱిగారాబం

లవణం

పాత్రలు :

తల్లి
తండ్రి
మధు
హెడ్‌మాస్టరు
మాస్టారు
రఘు
సరోజ

రంగాలంకరణ :

(ఇంటిలో ఒక హాలు, కుర్చీలు, బల్లలు, సోఫాలు ఇతర అలంకరణ సామాను వుంటాయి)

# మొదటి రంగము

[తెర లేచేసరికి తల్లి బట్టలు సర్దుతూ ఉంటుంది. ఇంతలో పదేళ్ల మధు ఏడుస్తూ భుజాన పుస్తకాల సంచీ తగిలించుకుని వస్తాడు. ఏడుపువిని తల్లి "ఎందుకు ఏడుస్తున్నావురా నాయనా" అంటూ మధును ఒడిలో తీసికొంటూ తల నిమురుతూ మధు భుజాన ఉన్న పుస్తకాల సంచి ప్రక్కన పెట్టి మధు కళ్లనీళ్ల తుడుస్తూ ఎర్రగా ఉబ్బిన బుగ్గమీద చెయ్యివేసి చూస్తుంది)

తల్లి : ఏరా బాబూ! బుగ్గలన్నీ ఇలా వాచి పోయాయి. ఎవరేం చేశారు? (మధు మాట్లాడడు) చెప్పు బాబూ చెప్పు. మీ నాన్నగారితో చెప్పి వాళ్ల పని పట్టిద్దాం. ఇలా బుగ్గలు నులిమేసిందెవరు నాయనా ?

మధు : మరేం, మరేం......

తల్లి : ఊ... ఏం జరిగింది? ఎవరితోనైనా పోట్లాడావా ?

మధు : లేదే అమ్మా మరేమో నే...... మా మాష్టారే.........

తల్లి : ఊ ...... మాష్టారేనా కొట్టింది? ఎందుకు (మధు కళ్ళు నలుము కుంటూ ఏడుస్తాడు)

తల్లి : ఊరుకోరా నాయనా, మా బాబువి కదూ...ఇంతకీ మాష్టారేనా కొట్టింది?

మధు : ఊ... ఊ... మాష్టారేనే. అమ్మా! నేనేమీ చేయకుండానే కొట్టారే.

తల్లి : ఏమీ చేయకుండానే కొట్టారా ?

మధు : నేనంటే మాష్టారికి యిష్టం లేదే. అందుకని వీపుమీద గుద్ది, బుగ్గలు నులిమేశారే.

తల్లి : ఆ... అంతపనే – ఎవడురా ఆ మాష్టారు? వాడికి పిల్లల్లేరూ? అయ్యో నాయనా! బుగ్గలు ఎలా వాచిపోయాయో! నాన్నగారిని రానీ చెబుదాము.

( సరోజ ప్రవేశం )

తల్లి : ఏమే! మధు ఇందాకనగా వస్తే నువ్వింతసేపు ఏంచేస్తున్నావే ?

సరోజ: మా క్లాసు ఇప్పుడే వదిలారే అమ్మా! ఇవాళ అన్న క్లాసులో ఎవరిదో పెన్సిల్ దొంగతనం చేశాడట. అందుకని మాష్టారు కొట్టారట.

మధు : నేను దొంగతనం చేశానని ఎవరు చెప్పారే నీకు? నువ్వేమైనా చూశావా ఆ గదిలోంచి ఈ గదిలోకి ? నాకది దొరికిందంటుంటేనూ...

సరోజ : రాము చెప్పాడు. నువ్వు ప్రకాశం పెన్సిల్ తీసికొని అతను తన పెన్సిల్ ఇమ్మంటే చెంపలు వాయించావుటగా.

మధు : చెంప వాయించానా ? అన్నీ అబద్ధాలే అమ్మా! నాకే ఆ పెన్సిల్ దొరికింది. ప్రకాశం తనదన్నాడు- నాకు దొరికింది నేనివ్వను పొమ్మన్నాను. దాని మీద మాష్టారితో చెప్పాడే. అసలే ఆ మాష్టారికి నేనంటే కోపమే. అందుకని నేను దొంగతనం చేశానని వీపు మీద. గుద్ది బుగ్గలు నులిమేశారే.

సరోజ : ఐతే నీవు ప్రకాశాన్ని కొట్టలేదూ ?

మధు : నువ్వు మహా చూసినట్లు మాట్లాడతావేం ? కొట్టలేదని చెప్పటం లేదూ?

తల్లి : అబ్బబ్బ!... ఊరుకోండర్రా బాబూ! మీ తగాదా నాకేం అర్థం కావడం లేదు. మీ అన్నాచెళ్ళెల్ల మధ్య వచ్చి గడ్డి వేస్తే భగ్గుమంటుంది. అదేమో గానీ, మా నాయన్ను చూస్తే అందరికీ కళ్ళల్లో నిప్పులే. సరోజా ! నువ్వు పోయి కాళ్ళు మొహం కడుక్కో.

( సరోజ వెళ్ళిపోతుంది )

తల్లి : మధు మా బాబువికదూ. ఆ స్కూలు నీ కెందుకు గానీ, నువ్వు చక్కగా యింట్లోనే చదువుకుందువు గానిలే.

( మధు ఏడుస్తూ ఉంటాడు. తండ్రి ప్రవేశం )

తండ్రి : ఎందుకే ఏడుస్తున్నాడు వీడు ?

తల్లి : నే చెప్తే విన్నారూ...... ఆ స్కూలు వద్దూ, ఆ చదువు వద్దూ... వొద్దో అంటే వీణ్ణి తీసుకుపోయి అందులో వేశారాయె. ఇవ్వాళ వీళ్ళ మాష్టారు వీణ్ణి పట్టుకొని బావబాదాడుట.

తండ్రి : వీడేమీ చేయకుండానే మాష్టారు కొట్టూరా ? ఏంరా మధూ నువ్వేం చేశావు ?

(మధు "నేనేం చెయ్యలేదు" అంటూ ఏడుస్తాడు)

తల్లి : మీరు మళ్ళీ వాణ్ణి పట్టుకుని గదమాయించకండి. పాపం వాడేం చేస్తాడు కుఱ్ఱకుంక.

తండ్రి : సరే, వాడేమీ చేయలేదే అనుకో. ఇంతకీ నన్నేం చేయమంటావో చెప్పు.

తల్లి : వీణ్ని తీసుకెళ్ళి ఆ మాష్టారెవరో తెలుసుకొని, కూకలేసి, కొట్టటానికి వీల్లేదని గట్టిగా చెప్పిరండి.

తండ్రి : సరే. ఒరే మధూ! పదరా. చదువు చెప్పటం చేతగాని మాష్టర్లందరూ గొడ్డును బాదినట్టు పిల్లల్ని బాదటం నేర్చుకున్నారు.

( తెర )

# రెండవ రంగము

హెడ్మాష్టరు ఆఫీసుగది. హెడ్మాష్టరు సూర్యారావుగారు తమ పనిచూచుకుంటూ వుంటారు. మధు ఏడుస్తూ ఉంటాడు. మధుతండ్రి మధును తీసికొని దూకుడుగా ఆ గదిలో ప్రవేశిస్తాడు,

తండ్రి : ఏమండీ! పిల్లల్ని మీవద్దకు పంపటం చదువు చెప్పమనా, తన్నులుతన్నమనా? అందరూ అలాగే చదువు చెప్తున్నారా?

హె.మా.: (ఆశ్చర్యంతో) ఏం జరిగింది? రండి, ఇలా కూర్చోండి. అసలు విషయం ఏమిటో నెమ్మదిగా చెప్పండి.

తండ్రి : నెమ్మదీ మర్యాదా నాకేం అక్కర్లేదు గాని ముందుగా నామాటకి సమాధానం చెప్పండి?

హె.మా.: దయచేసి కూర్చోండి. సావకాశంగా మాట్లాడుకుందాం. అసలు మీ పేరేమిటి?

తండ్రి : నా పేరేమైతేనేం గాని, అసలు మీకు పిల్లల్ని కొట్టే అధికారం ఎవరిచ్చారంట?

హె.మా.: ఏమండీ మీరు పెద్దమనుష్యులు లాగున్నారు. అసలువిషయం ఏమిటో చెప్పకుండా అలా మాట్లాడేస్తే మాకెలా అర్ధమవుతుంది?

తండ్రి : పిల్లవాణ్ణి యిలా చితక తన్నారే? ఏమిటి మీ ఉద్దేశ్యం. ఎవరా పంతులు?

హె.మా.:ఇంతకీ ఎవరు కొట్టారంటారు?

తండ్రి : ఎవరు కొట్టారా,? ఎవరు కొడ్తారు. వీడి పంతులే. అసలు మాఅబ్బాయిని ఎందుకు కొట్టా రంట?

హె.మా.: మీరు కొంచెం శాంతించండి. వారు ఊరకనే కొట్టరు. కనుక్కుందాం.

తండ్రి : అయితే మా వాడు ఊరకనే ఏడుస్తున్నాడనా? ఇదిగో వాడి బుగ్గలు చూడండి. ఎలా వాచి పోయాయో. ఒళ్లంతా చితక పొడిచారు. అసలు పంతు లెవరో చూపించండి. అతని అంతు కనుక్కుంటాను.

హె.మా.: (చూపుతూ) అదుగో అయనే మధు క్లాసు టీచరు. కనుక్కుందాం ఉండండి,

తండ్రి : (మాష్టారితో) ఏమయ్య పంతులూ, మావాణ్ణి మీవద్దకు పంపేది చదువు చెప్పమనా, చావగొట్టమనా?

మాష్టారు: చదువు చెప్పమనే అనుకోండి. కాని పిల్లవాడు తనకర్తవ్యాన్ని మరచిపోయి చెడుదారులుత్రొక్కితే కొంచెం మందలించాలి గదండీ. మరి అది మా విధి.

తండ్రి : విధిట, విధి. ఏం విధయ్యా? మాటలు మాత్రం మహాబాగా నేర్చావు. ఇంతకూ మా పిల్లవాడ్ని కొట్టమని మీకు అధికారం ఎవరు ఇచ్చారు.

మాష్టారు: పిల్లలు మితిమీరి అల్లరి చేస్తే తల్లీదండ్రులైనా దండించక ఊరుకుంటారా చెప్పండి.

తండ్రి : ఇహ చాల్లెండయ్యా ఊరుకోండి. ఇవాల్టినుంచి మావాడు మీస్కూలుకు రానేరాడు. మీమీద కేసు పెడితే గాని మీకు బుద్ధిరాదు. (అంటూ మధుతో వెళ్ళిపోతూ'పదరా'!అంటాడు)

హె. మా.: చూశారా సూర్యారావుగారు ! పిల్లల విషయంలో తల్లిదండ్రుల గారాము ఇలా ఉంటుంది. అయినా అసలు మీరా అబ్బాయిమీద అంత గట్టిగా చెయ్యి చేసుకోవటం దేనికి ?

మాష్టారు: అబ్బే నేనేమీ చెయ్యలేదండీ. బెత్తంతోనే నెమ్మదిగా ఒక చిన్న దెబ్బ

వేశాను. ఈ గొడవేమిటో నాకు అయోమయంగా ఉంది.

హె.మా. : అవునుకోండి. మనం కొద్దిగా శిక్షిస్తే ద్వేషం కొద్దీ పిల్లల్ని కొడుతున్నా మనుకుంటారు. ఒకవిధంగా తల్లిదండ్రులే పిల్లల అభివృద్ధికి అడ్డు తగులుతారు.

మాష్టారు: ఆ మధు ఈ మధ్య బొత్తిగా చెడి పోయాడు. ఒకటే అల్లరి. ఏమీ పదవడు. ఇతరులను వెడగొడుతున్నాడు. నేను చాలాసార్లు మంద లించాను కూడాను.

హె.మా.: అవునండీ. మీరు చెప్పేది నిజమే. నేను అతని విషయం గమనిస్తూనే ఉన్నాను. మనం మంచికిచేసే పనికి తల్లిదండ్రులు అపార్థం చేసుకుంటే పూరుకోవటమే మంచిది. నేను టి.సి. ఇచ్చివేసి పంపిస్తాను. జరిగిం దేదో జరిగిపోయింది. కానివ్వండి.

# మూడవ రంగము

(తెర లేచేసరికి రఘు, మధు వీట్లపేక ఆడుతుంటారు)

రఘు : ఒరేయ్ గోపీ నిన్న మీ నాన్న మన స్కూలుకు వెళ్ళి హెడ్‌మాష్టరుగారిని, మన క్లాసు టీచరు గారిని ఏదో అన్నారట.

మధు : అనటం ఏమిటిరా? హడలెత్తిస్తేనూ! నా ముందటే వాళ్ళిద్దర్నీ, చెడామడా తిట్టేశారనుకో.

రఘు : మరి హెడ్మాష్టరు, మన మాష్టరూ ఏమీ అనలేదూ?

మధు : అనేదేమిటిరా? మనం ఎత్తు వేశామంటే ఎలా పారుతుందనుకొన్నావ్! రూలు ప్రకారం మేష్టర్లు మనల్ని కొట్ట కూడదుట. నాన్నగారు వాళ్ళమీద కేసుపెడ్తానని దబాయించే సరికి వాళ్ళిద్దరూ భయపడి పోయారనుకో. ఇక మన యిష్టం. చదువే అక్కర్లేదు.

రఘు : ఏమో బాబూ, నాకేం అర్థం కాదు. అయితే యింతకీ నిన్న నిన్ను మాష్టారు కొట్టారా?

మధు : అబ్బే నన్ను మాష్టారు కొట్టడమే! నువ్వు ఒక వెర్రి వెంగళప్పవేరా?

రఘు : మరి నిన్ను కొట్టారని మాష్టారి మీద మీనాన్నగారు కేసు పెట్టారన్నావు.

మధు : అవునా్ర బ్రదర్. నీ కసలు సంగతులే తెలియవు. విను, క్లాసులో మాష్టారు బెత్తంతో చిన్న దెబ్బ వేశారు. దాని మీద నేను అమ్మోయ్, బాబోయ్ చచ్చిపోతున్నానండోయ్ అంటూ ఏడ్చి గంతులేస్తే మాష్టారు హడలి పోయి వదలేశారు.

రఘు : మరి నీ బుగ్గలమాట?

మధు : ఓస్, అదా, అ దే ము ం దీ! నిన్న ఆ సుబ్బయ్య తోటలేదు-అందులో నేను రోజూ మామిడికాయలు కోసుకుంటూ వుంటాను. నిన్న మాత్రం వాడె క్కడో పొంచి వుండి నన్నుచూశాడు. ఆవళంగా నన్ను పట్టుకొని రోజూ తప్పించుకొంటున్నానని కసికొద్దీ వీపు మీద గుద్ది, బుగ్గలను నులిమి వది లేశాడు.

రఘు : (ఆశ్చర్యంతో)-ఓ అదా సంగతి?

మధు : మరే మనుకున్నావ్?

రఘు : మరి మీ నాన్నగారు మాస్టారి మీద కేసు పెడ్తారన్నావు నిజమేనా?

మధు : ఇవాళ కనుక్కున్నారట. మా అమ్మ గట్టిగానే పట్టుపట్టింది. కానీ కేసు పెడితే గెలవదట. అందుకని వూరు కున్నారు. ఇంక మనం అడింది ఆట పాడిందిపాట? అంతేనంటావా?

రఘు : అంతేరా!

మధు : మరైతే ఇవాళ మేట్నీ ఉంది. పోదాం పద.

రఘు : డబ్బులో?

మధు : డబ్బులకేంరా? ఎప్పుడూ డబ్బులో డబ్బులో అంటావు?

రఘు : డబ్బుల్లేకపోతే సి ని మా కు ఊరకే రానిస్తారా ఏమిటి?

మధు : ఉన్నాయిలే.

రఘు : ఎక్కడివిరా? ఎలా వచ్చాయేమిటి?

మధు : పుట్టించాం? ఎవరితో చెప్పకేం? మా నాన్నచొక్కా జేబులోంచి అర్ధరూపాయి, అమ్మ బొట్టుపెట్టెలోంచి పా వ లా కొట్టేశా.

రఘు : మరి మీ అమ్మకూ నా న్న కు తెలి స్తేనో?

మధు : ఏడిశావ్ నీకన్నీ అనుమానాలే? ఎలా తెలుస్తుంది? ఒకవేళ తెలిసి అడిగినా తియ్యలేదంటూ ఏడుస్తాను.

రఘు : ఓరి బాబో! నిన్నుచూస్తే నాకు భయం వేస్తోందిరా?

మధు : భయం గియం అన్నావంటె జాగ్రత్త. నాతో వస్తావా? రావా? (అంటూ రఘు చేయిపట్టుకొని లాక్కుపోతాడు)

# నాల్గవ రంగము

(హెడ్మాష్టరు గది. హెడ్మాష్టరు కూర్చిలో కూర్చుని రిజిష్టరు తిరగవేస్తుంటాడు. తండ్రి మధుతో ప్రవేశిస్తాడు )

తండ్రి : నమస్కారం హెడ్మాష్టరుగారూ!

హె.మా: న మ స్కా ర ం. మీరా? రండి, కూర్చోండి.

తండ్రి : ఫర్వాలేదు లెండి. మీతో కొద్దిగా మాట్లాడుదామని వచ్చాను. నన్ను క్షమించండి.

హె.మా: ఫర్వాలేదు. ఇదుగో మీవాడి టి.సి. మరెక్కడికైనా తీసుకువెళ్లి చదువు చెప్పించుకోండి.

తండ్రి : నన్ను క్షమించండి. ఆరోజు మా అబ్బాయిపై వెర్రి గారాముతో వాడు చెప్పినదల్లా నమ్మి మిమ్మల్ని చాలా నిందించాను. ఈ వారం రోజుల్లోను నిజం తెలుసుకున్నాను. మా వాడు బొత్తిగా చెడిపోయాడు. దొంగతనం, పేకాట, సినిమాలు అన్నీ అలవాటయి నయి. బొత్తిగా చదువు మానేశాడు. మీరే వాడిని దారిలో పెట్టాలి.

హె.మా: మరి మీరు ఆ రోజున మాపై కేసు పెడతామన్నారుగా?

తండ్రి : లేదండీ, అది నా బుద్ధి పొరపాటు, క్షమించండి.

హె.మా: అలా కాదండీ, మీ పిల్లడి చెడు నడతకు 'ఫైన్' వేస్తున్నాను. ఆ ఫైన్ చెల్లించాకనే మీవాణ్ణి స్కూల్లో చేర్చుకుంటాను.

తండ్రి : మాష్టరుగారు! నేను పేదవాడిని. మిమ్మల్ని బ్రతిమాలుతున్నాను. ఈ ఫైను కట్టలేను, మా వాణ్ణి కొట్టండి. తిట్టండి, ఏమైనా చెయ్యండి, మీకు అప్పచెపుతున్నాను. వాణ్ణి స్కూల్లో చేర్చుకొని దారిలోపెట్టే బాధ్యతమీది. గతం మరిచిపొండి.

హె.మా: ఫైను చెల్లించక పోతే వీల్లేదండీ?

తండ్రి : మాష్టరుగారూ మీరేం చెయ్యమంటే అదిచేస్తాను. ఫైను తీసేయండి. మీరు దయతలచకపోతే మధు ఇంకా చెడిపోతాడు.

హె.మా: అయితే ఒకటి చేస్తారూ?

తండ్రి : మీరేమి చేయమన్నా చేస్తానండీ.

హె.మా: మీరు క్రిందటిసారి వచ్చినప్పుడు ప్రవర్తించిన విధము తప్పు. అందుకు పశ్చాత్తాప పడుతున్నాననీ, మధు బాధ్యత మాకు అప్పజెవుతూ వున్నానని వివరిస్తూ వ్రాసి ఇవ్వండి.

(తండ్రి కాగితం మీద వ్రాసి ఇస్తాడు, అంత వరకు హెడ్మాష్టరు బిక్కచచ్చిన మధునుచూస్తూ వుంటాడు. హెడ్మాష్టరు తండ్రి ఇచ్చిన కాగితం అందుకుంటాడు)

హె.మా: మధూ, ఇలారా! చూశావా? ఇది మీ నాన్నగారు వ్రాసి ఇచ్చిన కాగితం, ఇందులో ఏమి వ్రాశారో విన్నావు కదూ?

తండ్రి : బాగా కొట్టండి, బుద్ధివచ్చే వరకూ కొట్టండి.

హె.మా.: కొట్టడం వరకూ ఎందుకండీ! అనవసరంగా ఎప్పుడూ ఏ విద్యార్థినీ కొట్టము. నయానా, భయానా చెబుతాము. అప్పటికీ విద్యార్థి దారిలోకి రాకపోతే– కొడతామని బెదిరిస్తాం. ఇక లాభంలేదు అని అనిపించినప్పుడే పిల్లల్ని కొడతాం- అదిన్నీ స్వల్పంగానేనండీ!

తండ్రి : ఏమో నాకా వివరం తెలియదు. అబ్బాయి భవిష్యత్తును మీ చేతిలో పెట్టాను. ఏం చేసినా మీ యిష్టం. ఏరా మధూ... ఇకనుంచి మాష్టారు

చెప్పినట్లు వింటూ బుద్ధిగా చదువు కొంటావా ?

మధు : ఊఁ... (అంటూ అంగీకార సూచకంగా తల తిప్పుతాడు)

హె.మా.: మంచిది బాబూ...మంచిది. ఇకనుంచి మధు బుద్ధిగా వుంటూ, చదువుకుంటాడు లెండి. ఊఁ అన్నాడుగా–ఇక ఇబ్బందిలేదు.... మీరు వెళ్ళండి. మధూ! నీ తరగతిలోకి వెళ్ళి కూర్చో. మీ క్లాసు మాష్టారిని ఓసారి రమ్మని చెప్పు.

(మధు వెడతాడు : మాష్టారు వస్తారు)

తండ్రి : నమస్కారం మాష్టారు... ఇలా కూర్చోండి... (అంటూ లేచి తను కూర్చున్న కుర్చీ చూపిస్తాడు)

హె.మా.: మాష్టారూ! వీరు మధు తండ్రిగారు, తెలుసుకదూ!

మాష్టారు: తెలుసునండి! వీరినెలా మరిచిపోతామూ?

హె.మా.: అదె... వారికి మధు ప్రవర్తన విషయమంతా తెలిసిందట. ఇకనుంచి వాడికి చదువుచెప్పే బాధ్యత మనదిట! తామెప్పుడూ కలుగజేసుకో మంటూ– కాగితం వ్రాసి యిచ్చారు.

మాష్టారు: మంచిదే - ఇలా తల్లిదండ్రులకు వివేకం వస్తే అందరికీ మంచిదే...

హె.మా.: అదే వారితో చెప్పాను. అంతా మంచికే జరిగింది. అదే ఆనందంగా వుంది. ఇక మీరు వెళ్ళండి–

తండ్రి : సెలవు... నమస్కారం.

( తెర )






**పాత్రలు :**

చంటి
రఘు
భాగ్యం
బాలు
జానకమ్మ
చిన్నారి
రవి
భాస్కర్
సుమతి
ఆంజనేయ శాస్త్రి
గీత
శ్రీనివాసరావు
పాలవాడు
అప్పలవాడు
లక్ష్మి

**రంగ పరికరాలు :**

గది, బల్లలు, టీపాయ్, బొమ్మలు- గదిలో వుండే ఇతర సామాను.

# మొదటి రంగము

( పిల్లలు - అటునించి, ఇటునించి వస్తుంటారు )

చంటి : ఒరేయ్! రండిరా... ఇవాళ ఇంత ఆలస్యం చేశారేం......?

రఘు : ఏం చేయ మంటావురా ! మా నాన్న గారు బయటకు వెడితే కాళ్ళు విర గ్గొడతా నన్నారు. అందుకని ఆయన గురక పెట్టి నిద్ర పోయాక ఇలా వచ్చాను.

భాగ్యం : మా అమ్మ ఇవాళ వేడి వేడి పకోడీలు చేసింది.

చంటి : అవన్నీ పీకలదాకా మెక్కి ఇప్పు డొచ్చావ్... అవునా?

లక్ష్మి : మా అమ్మ నా గొడవ భరించలేక కాబోలు ఎక్కడకైనా వెళ్ళి ఆడుకో... అంటూ ఇంట్లోంచి తరిమేసింది... అందుకే ఇలా వచ్చాను.

బాలు : ఒరే, ఇవాళ మానాన్నగారు గదిలో పెట్టి తాళం వేశాడు రా!

చంటి : ఏగది... కిటికీ చువ్వలు రెండు విరిగి పోయాయి, ఆ గదేనా... నువ్వు జానపద సినిమాలో కథానాయకుడు లాగా ఆ గది కిటికీ లోంచి వీధిలోకి ఒక కుప్పిగంతు వేసి బైటపడ్డావు. అవునా!

బాలు : అవునురా! ఆదూకటంలో నామోకాలు చిప్ప కొంచెం విరిగినట్లు అనుమానంగా ఉందిరా!

చంటి : అనుమానంగా ఉందా! అయితే వెంటనే ఆంజనేయుని తలుచుకో. ఆ నెప్పి అరనిముషంలో అరవై మైళ్ళ దూరం పారి పోతుంది.

బాలు : అలాగేరా! (కళ్ళుమూసుకొని) ఆంజ నేయ పాహిమాం, శ్రీ ఆంజనేయ పాహిమామ్...

చంటి : (టీ పాయి మీద ఎక్కి) ఆంజనేయ పాహిమాం, శ్రీ ఆంజనేయ పాహి మామ్ (పిల్లలు టీపాయ్ చుట్టూ తిరుగుతూ భజన ప్రారంభిస్తారు.)

బాలు : చచ్చాను రోయ్! దెబ్బమీద ఇంకొక దెబ్బ తగిలింది.

చంటి : మరేం ఫరవాలేదు., ఇంకా గట్టిగా భజనచేయి (అందరూ గట్టిగా అరుస్తూ బజన చేసారు.)

చిన్నారి : ఒరే ! చంటీ ఏమిట్రా ఆ గొడవ, చెవులు చిల్లులు పడి పోతున్నాయ్! మీ అల్లరి రోజు రోజుకి ఎక్కువై పోతోంది.

చంటి : చిన్నారీ, నువ్వు ఇంట్లోనే ఉన్నావా? నువ్వుకూడా రావే ఈ భజన ఎంత బాగుందో. (మళ్లీ పిల్లలు భజన ప్రారం భిస్తారు. చిన్నారికూడా వాళ్లతో కలు స్తుంది.)

జానకమ్మ : అబ్బబ్బ! ఇందాకటినించి చూస్తు న్నాను. ఏమిట్రా ఆ గొడవ.

చంటి : అమ్మబాబోయ్! అమ్మ వచ్చేసింది.

జానకమ్మ: ఏమే విన్నారే, వాడేవో విన్నాడు తెలీక అల్లరి చేస్తే బుద్ధి చెప్పాల్సింది పోయి నువ్వు వాడితో కలసి గంతు లేస్తావా? అసలు నీబుద్ధి ఏమైందంట?

చంటి : గడ్డి తింది.

జానకమ్మ: ఒరే నువ్వు నోరు మూసుకొని లోపలకు వెళ్లు, రోజు రోజుకి నీగొడవ ఎక్కువవుతోంది, ఉంటు గరిటె కాలేసి వాతలు పెడతాను.

చంటి : అమ్మా! ఎందుకే ఎప్పుడూ అలా గొంతు చించుకొని గయ్యాళిలా అరుస్తావ్? అప్పా, అందరూ నీతో ఎలా వేగుతున్నారో ఏమో!

జానకమ్మ: ఏమిట్రా నేను నీకూ గయ్యాళిలా కనిపిస్తున్నానా! ఉండు నీపని చెప్తా,

చంటి : ఏమర్రోయ్, ఇక్కడనుండి త్వరగా పారి పోండి, మా అమ్మకి కోపం వచ్చింది, కోపం వచ్చిందంటే ఆమెకు ఒళ్లు తెలియదు. (పిల్లలు పారిపోతారు)

జానకమ్మ: వీడికి గౌరవం లేకుండా పోతోంది. వీడితో చస్తున్నాను, వీణ్ణి ఏదో కాన్వెంటులో పారేస్తేగాని బుద్ధిరాదు.

చంటి : హేయ్ నన్ను ముట్టుకో వోయ్, నా మాలకాకి . . నన్ను ముట్టుకోవోయ్ నా మాలకాకి.

రవి : అమ్మా, నేను అర్జంటుగా సినిమాకి వెళ్లాలి, నా స్నేహితులకు పార్టీ యివ్వాలి, ఇరవై రూపాయలు కావాలి.

జానకమ్మ: ఇరవై రూపాయలా! నాదగ్గిరలేవు.

రవి : నువ్విలా అంటావని ముందే వూహించి నా జాగ్రత్త నేను పడ్డాను, నాన్నగారి చొక్కా జేబులో ఓ ఇరవై రూపాయలు దొరికాయి. వీటితో ప్రస్తుతానికి నాపని గడిచి పోతుంది, నాన్నగారు వచ్చాక వెతుక్కుంటారేమో! చెప్పు, నే వెడుతున్నానూ.

చంటి : అమ్మా, నాకు అర్జంటుగా ఐదు రూపాయలు కావాలి.

జానకమ్మ: ఐదు రూపాయిలా! ఎందుకురా!

చంటి . ఎందుకేమిటి, నేను కూడా మా స్నేహితులకు పార్టీ యివ్వాలి.

జానకమ్మ: స్నేహితులకు పార్టీయా? ఎందుకూ?

చంటి : ఎందు కేమిటి? నిన్న మంగలితో క్రాపు చేయించుకున్నానుగా, అందుకని, పార్టీ యిమ్మని స్నేహితులు తెగ గొడవ చేస్తున్నారు.

జానకమ్మ: క్రాఫ్ చేసుకొంటే పార్టీ ఎందుకురా?

చంటి : లేకపోతే గుండు చేసుకుంటే యివ్వాలా?

జానకమ్మ: ఏడిశావులే, నీ మోహానికి తోడు పార్టీలు కూడాను?

చంటి : ఏయ్ నా మోఖానికేం? ఇంతకూ డబ్బిస్తావా యివ్వవా?

జానకమ్మ: నాదగ్గిర లేవు,

చంటి : నువ్విలా అంటావని ముందే ఊహించి నాజాగ్రత్త నేను పడ్డాను, నువ్వు పోపు సామాను పెట్టెలో జీలకర్ర అడుగున దాచిన ఐదు రూపాయలు పట్టుకు

పోతున్నాను. నీమేలు, పోవు సామాను పెట్టెలో మళ్లీ ఓ ఐదు రూపాయలు దొరికే వరకూ మళ్ళీపోను.

జానకమ్మ: ఒసే చిన్నారి, వాణ్ణి పట్టుకోవే.

చిన్నారి : ఏం అమ్మా, ఏం చేశాడు?

బంటి : ఏ చిన్నా, నన్నొదలవే, వచ్చి నీ కడుపున పుడతానే...

జానకమ్మ: వాడి చేతులోంచి ఐదు రూపాయలు లాక్కో,

చిన్నారి : ఆ! ఐదు రూపాయలా, ఎక్కడివిరా? ఇలా తే,

బంటి : అన్యాయం, అక్రమం, చిన్న వానిని నామీద దౌర్జన్యం చేస్తావా! ఒసే చిన్నారీ, ఆ డబ్బులివ్వవే, ఐదు రూపాయలలో ఒక రూపాయ్ నీకిస్తానే,

చిన్నారి : అమ్మా! నేను బొమ్మలేసుకొనే రంగులు డ్రాయింగు కాయితాలు పూర్తిగా అయిపోయాయి. ఈ అయిదు రూపాయలు పెట్టి అవి కొనుక్కుంటాను.

జానకమ్మ: ఒసే చిన్నారీ! ఒరే భాస్కర్! సమయానికి వచ్చావు, ఆ చిన్నారినిలా లాక్కుని రా!

భాస్కర్: ఏమమ్మా! ఏమి చేసింది.

జానకమ్మ: ముందు దాని చేతులో ఐదు రూపాయలు లాక్కో.

భాస్కర్: ఆ ! ఐదు రూపాయలా, ఎక్కడివే? ఇలా తే.

చిన్నారి : అన్యాయం, అక్రమం, చిన్న పిల్లలని నామీద దౌర్జన్యం చేస్తావా!

బంటి : బలే, బలే అయిందమ్మా! అమ్మాయి గారి పెళ్లి, అయిందమ్మాయి గారి పెళ్లి.

భాస్కర్: అమ్మా, బజారులో ఒక అందమైన నాట్యంచేసే బొమ్మను చూశాను. దాని ఖరీదు ఐదురూపాయలుట, ఆ బొమ్మ ఎంత బాగుందో తెలుసా, ఇదుగో ఇప్పుడే వెళ్ళి కొనుక్కొస్తానుగా, ఆ బొమ్మను చూసేవంటే నిజంగా నువ్వే ఆశ్చర్యపోతావు. వస్తా.

జానకమ్మ: ఒరే భాస్కర్, ఒసే గీతా, సమయానికి వచ్చావ్, వాణ్ణి పట్టుకోవే.

గీత : ఏమమ్మా, ఏంచేసాడు, చిన్నా మళ్ళీ కొట్టాడా ?

జానకమ్మ: ముందు వాడి చేతులోవి ఐదు రూపాయలు లాక్కో.

గీత : ఐదు రూపాయలా! అంత డబ్బు నీ కెక్కడిదిరా? ఏదీ ఆ డబ్బు, ఇలా ఇచ్చెయ్ (లాక్కుంటుంది).

భాస్కర్: అన్యాయం, అక్రమం, చిన్న వానిని నామీద దౌర్జన్యం చేస్తావా ?

చిన్నారి : అయిందబ్బాయిగారి పెళ్ళి, బలే బలే, అయింది అబ్బాయిగారి పెళ్ళి.

గీత : అమ్మా, షాపులో మంచి గొలుసు చూశానే! ఎంత బాగుందో తెలుసా! మిల మిలా మెరిసిపోతోంది, దాని ఖరీదు ఐదు రూపాయలుట, ఆ గొలుసు ఎవ్వరికీ అమ్మవద్దని చెప్పి వచ్చాను, నిన్నడిగి డబ్బు తీసుకుందామని వచ్చాను, నే నడిగే పని లేకుం

తానే ఐదు రూపాయలు దొరికాయి. ఇప్పుడే వెళ్లి గొలుసు కొనుక్కుం టాగా (వెళ్లిపోతూ) మాఅమ్మ మంచిది.

జానకమ్మ: వసే, సుమతీ సమయానికి వచ్చావ్ దాన్ని పట్టుకో.

సుమతి : ఎక్కడికే అలా తా రా జు వ్వ లా దూసుకు పోతున్నావు?

గీత : అక్కయ్యా! అంగడిలో ఓ అందమైన గొలుసుంది, దాన్ని కొందామని వెడు తున్నాను.

పంటి : కానీ దిష్టి బొ మ్మ లా నువ్వెందు కొవ్వావ్.

గీత : ఛ! నోర్ముయ్! అక్కయ్యా! ఆగొలును కొన్నాక నీకు ఇస్తాలే, ఆ గొలును వేసుకుంటే ఇంతకన్నా రెట్టింపు అం దంగా కనిపిస్తావు. నిజం...ఒట్టు·

జానకమ్మ: ముందు దాని చేతిలోంచి ఐదురూపా యలు లాక్కో.

సుమతి : ఏమో! నీ అందానికి గొలుసొక్కటే త క్కు వై ం ది. మొహం చూడు మొహం! ఇలాతే.

గీత : అన్యాయం, అక్రమం, చిన్నదాన్నని నామీద దౌర్జన్యం చేస్తావా ?

భాస్కర్: భలే, భలే అయిందమ్మాయి గారి పెళ్ళి...అయిందమ్మాయిగారి పెళ్లి.

సుమతి : బలే!...వెతకబోయిన తీగ కాలికి తగ లటం అంటే ఇదే కాబోలు, మా స్నేహితురాలు తొందరగా అయిదు రూపాయలు అప్పు కావాలని అడి గింది, బస్! అయిదు రూపాయలే కదా అని నిన్నడిగి ఇచ్చేద్దామని ఇలా వచ్చాను. అమ్మా నీకు అభ్యంతరం లేకపోతే ఈ ఐదు రూపాయలు మా స్నేహితురాలి కిచ్చి వస్తాను. అయినా నువ్వు నామాటకు ఎదురు చెప్పవని తెలుసు (యునో, యు ఆర్ రియల్లీ ఎ వెరిగుడ్ మదర్) ఓ నీకు ఇంగ్లీషు రాదు, అంతే కదూ!

పంటి : అంటే నువు చాలా చెడ్డ అమ్మవని అర్థం.

సుమతి : నువ్వు నోరు ముయ్యరా చవటా!

జానకమ్మ: ఏమిటి, నాకు ఇంగ్లీషు రాదని నోటి కొచ్చినట్లు మాట్లాడతావా!

సుమతి : సారీ మమ్మీ, దిస్ బ్రూట్ ఈజ్ లయ్యింగ్. డోంట్ బిలీవ్ హిమ్!

పంటి : అదుగో మళ్లీ తిడుతోంది.

సుమతి : అయినా మీతో నాకెందుకు. నా కోసం నా స్నేహితులందరూ ఎదురు చూస్తూంటారు. నే వెళతాను.

జానకమ్మ: ఒరే, ఒరే గుడ్లప్పగించి అలా చూస్తా రేమిటిరా! వెళ్లి దాన్ని పట్టుకోండి...

సుమతి : వదలండిరా, ఒరేగాడిదా ఎందుకురా అలా రక్కుతావు.

పంటి : ఏమిటీ, నేను గాడిదనా, నేను గాడిద నైతే నీవు నాకంటే పెద్ద గాడిదవి, అమ్మా ఇదుగోనే డబ్బు.

సుమతి : అన్యాయం, అక్రమం, మీ రంతా ఒక్కటై నామీద దౌర్జన్యం చేస్తారా

జానకమ్మ: అన్యాయం లేదు, అక్రమం లేదు. అందరూ పుస్తకాలు తెరిచి నోరుమూసు కొని చదువుకోండి.

సుమతి : అబ్బ, చదువు! చదువు! చదువు! పెద్ద వాళ్ళంతా యింతే. పిల్లలకు చదువు కోడం తప్ప వేరే పనులు లేవను కుంటారు (జానకమ్మ, చిన్నారి, సుమతి లోపలికి వెళతారు, చంటి, భాస్కర్, గీత వాళ్ళు సోఫాలో కూర్చుంటారు)

(ఆంజనేయశాస్త్రి ప్రవేశం)

ఆంజ : (ప్రవేశం)

చంటి : వరే, ఎవర్రా నువ్వు ?

ఆంజ : ఆ ఆ ఆ, దీపస్తంభం అంత మనిషిని పట్టుకొని ఎవర్రా నువ్వని అంటావా! తప్పుబాబూ, ఏదో పెద్దముండావాణ్ణి.

జానకమ్మ: (లోపలినుంచి) వరే చంటీ, ఎవర్రా వచ్చింది ?

చంటి : ఆ ఎవరో పెద్ద ముండావాట్ట,

జానకమ్మ: ఓహో...శ్రీనివాసరావుగారి కోసం వచ్చారా ? అలా నిలబడే ఉన్నారే! కూర్చోండి. ఆయనింట్లో లేరు. ఇప్పుడే వస్తారు.

ఆంజ : ఎలా కూర్చోనుతల్లీ! ముగ్గురు మూడు చోట్లు పూర్తిగా ఆక్రమించు కున్నారుగా, ఏదో పెద్ద ముండా వాణ్ణి. కొంచెం గౌరవింప తగ్గవాణ్ణి.

జానకమ్మ: ఒరే, ముందు కుర్చీలోంచి లేవండి.

గీత : ఒరే భాస్కర్, నువ్వులేరా!

భాస్కర్: ఒరే చంటీ, నువ్వులేరా.

చంటి : అన్నిటికీ చిన్నవాణ్ణి నేను కా కానుగా, ఇలారా కూర్చో.

ఆంజ : తప్పుబాబూ. నన్ను రా కూర్చో అ కూడదు, ఏదో పెద్ద వా కొంచెం గౌరవింప తగ్గవాణ్ణి.

చంటి : మరి చిన్నవాళ్లని మీరు గౌరవించాలి.

ఆంజ : గౌరవించాలా! అంత కాని పని నే నెప్పుడు ఏం చేశాను ?

చంటి : ఇంకేం చెయ్యాలి-సోఫాలో హాయిగా నిద్రపోతుంటే "పెద్దవాణ్ణి, గౌరవింప తగ్గవాణ్ణి" అంటూ నన్ను నిద్ర లేపాటు.

ఆంజ : ఓస్ అంతేకదా-మొత్తానికి ఈ ఆంజ నేయుడికి తగ్గవాడివి దొరికావోయ్.

చంటి : ఏమిటి! మీరు ఆంజనేయులు వారా- మీ గురించి మా బామ్మ చాలా గొప్పగా చెప్తోంది......ఆంజనేయుల వారని తెలియక ఏమిటేమిటో వాగే శాను-నన్ను క్షమించండి (కాళ్ళమీద పడతాడు).

ఆంజ : హా హా హా ఎంత భక్తి, ఎంత విన యం! నేను పుట్టి బుద్దెరిగిన నుంచి అందరి కాళ్లు నేను పట్టుకున్నాను తప్పిస్తే, ఇంతవరకు ఒక్క పవట అయినా నా కాళ్ళు పట్టుకోలేదు.

చంటి : అంటే నేను పవటననా మీ ఉద్దేశం

ఆంజ : అబ్బే అదికాదు నా ఉద్దేశం ... మీ రంతా మంచివాళ్ళలా కనపడు తున్నారు.

(శ్రీనివాసరావు ప్రవేశం)

శ్రీనివాస: ఏరోయ్, ఆంజనేయులూ పూరినుంచి ఎప్పుడొచ్చావు ?

ఆంజ : పూరినుంచి వచ్చానని గుర్తుందిగాని ఎప్పుడొచ్చానో మర్చిపోయాను. ఈ ఏడాది మా రెండో అబ్బాయిదగ్గర గడపాలని బుద్ధి పుట్టింది. కాబట్టి ఓ ఏడాది ఈ పూర్లో ఉంటాను. ఏరా నాయిల్లు నీకు పూర్తి సౌకర్యంగా ఉందా ?

శ్రీనివాస: నీయింటికేంరా, బ్రహ్మాండంగా ఉంది, ఒరే ఏమిటిరా, మీరంతా ఈయన చుట్టూ చేరారు ? మరి గొడవ ప్రారంభించారా ? లోపలకుపొండి.

ఆంజ : అబ్బే, గొడవేంలేదురా-పిల్లలు ముచ్చటగా ఉన్నారు. నువు వచ్చేదాకా సరదాగా వీళ్లతో కాలక్షేపం చేశాను.

శ్రీనివాస: ఒరే, వీళ్లంతా పిల్లలు కాదురా, పిడుగులు.

ఆంజ : ఒరే పిల్లలన్నాక అల్లరి సహజంరా, అల్లరి పిల్లలు కాకపోతే నువ్వూ నేను చేస్తాంట్రా. అదిసరిగానీ! అదేమిట్రా నీ పిల్లలంతా రేషన్ షాపులో పంచదారకోసం క్యూలో నిలబడ్డ జనాల్లా ఒకరి వెనక ఒకరు క్యూలో నిలుచున్నారు ?

నివాస: ఏం తల్లీ, ఏమిటి విశేషం! అంతా పట్టి కట్టుకొని ఒకేసారి వూడిపడ్డారు ?

మతి : నాన్నా-

నివాస: ఏమమ్మా-

సుమతి : నాకు వెంటనే ఐదు రూపాయలు కావాలి.

శ్రీని : ఎందుకు తల్లీ?

సుమ : మా స్నేహితురాలికి తొందరగా ఐదు రూపాయలు కావాలిట,

శ్రీని : మీ స్నేహితురాలికి డబ్బు అవసరమొస్తే నేను ఇవ్వటమేమిటి? అయినా ఇంతకీ ఏమిటా తొందర?

సుమ : మరేం లేదు నాన్నా... మా స్నేహితురాలు నన్నీవేళ సినిమాకి తీసుకుని వెళతానంది...

శ్రీని : అయితే ఇంకేం ... వెళ్లు ... మరి మధ్యలో డబ్బు దేనికి?

సుమ : దానికి నేను అయిదు రూపాయలు అప్పిస్తే నన్ను తనతో పాటు సినిమాకి తీసికెడతానంది...

ఆంజ : నీవరస చూస్తోంటే ఎలుకల కథ గుర్తుకోస్తోంది...

సుమ : ఎలుకల కథా ; నన్ను చూస్తోంటే ఎలుకలు గుర్తుకొచ్చాయా, ఏమిటి మీ అభిప్రాయం? నేను ఎలుకలా ఉన్నానా?

ఆంజ : పొరపడ్డావు తల్లీ. ఆ కథ చెప్తాను విను. ఓసారి ఓ ఆసామి ఎలకను పట్టుకోవాలని ఒక బోను అమర్చి ఆ బోను కొక్కానికి ఒక పకోడీని తగిలించాడుట. రెండు ఎలకలు ఆ పకోడీ చూశాయి, అందులో ఒక ఎలక రెండవ ఎలకతో ఆ బోనులో ఉన్న పకోడీని తెస్తాను కాని... తెస్తే నాకేం యిస్తావు? అందిట,

దానికి రెండో ఎలుక తడుముకో కుంటా నువ్వు తెచ్చిన పకోడీలో సగం ఇస్తాను అందిట, నీ స్నేహితురాలి వ్యవహారం, నీ వ్యవహారం అచ్చం ఎలుకల కథలా వుంది.

సుమ : చూడండి, నేను మీతో మాట్లాడటం లేదు. మీరు మధ్య జోక్యం కలిగించుకోవటం ఏమంత మర్యాదగా లేదు.

ఆంజ : అమ్మా, పెద్దవాణ్ణి గౌరవింపదగ్గ వాణ్ణి...

సుమ : మీరు పెద్దవారు కాబట్టే పెద్దవారిలా వుండమనీ, పిల్లల జోలికి రావద్దనీ చెబుతున్నాను.

శ్రీని : సుమతీ, బయట వాళ్లతో ఇలాగేనా మాట్లాడేది? తప్పుకదూ.

ఆంజ : చూడమ్మాయ్, నీ గడుసుతనం చూస్తోంటే గడుసు గంగమ్మ కథ గుర్తు కొస్తోంది ... సరిగ్గా ఆ కథ లో కూడా...

సుమ : అయ్యో! ఆంజనేయులు గారూ.. మీ కథలన్నీ ఇంకో రోజు తీరిగ్గా వింటాను, నాన్నా, నాకు వేళ అవుతోంది త్వరగా డబ్బుయియ్యి.

శ్రీని : చూడమ్మా! మీ స్నేహితురాలికి డబ్బు అప్పిచ్చి ఆ అమ్మాయితో కలిసి సినిమా కెళ్లే బదులు నువ్వే ఒంటరిగా సినిమాకు వెళ్లకూడదూ?

సుమ : ఒంటరిగా సినిమా చూడటం నా కలవాటులేదు. అయినా కంపెనీ లేకుండా చూసే సినిమా స్మైల్ లేని రోక్షలా వుంటుంది.

శ్రీని : పోనీ నీకంతగా కంపెనీ కావాలను కుంటే గీతను తీసుకొని వెళ్ళొచ్చుగా!

సుమ : ఛీ, ఈ దబ్బపండు మొహాన్ని సినిమాకి తీసికెళ్ళటమా?

గీత : ఏమిటి? నాది దబ్బ మొహమా?

సుమ : దబ్బ మొహం కాదు, డబ్బా మొహం...

గీత : చూడు నాన్నా... అక్క యేమంటోందో...

శ్రీని : అక్కయ్యను నేను కోప్పడుతానుగా... నువ్వూరుకో..

సుమ : ఇంతకీ నా ఐదు రూపాయలు ఇస్తావా?

శ్రీని : లేక చస్తావా? అంటావ్. తప్పుతుందా తల్లీ, ఇవిగో తీసుకో...

సుమ : థ్యాంక్యూ వెరీమచ్ డాడీ... మాడాడీ.. మంచి డాడి.

ఆంజ : ఒరే శ్రీనివాసూ దీన్నే "పెడితే పెళ్లి లేకపోతే శ్రాద్ధ" మంటారు.

శ్రీని : బాగా చెప్పావు.

గీత : నాన్నా అంగడిలో మంచి గొలుసున్నది, నాకో ఐదు రూపాయలుంటే ఇవ్వవూ, ఆ గొలుసు కొనుక్కుంటాను.

శ్రీని : మొన్ననే కదమ్మా పూసల దండ కొనుక్కున్నావు,

గీత : ఛీ, అదేం బాగోలేదు, నాకు గొలుసే కావాలి,

శ్రీని : బావుందమ్మా మీ వరస, మొన్న పూసల దండన్నావు. ఇవాళ గొలుసం టున్నావు, రేపు పులి గోరుతాడు అం టావు, ఎల్లుండి వజ్రాల హారం అం టావు, ఇలా కోరికలకి అంతెక్కడి దమ్మా?

గీత : ఆ, అక్కయ్య అడగగానే కిక్కురు మనకుండా డబ్బు ఇస్తావు, నాకేమో కథలు చెప్తావు.

శ్రీని : కథలు చెప్తే మాత్రం వింటావా తల్లీ, ఇదుగో తీసుకో,

గీత : మా నాన్న మంచి నాన్న

అంజ : డబ్బివ్వకపోతే చెడ్డనాన్న.

భాస్కర్: నాన్నా, బజారులో నాట్యంచేసే బొమ్మ చూచాను. దాని ఖరీదు ఐదు రూపా యలుట, ఇవ్వు నాన్నా.

అంజ : ఇదుగో తీసుకో నాన్నా.

శ్రీనివాస: వరే వరే-

అంజ : జాగ్రత్త నాయనా, నెమ్మదిగా వెళ్లు, పడ్డావంటే పళ్లు రాలగలవు.

చిన్నారి : నాన్నా... నాకు ఓ అయిదు రూపా యలు ఇవ్వవూ, డ్రాయింగ్ పేపర్లు, రంగులు కొనుక్కోవాలి.

అంజ : పాపం ఇవ్వరా!

శ్రీనివాస: మధ్యలో నీ సలహా ఏమిటి ?

అంజ : ఒరేయ్, ఈ అమ్మాయి భావి భారత కళా స్వరూపిణిరా... ఆ అమ్మాయిని ప్రోత్సహించాల్సిన బాధ్యత నీమీద వుంది...

శ్రీనివాస: ఏం ప్రోత్సహించటంరా! ఇలా బొమ్మలు వేసుకొనే నెపంతో చదువు అశ్రద్ధ చేస్తోంటే డ్రాయింగు షీట్లకని, రంగులకని లెక్క లేకుండా డబ్బు ఖర్చు పెడుతూంటే చూస్తూ వూరు కోనా ?...అయినా ఇది గీసే పిచ్చి గీతలు కూడా ఓ కళేనా ?

అంజ : ఒరేయ్, అవి పిచ్చి గీతలు కావురా— మోడ్రన్ ఆర్ట్— ఇదిగోనమ్మా మీ నాన్న పేరు మీద నేనిస్తున్నాను, తీసుకో—

చిన్నారి : సంతోషమండీ.

అంజ : అలా అనక్కరలేదమ్మా.

చంటి : నాన్నా, నాకూ అయిదు రూపాయలు కావాలి.

శ్రీనివాస: నీకు అయిదు రూపాయ లెందుకురా?

చంటి : ఏం, నేను మనిషిని కానా ? నాకు ఖర్చుండదా ?

శ్రీనివాస: ఏమిటోయ్ ఆ ఖర్చులు ?

చంటి : నేను మా స్నేహితులకు పార్టీ ఇవ్వాలి.

శ్రీనివాస: పార్టీయా ? ఎందుకు ?

చంటి : ఎందుకేమిటి ? నిన్న మంగలితో క్రాపు చేయించుకున్నానుకదా! అందు కని పార్టీ ఇమ్మని మా స్నేహితులు తెగ బలవంతం చేస్తున్నారు.

శ్రీనివాస: క్రాపు చేయించుకుంటే పార్టీ ఎందు కురా ?

చంటి : ఆ — నువ్వు అలాగే అంటావ్ — ఎదురింటి బాలు వాళ్ళ అమ్మ వాడు తుమ్మినా సరే పార్టీ ఇస్తుంది—

శ్రీనివాస : ఏడిశావులే.

చంటి : నేనేం ఏడపటం లేదు.—

శ్రీనివాస: నువ్వు నోరు మూసుకొని లోపలి కెళ్లు.

చంటి : లోపలికి కాదు—నువ్వు డబ్బులిస్తే బయటికి వెళతాను—

శ్రీనివాస: నాదగ్గర డబ్బులు లేవు.

చంటి : అబద్ధాలాడకు నాన్నా.

శ్రీనివాస: ఒరే, నీకంతగా అనుమానంగా ఉంటే వచ్చి నా జేబులు వెతుక్కో.

చంటి : వూహు, నాకు తెలుసు నా గతి ఇలా కాలుతుందని-నాఖర్మ కొద్ది ఈ ఇంట్లో ఆఖరివాడిగా పుట్టాను.

ఆంజ : ఈ విషయాన్ని శాస్త్రకారుడు చెప్పాడు.

శ్రీని : ఏ విషయంరా ?

ఆంజ : అదే "పుడితే పెద్దవాడిగా పుట్టాలని," "ఆఖరివాడిగా ఎట్టి పరిస్థితులలోను పుట్టకూడదని"

శ్రీని : ఒరే ఆంజనేయులూ, చూచావుగా ఈ పిల్లలంతా-ఎలా బాగు పడతారో ఏమో, పెద్దవాడు దగ్గరనుంచి చంటి వాడి దగ్గర వరకు ఎవరికీ బాధ్యతలు తెలియవు, డబ్బు విలువ అసలే తెలియదు, నేను కష్టపడి సంపాయించిన డబ్బు సినిమాలకని షికార్లకని, విందులకని, వినోదాలకని నగలకని బొమ్మలకని, మతి లేకుండా ఖర్చు పెడుతున్నారు. నా ఆదాయంలో ఈ సంసారాన్ని పోషించడం కష్టంగా వుంది, వీళ్లంతా ఏనాటికైనా బాగుపడి దారి కొస్తారా? అసలు వీళ్లకి డబ్బు విలువ అంటే ఏమిటో తెలుస్తుందా అని నా బెంగ.

ఆంజ : ఒరే, కష్టాలు కలకాలం ఉండవని పెద్దలు చెప్పనే చెప్పారు, ఏదో కుర్రతనం వలన అలా ఉన్నారు కాని, కొద్ది రోజులు పోయాక వాళ్లే తెలుసుకొని బాగు పడతారు.

కనకమ్మ: ఏమండి భోజనానికి లేవండి, అన్నయ్యగారూ మీరు కూడా రండి.

ఆంజ : అప్పే నేనెందుకు, వస్తాను.

శ్రీని : ఒరే పిచ్చి వేషాలు కట్టి పెట్టి భోజనానికి నడు,

ఆంజ : తప్పుతుందా ? సరేలే, అందుకే "ఏపాటు తప్పినా సాపాటు తప్పదు" అన్నారు పెద్దలు!

( తెర )

# రెండవ రంగము

సుమ : అన్నయ్యా! ఇంత పొద్దున్నే అమ్మా నాన్నా మనకి చెప్పకుండా ఎక్కడకి వెళ్లారంటావ్?

రవి : అవును, అదే నేనూ ఆలోచిస్తున్నాను, ఎక్కడికి వెళ్లివుంటారూ?

చంటి : మనందరినీ తీసికెడితే యాభై రూపాయలు అయిపోతాయని మనకు చెప్పకుండా అమ్మా నాన్నా సినిమాకి వెళ్తుంటారు.

సుమ : నీ తెలివి తెల్లారి నట్టే వుంది, సినిమాకైతే ఇంత పొద్దున్నే ఎందుకు వెడతారురా?

చంటి : టిక్కట్లు దొరక వేమో నని భయం.

రవి : ఇప్పుడెలా? నాకు తొందరగా పాతిక రూపాయలు కావాలి.

చంటి : ఎలా ఏమిటి ? నాన్నగారి చొక్కా జేబు వెతుకు,

రవి : నోరు ముయ్యరా.

సుమ ; అన్నయ్యా, నాకు కూడ పది రూపాయలు కావాలి,

చంటి : అందుకా? ప్రొద్దున్నే పోపు సామాను తెగ వెతుకు తున్నావు? అందులో ఆవాలు మెంతులు తప్ప మరేమి లేవు.

గీత : అన్నయ్యా మనం పడుకున్న పక్కలో ఈ కవరుంది, దీనిమీద నీ పేరు రాసి ఉంది.

రవి : కవరా! ఏది?

చంటి : అందులో ఏమైనా డబ్బులున్నాయేమో చూడు.

రవి : యిందులో ఏదో కాగితం ఉంది. అరే ఇది నాన్నగారి దస్తూరిలా ఉందే, నాకేదో ఉత్తరం వ్రాసేరు సుమ.

సుమ : ఉత్తరమా! ఆశ్చర్యంగా ఉన్నదే, ఏం రాశారన్నయ్యా చదువు.

రవి : "చిరంజీవి రవిని ఆశీర్వదించి వ్రాయునది, బాబూ! నేను అమ్మా ఇల్లు విడిచి పోతున్నాం,"

సుమ : ఏమిటీ మనల్నందర్నీ వదిలేసి అమ్మా నాన్న వెళ్లి పోయారా? ఎందుకని? మనం ఏం తప్పుపని చేశాం?

(తెర నుండి)

శ్రీని : మీరేం తప్పు చేశారూ? అని ఆలోచించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే చేసిన తప్పంతా నేనే చేశాను, మిమ్మల్నందరిని అంత గారాబం చేసి మీరందరూ ఇలా తయారు కావటానికి కారకుడి నయ్యాను. ఇక ఈ సంసారాన్ని ఈదే శక్తి నాకు లేదు. అందుకే నేనూ మీ అమ్మా మీ అందరినీ వదిలేసి ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతున్నాము,

సుమ : ఏమిటి? అమ్మా నాన్న మనల్ని వదిలేసి వెళ్ళిపోయారా ! అసలు ఇంతకీ వాళ్ల ఉద్దేశం మనం రోడ్ల మీదపడి అడుక్కొని తినాలా?

శ్రీని : మీరంతా ఎలా బ్రతకాలి అనే ప్రశ్న వస్తుందని నాకు తెలుసు. అందుకు తగిన ఏర్పాట్లు చేశాను... బాబు రవీ... నాకు వచ్చే మొత్తం జీతం ఆంజనేయ శాస్త్రిగారు మీకు ప్రతి నెలా అందచేస్తారు. ఆ డబ్బు మీరు ఇష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టుకోండి. బొమ్మలే కొనుక్కుంటారో, నగలే కొనుక్కుంటారో... సినిమా చూస్తారో, అంతా మీ ఇష్టం... మొత్తం డబ్బు మీ చేతికి అంద చేస్తాను,. ఎవరికీ లెక్కలు చెప్పాల్సిన అవసరం వుండదు. కాని ఒక్క విష యం మాత్రం గుర్తు పెట్టుకోండి... నేను అందజేస్తున్న మొత్తం డబ్బు తోనే నెలంతా గడవాలి. తిండి, బట్టలు, ఇంటిఅద్దె, పాలు, ఇతరఖర్చు ఈ డబ్బు తోనే గడవాలి... అంతా మీ ఇష్టం... ప్రతి పైసా ఖర్చు పెట్టే ముందు బాగా ఆలోచించి ఖర్చు పెడ తారని ఆశిస్తున్నాను. ఎక్కడఉన్నా మీ అందరి క్షేమాన్ని కోరే మీ తండ్రి... శ్రీనివాసరావు.

సుమ : నాన్సెన్స్... సంసారం ఈదటం చేత కాదని ఇల్లు విడిచి పోతారా... అవ్వ ... ఎవరైనా వింటే నవ్వి పోతారు...

చంటి : అక్కయ్యా... నాన్న ఈదటం రాదని వెళ్ళిపోయాడా... అయ్యో నన్నడిగితే నేను ఈత నేర్పించే వాడినిగా, నాకు బాలుగాడు నేర్పించాడు.

భాస్కర్: అక్కయ్యా! మనం పడుకునే పక్కలో ఈ కవరుంది, దీనిపైన నీపేరు వ్రాసి ఉంది.

సుమ : ఓహో ఇంకొక ఉత్తరమా ? ఇది అమ్మ దస్తూరి.

గీత : ఏం రాసిందక్కయ్యా?

(తెర వెనుక నుంచి)

జానకమ్మ : చిరంజీవి సుమతికి ఆశీర్వదించి మీ అమ్మ వ్రాయునది, నీవు ఈ ఉత్తరం చదివే సమయానికి నేను మీ నాన్న గారితో మీ అందరిని విడిచిపెట్టి ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతున్నాను. మిమ్మల్ని యిలా విడిచిపెట్టి వెళ్ళడం నిజంగా ఇష్టంలేదు, కాని మీ నాన్న గారి మొండిపట్టువలన ఇలాచేయాల్సి వచ్చింది. సుమతీ... ఇంటి బాధ్యత అంతా నీమీద పడేస్తున్నాను. నాన్న గారు మాత్రం నీకు బాధ్యతలు పెట్ట వద్దని వాదిస్తున్నారు, నాకు మాత్రం నీమీద నమ్మకం ఉంది. నీచెల్లెం డ్రను, తమ్ముళ్ళను ఎలా కాపాడు కుంటావో! అంతా నీ యిష్టం. గీత నోటి దురుసుతనంకొద్దీ నిన్నే మన్నా అన్నానరే, దానితో పోట్లాడక దాన్ని ప్రేమగా చూసుకో, భాస్కర్ చాలా దుడుకువాడు. ఒక కంటకని పెట్టి ఉండు. ఇక నా బెంగల్లా చిన్నారి, చంటిల విషయంలోనే. చంటి స్వతహాగా చాలా అల్లరివాడు, ఇంక చిన్నారి అల్లరి కూడా తక్కువ కాదు. ఇద్దరూ పోట్లాడుకొని కొట్టుకో కుండా చూడగలవు, వాళ్లతో వేగా లంటే చాలా ఓర్పుండాలి. ఇకనుంచి వీరందరి అవసరాలు నీవు, అన్నయ్యే తీర్చాలి. నేనెక్కడ ఉన్నా నామన సంతా మీ మీదే ఉంటుంది. పసి

పిల్లలే, మీ రెంత కష్టాలు పడు తున్నారో నా మనసు వెలవెలలాడి పోతోంది. నా మనసు ఎంత చిత్ర హింసకు గురౌతుందో, నేనెంత వేద నను అనుభవిస్తున్నానో అర్థం చేసుకో, కానీ ఏమి చేయను? పరిస్థితులకు తలవంచక తప్పలేదు. బ్రతికిఉండి కూడా తన పిల్లల దగ్గర జీవితాన్ని గడపలేని నిర్భాగ్యురాలైన నీ తల్లి.

సుమ : పూర్ మదర్, ఐ రియల్లీ పిటీ హర్.

గీత : అక్కయ్యా అమ్మానాన్నా ఎందుకిలా చేశారు?

భాస్కర్ : మనల్ని వదిలి ఎందుకిలా వెళ్ళి పోయారు ?

చిన్నారి : అమ్మా, నాన్న మరెప్పుడొస్తారు ?

పంటి : నన్ను నిద్దర లేపుతే నేనుకూడా వాళ్ళతో వెళ్ళేవాణ్ణి అక్కయ్యా! మనల్ని వెంట తీసుకొని వెళ్ళి ఉంటే బాగుండేదికదూ.

సుమతి : నీ తెలివి తెల్లారినట్లే ఉంది, మన బాధ పడలేకేకదా వాళ్ళు వాళ్ళదారి చూసుకున్నారు.

భాస్కర్ : సుమతీ, నాకంతా అయోమయంగా వుంది. ఏమీ పాలుపోవటం లేదు. ఇప్పుడేమిటి చేయడం.

పంటి : ఏముందీ... వెళ్ళి ఆంజనేయులుగా రింటి మీద దాడి చేద్దాం.

గీత : ఆయన ఇంటిమీద దాడి చేయట మెందుకు? మ ధ్య లో ఆయనేం చేశాడు ?

పంటి : పిచ్చి మొద్దు. నాన్నగారు ఆయనకి డబ్బులిస్తానని రాశారుగా!

సుమతి : అవునన్నయ్యా! నువ్వు ఆంజనేయులు గారింటికి వెళ్ళి...

ఆంజ : అబ్బే! వెళ్ళక్కర లేదమ్మా! నేనే వచ్చేశాను. ఇలా తలుచుకుంటే చాలు, అలా ప్రత్యక్షమౌతాను.

భాస్కర్ : రండి! సమయానికి వచ్చారు. నేని ప్పుడే మీ యింటికి వద్దామనుకుంటు న్నాను. బహుశా మీకు సంగతి తెలిసే వుంటుంది.

ఆంజ : తెలుసు! బాబూ. జరిగిన దానికి బాధ పడుతున్నాను.

సుమ : బాధా! ఎందుకు? అయినా మాకులేని బాధ మీకెందుకు ?

ఆంజ : అవును, ఆ మాటా నిజమే. కందకి లేని దురద కత్తిపీటకు ఎందుకు. అని సామెత వుండనే వుంది—

సుమ : అంజనేయులుగారూ! మీ సామెతలు కథలు తరువాత తీరిగ్గా వింటాంగాని ముందు మా నాన్నగారు మీకిచ్చిన డబ్బులు ఇచ్చేసి దయచేయండి.

ఆంజ : అందుకే కదమ్మా, నేను వచ్చింది... మరి డబ్బు ఎవరి చేతి కిమ్మంటారు.

రవి : ఇందులో అలోచించాల్సిం దేముంది. నేను ఇంటికి పెద్దవాణ్ని కనుక ఆ డబ్బు నా చేతికివ్వండి.

సుమతి : నాన్సెన్స్... అమ్మ ఇంటి బాధ్యత నా మీద పెట్టింది... కాబట్టి ఆ డబ్బు నా కివ్వండి.

ఆంజ : అమ్మా. మీలో మీరు పోట్లాడుకో కండి. ఇంటికి పెద్దవాడు మొగ దిక్కు రవే కాబట్టి ఈ డబ్బు అతని చేతిలో పెడుతున్నాను.

రవి : ఏమిటి? రెండు వందలేనా?... నాన్న గారి మొత్తంజీతం రెండువందలేనా?

ఆంజ : చూడుబాబూ, మీ నాన్నగారి మొత్తం జీతం ఆరువందలు. అందులో ప్రావి డెంటు ఫండు, బెనివలెంటు ఫండు... మొదలైన డిడక్షన్లు పోగా నాలుగు వందలు చేతికొస్తుంది.... అందులో నా ఇంటద్దె రెండువందలు మినహా యించుకొని, రెండువందలు నీ చేతిలో పెట్టాను.. ఈ డబ్బుతో ఈ నెలంతా ఎలా గడుపుతావో... ఆ..,అన్నట్టు చెప్పటం మరిచిపోయాను.. నేను అప్పుడప్పుడు వచ్చిచూసి పోతుం టాను.. మీకు ఏ సహాయం కావా లన్నా చేస్తాను.

చిట్టి : మరి డబ్బులు కావాలన్నా, ఇస్తారా?

ఆంజ : అదిగో.. అది తప్ప ఏదైనా చేస్తాను.., వస్తా,

చిట్టి : చూశావా అక్కయ్యా, డబ్బు పేరు చెప్పే టప్పటికి వల్లగా ఎలా జారుకున్నాడో!

భాస్క : ఇదిగో! ఈ నెల నా చేతి ఖర్చు క్రింద వందరూపాయలుంచుకొని మిగతవి ఇచ్చేస్తున్నాను... మీ ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకోండి. , . వస్తా

గీత : ఒరేయ్ భాస్కర్ నా ఖర్చులక్రింద..25 రూపాయలు తీసుకొంటున్నాను.. మిగతాది మీ ఇద్దరూ తీసుకోండి.

చిన్నా : ఒరేయ్ డ్రాయింగ్ షీట్లు కొనుక్కో వాలి... అందుకు ఈ ఐదు రూపా యలు తీసుకొని పోతున్నాను.. నీకు వచ్చేనెల డబ్బిస్తాలే,

చంటి : అందరికంటే చిన్నవాడిగా పుట్టానుగా! నాకు తెలుసు నా ఖర్మ ఇలా కాలు తుందని. .

( తెర )

# మూడవ రంగము

భాస్క : సుమతీ నీదగ్గర ఇంకేమీ డబ్బులు లేవా ?

సుమ : బావుంది... నా దగ్గర ఎలా మిగులు తాయి? పదిహేనురోజుల్లో వంద రూపాయలు ఖర్చు పెట్టేసినవాడివి నువ్వు... అఫ్టాల్ ఓ ఏభై రూపా యలు నేను ఖర్చు పెట్టాను.

(పాలవాడు ప్రవేశం)

గీత : అక్కయ్యా ఇంట్లో పప్పులు బియ్యం. అన్నీ అయిపోయాయి. ఇవాళ వంట చేయటానికి ఏమీలేవు.

పాల: అమ్మా ఇవాళైనా నాడబ్బులు నాకిస్తారా?

సుమ : ఇవాళ ఎక్కడనించి తెచ్చిస్తాం... మా అమ్మా నాన్నా ఊరికి వెళ్ళారని చెప్పా

సుగా... వాళ్ళురాగానే నీబాకీ తీర్చే స్తాం...

పాల : నాకదంతా తెలీదమ్మా, ఇవాళ మీరు ఏమైనా డబ్బులు ఇవ్వాల్సిందే.

సుమ : డబ్బులు లేవంటూంటే నీ క్కాదు. చెప్పేది...

పాల : ఎందుకుండ వమ్మా! మీకు సినిమాలు చూడటానికి డబ్బులున్నాయి. రవి బాబు హోటల్లకు స్నేహితులతో వెళ్ళటానికి డబ్బులున్నాయి?

రవి : ఏయ్! పిచ్చిగా వాగకు,

పాల : నేనేం పిచ్చిగా వాగటం లేదు బాబూ! నిన్న మిమ్మల్ని స్నేహితులతో హోటల్లోంచి వస్తూంటే చూశాను. మొన్న సుమతమ్మగారిని సినిమా టాకీసు దగ్గర చూశాను. మీకు జల్సా చేయటానికి వున్న డబ్బులు నా పాల కి ఇవ్వటానికి ఎందుకుండవూ అని అడుగుతున్నాను.

(అప్పులవాడు ప్రవేశం)

అప్పు: బాబూ! మీనాన్నగారు ఇంట్లోవున్నారా?

రవి : లేరండి... ఊరెళ్ళారు.

అప్పు :ఊరెళ్ళారా? ఏఊరు? నీ అబద్ధాలు కట్టి పెట్టి ముందు మీ నాన్న గారిని బయటకిపిలు.

రవి : ఏమిటండీ... ఇంట్లోలేరని చెబుతోంటే మీకు కాదు చెప్పేది!

అప్పు: చిన్నప్పుడు... నేనూ నాటకాలు వేసే వాణ్ణి... నటన అంటే కాస్తోకూస్తో నాకూ పరిచయం వుంది... నీ నటన మెచ్చుకున్నాను కానీ... ముందు మీ నాన్నగారిని బయటకిపిలు... లేకపోతే వంటగదిలోకి నేనే దూరాల్సివస్తుంది.

రవి : ఆగండి... ఏమిటీ దౌర్జన్యం··· ఇంతకీ మీకు నాన్నగారితో ఏంపని...

అప్పు : ఆ... అలా అడుగు చెబుతాను... మీ నాన్న నాదగ్గర రెండు వందల రూపా యలు అప్పుతీసుకున్నాడు... ఇప్పుడు ఇస్తాను, అప్పుడు ఇస్తాను అంటూ కాకమ్మ కబుర్లు చెబుతూ ఇంతకాలము కాలక్షేపం చేశాడు... ఇవాళ ఏమైనా సరే నాబాకీ వసూలు చేసుకోకుండా ఇంటికి వెళ్లను.

రవి : ఏమిటీ మానాన్నగారు మీదగ్గర రెండు వందలు అప్పు చేశారా? నమ్మ లేకుండా వున్నాను.

అప్పు : అంటే నేను అబద్ధం చెబుతున్నానని నీ ఉద్దేశమా? ఇలాంటిచిక్కులొస్తాయనే ముందు జాగ్రత్తగా మీ నాన్నగారితో బాండు రాయించుకున్నాను, కావా లంటే చూడు.

రవి : సుమతీ! చూడు... అది నాన్నగారి సంత కమే చూడండి... మీరు ఒక్క నాలుగు రోజులు ఓపిక పట్టండి...మీ డబ్బు వువ్వుల్లో పెట్టి తిరిగి ఇచ్చే స్తాం...

అప్పు : చూడమ్మా! పూలెవరికి కావాలి... డబ్బు నా మొహాన పారేయ్! నాదారిన చక్కా పోతాను... అయినా ఇవాళ డబ్బులు లేకుండా ఇంటి గడప తొక్కితే గరిట కాల్చి వాతలు పెడతానని మా ఆవిడ ఆర్డరు జారీ చేసింది...

చంటి : అక్కయ్యా! ఆకలేస్తోంది... అన్నం పెట్టవూ...

చిన్నా : అవునక్కయ్యా! నాకు కూడా బాగా ఆకలేస్తోంది. . .

గీత : ఇవాళ అన్నం వండలేదు.

చిన్నారి : ఏం! ఎందుకని వండలేదు.

భాస్క : త్వరగా వంట చేయక్కయ్యా ! బాగా ఆకలేస్తోంది.

గీత : ఎలా చేస్తుందీ! ఇంట్లో అన్నీ అయిపోయాయిగా,

చంటి : అయిపోతే బజార్లో కొనొచ్చుగా!

గీత : కొనొచ్చు... కానీ కొనటానికి డబ్బులు లేవు. . .

భాస్క : అదేమిటి. . నాన్నగారు డబ్బిచ్చారుగా! అదంతా ఏమైంది. . .

గీత : ఏమైందని తెలీనట్టు అడుగుతావేం! . . . మనమేగా అంతాడబ్బు ఖర్చుపెట్టేశాం.

చంటి : ఇప్పుడు ఒకపైసా కూడా మిగల్లేదా!

గీత : మిగల్లేదు.

భాస్క : మరిప్పుడెలా?

గీత : ఎలాగో తెలియకనే కదా! బుర్రలు బద్దలు కొట్టుకొని చస్తున్నాం.

సుమ : అన్నయ్యా, మనము పొరపాటు చేసామేమో అనిపిస్తుంది. డబ్బు చేతికి రాగానే తిండి సంగతి మరచిపోయి విలాసాలకి వినోదాలకి డబ్బు ఖర్చుపెట్టేశాం. ఇప్పుడు పైసాలేదు. ఈ నెల గడవాలంటే ఇంకా పదిహేను రోజులున్నాయి.

రవి : అవును సుమతీ. మనం తప్పుచేశాం. . .

సుమ : కానీ ఏం లాభం, మనం చేతులు కాలాక ఆకులు పట్టుకుంటున్నాం.

ఆంజ : (ప్రవేశం) అబ్బే. చేతులింకా పూర్తిగా కాలలేదు తల్లీ. . . మీకు ఇలాంటి పరిస్థితి వస్తుందని ముందే వూహించి మొత్తం డబ్బు మీకివ్వలేదు. మీ నాన్నగారి జీతం మొత్తం వెయ్యి రూపాయలు. అప్పుడు నాలుగు వందలు పోను ఇంకా ఆరువందలు మిగిలింది. . ఇదిగో మీ చేతిలో పెడుతున్నాను. ఎలా వాడుకుంటారో ఏమో. అంతా మీయిష్టం.

సుమ : ఆంజనేయులుగారూ, మీరు సమయానికి దేవుళ్లా వచ్చి మమ్మి కాపాడారు.

ఆంజ : చూడమ్మా. ఇంకా పదిహేను రోజులు గడవాలి. ఆ విషయం గుర్తుంచుకొని డబ్బు ఖర్చు చేయండి.

సుమ : అంజనేయులుగారూ, మాకు డబ్బు విలువ ఏమిటో ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది. . . ఈ సారి ప్రతిపైసా ఖర్చు పెట్టేముందు ఆలోచించి మరీ ఖర్చు పెడతాం.

ఆంజ : సంతోషం. . మరి నేను వస్తాను.

చంటి : ఈ సారి వచ్చేటప్పుడు మళ్లీ డబ్బులు పట్టుకురండి.

అప్పు : అమ్మా. నీ చేతికి డబ్బులు వచ్చాయి కదా. నా అప్పు తీర్చేయ కూడదూ, పాలకి నూట ఏభైరూపాయలు అయింది. ఇంకా ఆలశ్యం చేయకుండ వెంటనే యిచ్చేయండి,

పాల : ఆగవయ్యా ముందు నా పాల డబ్బులు తీసుకోనీ. అమ్మ పాలకి నూట ఏభై రూపాయలయింది. ఇంక ఆలస్యం చేయకుండా వెంటనే ఇచ్చేయండి.

అప్పు : ఆగవయ్యా, నీ అప్పుకన్నా నాఅప్పు పెద్దది. . కాబటి ముందు అప్పుతీరి పోనీ.

పాల : ఇదిగో ఆసామో! నాకు గనుక కోపం వచ్చిందంటే ఈ చెంబులో వున్న పాలన్నీ నీ నెత్తిన గుమ్మరిస్తాను... జాగ్రత్త.

సుమ : అబ్బ! మీలో మీరు ఎందుకు పోట్లాడు కుంటున్నారు. ఇప్పుడు నేను మీ ఇద్దరి అప్పు తీర్చేస్తున్నాను. ఇదిగో తీసుకోండి.

అప్పుల:అమ్మాయి! నువ్వు వెయ్యేళ్ళు ధనంతో వర్ధిల్లు...

పాల : అమ్మా, వాడికి డబ్బెందు కిచ్చారమ్మా. వాడి సంగతి నేను చూసుకునే వాణ్ణి కదా!

సుమ : ఏనాటికైనా అప్పులప్పే ... తీర్చక తప్పదు కదా!

పాల : అమ్మా, ఇందాక డబ్బులిమ్మని కొంచెం కరుకుగా మాట్లాడాను. నామీద కోపం తెచ్చుకోకండి.

సుమ : తెచ్చుకోనులే! అన్నయ్యా! వీళ్ల అప్పులు పోను నా దగ్గర ఇంక 150 రూపాయలు మిగిలింది....ఈ డబ్బు మనం జాగ్రత్తగా వాడుకోవాలి. ముందుగా లెక్కలు వేసుకోకుండా డబ్బు ఖర్చు పెట్టడం వల్ల మనం చిక్కుల్లో పడ్డాం.. కాబట్టి ఈ సారి జాగ్రత్తగా లెక్కలు వేసుకొని ఖర్చు పెడదాం... అన్నయ్యా, నీఖర్చులకు ఎంత కావాలి.. ?

వి : యాభై రూపాయలు కావాలి.

సుమ : గీతా, మరి నీకు?

గీత : నేను మంచి గొలుసులు రెండు కొనుక్కోవాలి ఇరవై అయిదు రూపాయలు కావాలి.

సుమ : ఒరేయ్! భాస్కరూ, మరి నీకెంత కావాలి?

భాస్క : నాకు మంచి బొమ్మలు కొనాలి... కనీసం ఇరవై అయిదు రూపాయలు కావాలి...

సుమ : చిన్నారీ, మరి నీకు?

చిన్నా : నేను డ్రాయింగు షీట్లు, రంగులు కొనుక్కోవాలి, నాకు పది రూపాయలు కావాలి ..

సుమ : చంటీ! మరి నీకు...

చంటి : వీళ్లందరూ తీసుకున్నాక నాకు ఇంకా డబ్బులు మిగులుతాయా !

సుమ : ఆ సంగతి నేను చూసుకుంటాను. కానీ నీ కెంత కావాలో చెప్పు.

చంటి : నాకు పది రూపాయలు కావాలి...

సుమ : ఆల్‌రైట్... మీ అందరికీ మీరు అడిగిన డబ్బు ఇస్తాను. మీ అందరికీ డబ్బిచ్చాక నాదగ్గర ముప్ఫయి రూపాయలు మిగులుతాయి. దీనితో మనందరికి పదిహేను రోజులకు సరిపోయే బియ్యం, పప్పులు, కూరలు కొనటం సాధ్యం కాదు. కాబట్టి ఈ డబ్బు కూడా కావాలంటే మీకే ఇస్తాను. కానీ ఒక షరతు... మీరెవరూ ఆకలి, అన్నం పెట్టమని అడగ కూడదు.

చంటి : ఆశ దోశ, అప్పడం వడ,

భాస్క : అవును, అన్నం తినకుండా నేనువుండ లేను.

గీత : ఇప్పుడే ఆకలితో నా కడుపు మాడి పోతూంది. ఇంకా పదిహేను రోజులు అన్నం తినకుండా వుండాలంటే... అమ్మ బాబోయ్. నేనుండలేను.

రవి : అవును సుమతీ! నీ షరతు ఏమీ బాగా లేదు. అన్నం తినకుండా బ్రతకటం ఎలా.

సుమ : మరి ప్రస్తుతం అంత కన్నా మార్గం లేదు... మిగిలిన ముప్పై రూపాయ లతో మిగిలిన పదిహేను రోజులకు నువ్వు తిండి పెట్టగలనంటే పెట్టు, నాకేం అభ్యంతరం లేదు ..

రవి : అవును సుమతీ ... నువ్వు చెప్పింది నిజమే ... తిండికన్నా సినిమాలు పికార్లు ఎక్కువ కాదు ... నువ్వు నాకేమీ డబ్బు ఇవ్వక్కర్లేదు, ఆ డబ్బుతో బియ్యం కొందాం,

గీత : అక్కయ్యా ! నాకుకూడా గొలుసులు అక్కరలేదు. నాకూ డబ్బులు వద్దు. దానితో పప్పూఉప్పూ అవీ కొందాం...

భాస్క : అక్కయ్యా! బొమ్మలు లేకపోతే నేనేం చచ్చిపోను, ఆ డబ్బులు కూడా ఇంటికే ఖర్చుపెడదాం...

చిన్నా : నేను కూడా డబ్బులు తీసుకోను...

చంటి : ఇంత మందికి అక్కర్లేని డబ్బు నాకు మాత్రం ఎందుకు... నాకూవద్దు...

సుమ : నిజంగానే మీ కెవరికీ డబ్బులొద్దా !

అంద : ఊహు... వద్దు... ఇప్పుడే కాదు... ఎప్పటికీ వద్దు...

సుమ : అమ్మా నాన్న ఇప్పుడు మన దగ్గర వుంటే మనలో కలిగిన ఈ మార్పుకు ఎంత సంతోషించేవారో. అన్నయ్యా, నువ్వు బజారుకెళ్లి సరుకులు తీసుకురా !

రవి : అలాగే ! మరి సంచులు ఇవ్వు...

సుమ : అన్నయ్యా! చంటి పరిస్థితి ఏమీ బాగా లేదు... వాడు అమ్మ కావాలి... అమ్మని చూడాలీ అని తెగ కలవరిస్తున్నాడు.

రవి : అలాగా. అయితే పద. వాణ్ణి డాక్టరు దగ్గరకు తీసుకెడదాం...

ఆంజ : ఏమిటమ్మా ! డాక్టరుగారంటున్నారు... ఎవరికైనా ఒంట్లో బాగాలేదా?

సుమ : ఆంజనేయులుగారూ! రండి..సమయానికి వచ్చారు. మా చంటి వాడు అమ్మని నాన్నని చూడాలని కలవరిస్తున్నాడు.. అన్నం కూడా సరిగా తినటంలేదు.

ఆంజ : ఆ...అలాగా... అయితే కంగారు పడకండి ..నేను ఇప్పుడేవెళ్లి మీ అమ్మను నాన్నను తీసుకొస్తాను,

సుమ : ఏమిటీ, మా అమ్మా నాన్నా ఇక్కడే వున్నారా ! వాళ్లు ఎక్కడున్నారో మీకు తెలుసా ? అయితే త్వరగా వెళ్లి వాళ్లను తీసుకురండి...

ఆంజ : అవునమ్మా! మీ అమ్మా నాన్నా ఇక్కడే వున్నారు. మా ఇంట్లోనే క్షేమంగా వున్నారు.

శ్రీని : అవునమ్మా ! నేనూ మీ అమ్మ క్షేమంగా వున్నాం...

అంజ : ఒరేయ్! అదేమిట్రా, నేను చెప్పకుండా నీ అంతట నువ్వే వచ్చేశావు?

శ్రీని : ఏం చేయమంటావురా, నీ చెల్లెలు ఇక పిల్లల్ని చూడకుండా ఒక్కక్షణం కూడా వుండనని పట్టుపట్టింది, ఇక చేసేది లేక ఇలా వచ్చాను.

జాన : ఏమమ్మా! సుమతీ, బాగున్నావా ? ఏమిటమ్మా అలామాట్లాడకుండా చూస్తూ నిలబడిపోయావ్!

సుమ : అమ్మా! నువ్వు నిజంగా వచ్చేశావా! అమ్మా ! నిన్నూ నాన్నగారినీ చూసి ఎన్నిరోజులైంది. అమ్మా, మా మీద కోపం పోయిందా ?

జాన : పిచ్చిపిల్లా! మీ మీద నాకెందుకే కోపం,

భాస్క : అమ్మా, నాన్నా, మీరెప్పుడొచ్చారు ? ఒరేయ్! చంటీ...చిన్నారి...భాస్కర్.. గీతా... అందరూ రండి... మన అమ్మా నాన్నా వచ్చేశారు.

గీత : నాన్నా ! మమ్మల్నందరినీ వదిలిపెట్టి ఎందుకు వెళ్లిపోయారు. ఇంకెప్పుడూ మమ్మల్ని విడిచి వెళ్లవద్దు.

భాస్క : అవును నాన్నా, మమ్మల్ని విడిచి ఎక్కడికీ వెళ్లవద్దు.

చిన్నా : అమ్మా, మేం అల్లరిచేస్తున్నామని కోపంతో వెళ్లిపోయావు కదూ, ఇంకెప్పుడూ అల్లరి చేయను, నన్ను విడిచి వెళ్లకేం.

జాన : లేదమ్మా, ఇంకెప్పుడూ మిమ్మల్ని విడిచి వెళ్లనుగా,

శ్రీని : ఇంతకీ చంటిగాడు ఏడి... కనపడడేం ?

సుమ : అమ్మా, వాడు నీ కోసం బెంగపెట్టుకొని కలవరిస్తున్నాడు, అన్నం తినటం లేదు...ఆ గదిలో పడుకొని వున్నాడు,

చంటి : నేను గదిలో ఏం లేను.. ఇక్కడున్నాను.

జాన : నాయనా చంటీ, బాగున్నావా ?

చంటి : నేను మీతో మాట్లాడను పోండి,

శ్రీని : ఏం, ఎందుకని మాట్లాడవు ?

చంటి : నాకు మీ మీద బోల్డు కోపం వచ్చింది.

జాన : కోపం ఎందుకు ?

చంటి : ఎందుకేమిటి ? మీరు నన్ను విడిచి వెళ్లిపోయారుగా! అందుకు...

శ్రీని : మరి మేం తిరిగొచ్చేశాంగా!

చంటి : అందుకే మళ్లీ కోపం పోయింది... అమ్మా, నన్ను విడిచి ఎక్కడకీ వెళ్లకేం.

జాన : అలాగే నాయినా ! ఎక్కడకీ వెళ్లను.

చంటి : సినిమాకూ్కడా !

జాన : కొంటె వెధవా,

రవి : నాన్నగారూ ! మేమంతా మా తప్పులు తెలుసుకున్నాం. మీరు కష్టపడి సంపాయిస్తున్న డబ్బు మేమంతా ఎలా వృధాగా ఖర్చు పెడుతున్నామో అర్థమయింది. నాకు డబ్బు విలువ అంటే ఏమిటో తెలిసొచ్చింది.

సుమ : అమ్మా, ఇంతకాలం బాధ్యతలు అంటే ఏమిటో తెలియకుండా ప్రవర్తించాము. మీరు మా కళ్లముందు తిరుగు తోంటే మీ విలువ ఏమిటో తెలుసుకోలేక పోయాము. మీరు దూరంగా వెళ్లాక అమ్మా నాన్నా ఎంత విలువైన వారో అర్థమయింది. అమ్మా ఇకనుంచీ మేం బుద్ధిగా వుంటాం !.

గీత : నాన్నా, ఇకనుంచీ గొలుసులు కొనమని నిన్ను వేధించను.

భాస్క: అమ్మా, ఇకనుంచి డ్రాయింగు కాయితాలు, రంగులు కొనమని నాన్నను పీడించను.

చంటి : అమ్మా, పోవుల సామాను పెట్టి జోలికి పోను.

అంజ : ఒరేయ్, చూశావురా నే చెప్పలా, నీ పిల్లలంతా తప్పకుండా మారతారని!

శ్రీని : ఒరేయ్, ఇదంతా నీ చలవేరా, నీ మేలు ఈ జన్మలో మరచిపోను,

అంజ : ఒరేయ్, అందుకే అంటారురా-"అంతా ఆ భగవంతుని అనుగ్రహం" అని.

(అందరూ హాయిగా నవ్వుతారు)





# ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ప్రచురణలు

## బాల సాహిత్య సంకలనాలు

1. తారంగం : తారంగం — సంకలనకర్త : డా॥ (కుమారి) యమ్. కె. దేవకి

2. గోరుముద్దలు— (రంగురంగుల చిన్నారి బొమ్మలపాటలు)

3. మల్లెలు : మందారాలు (బొమ్మల గేయాలు) — సంకలనకర్త : బి. వి. నరసింహారావు

4. పసిడి తెర (బాల నాటికలు) — సంకలనకర్త : న్యాయపతి రాఘవరావు

5. చిరుగజ్జెలు (బాలగేయ నృత్యనాటికలు) — సంకలనకర్త : ఏడిద కామేశ్వరరావు

6. అనగా అనగా (కథలు) — సంకలనకర్త : మండా సూర్యనారాయణ (మసూనా)

7. గోడమీద బొమ్మ (పొడుపు కథలు) — సంకలనకర్త : వెలగా వెంకటప్పయ్య

8. వెలుగుబాటలు (జీవిత చరిత్రలు) — సంకలనకర్త : కవిరావు

ప్రతులకు :

**ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి**

34/4 RT, బర్కత్‌పురా క్వార్టర్స్

హైదరాబాదు-500 027

*Printed at Pragati Art Printers*